మక్కికి మక్కిగాఁ దెనుఁగు మాత్రము సేయఁగఁ బూన నేనసల్
తిక్కనదొట్టి సత్కవులు తీర్చిన తీర్పుల నాకళింతలన్
మిక్కిలి ముద్దొనర్తును గమించెద వారల దారి నా కిఁకం
దక్కువ యేమి జాతిరతనమ్ముల సానలఁబట్టి తీర్చెదన్

పల్లకిఁబట్టి మత్తకరిపై నిలఁబెట్టి మహాదుకూలముల్
కొల్లఁగఁజుట్టి రత్నమయకుడ్య విచిత్ర గృహమ్ముగట్టి భూ
వల్లభు లిచ్చి "రీడవలు బాడవలు" న్మను వానిఁ గోర మే
మల్లిన గద్య పద్యముల నాదృతిసేసిన చాలు నియ్యెడన్



కవి కథానాయకుడు

ఢిల్లీలో సమ్మేళనము



కృతిభర్త :
గుత్తికొండ నరహరి

కృతికర్త :
కొండవీటి వెంకటకవి

# కృతిస్వామి

శా. శ్రీరాస్వామను బ్రహ్మవాదుల యశశ్శ్రీరేఖలోఁ గావ్యక
న్యారత్నమ్ముల నైగనిగ్యములు దివ్యజ్యోతులై నిల్చెఁ దే
జోరాజుల్ కృతికన్యలం గొని యశస్సుల్ పంటపండించి రా
ధీరోదాత్తత గుత్తికొండ కుల మందెన్ జెందె నిత్యత్వమున్.

సీ. శ్రీనాథకవిరాజు జిహ్వాంచలమ్మున
బాలచంద్రుని కత్తి పదను వెట్టె
మల్లయ్య కొండయ్య మంత్రాంగశక్తిలో
నాయకురాలు విన్ననువు చూపె
ముదిగొండసుకవీంద్రు హృదయ పీఠికపైని
పెద్దన్నశక్తి పింపిసలు గూసె
పటుకూరి మహాకవీశు నిర్మితిలోన
మాంచాల శీలసంపద వహించె
నిన్నిటికి యత్ప్రభావ మూహింపఁ దత్ప్ర
భావమే గుత్తికొండ యన్వర్థమయ్యె
భాగవతశేఖరుం డల బ్రహ్మనాయఁ
డొత్తగిల్లిన నునుకొండ గుత్తికొండ.

ఉ. గీతకు గీ[illegible]నొట్టి జయగీతిక పాడి మహాంధ్రదేశ వి
ఖ్యాతిని సర్వదిక్తటములందున నిల్పిన రామసామికిం
జేతము నాగసానిపయి శీలము బ్రహ్మనపైని నిల్చె నీ
రీతికి గుత్తికొండ యురరీకృత హేతువు సూ తలంపఁగన్.

సీ. దాక్షిణాత్యులచరిత్రకు నాందివాక్యమ్ము
గొంతెత్తిపాడిన గుత్తికొండ
పరమార్థతత్త్వవిద్వరసమాశ్రయగర్భ
కుహరమ్ము గల్గిన గుత్తికొండ
ధరణీ ధరేంద్ర మస్తక రత్న పాళికెఁ
గుదురుగా వెల్గిన గుత్తికొండ
కవిశేఖరులకు సత్కావ్య నిర్మాణ సం
పత్తి చేకూర్చిన గుత్తికొండ
నిజనివాసమ్ముగాఁగఁ జెందిన యశమ్ము
శాశ్వతమ్ముగ నారవిచంద్రభముగ
గుత్తికొండాన్వయమ్ము మొల్కెత్తెనచట
మన్నెహంవీర బిరుద సమ్మాన్య మగుచు.

ఉ. పండితులైనవారు రసవత్కృతులెల్ల రచించి వించుచో
దండిగఁ బైఁడిపాళ్లను యథామతి దానము లిచ్చియుంట వా
క్కొండలు పైఁడిపాళ్లను యశమ్మును సుస్థిరతం బొనర్ప నా
ఖండల గోత్రి సన్నిభముగా వరగోత్రము నిల్పి దుర్వరన్.

కం. ఆ వరగోత్రమ్మునయం
దావిర్భవ మందె నరసయాఖ్యుఁ డతండున్
దేవేరిగ రంగాంబను
బావనిఁ జేకొనియె వంశవర్ధనకాంక్షన్.

శా. సీతారామపదార్చనారతుఁడు కాశీసేతుపర్యంత వి
ఖ్యాతస్ఫీతచరిత్రుఁ డూర్జితమహాగాంభీర్యముద్రుండు ని
ర్ధూతాఘుండు స్వధర్మరక్షణ విచారుండైన నర్సన్న కీ
చేతస్తోషదమైన రంగమ యొనర్చెన్ సేవ లవ్వారిగా.

కం. వీరి తనూజులు కృష్ణయ
నారయ వీరయ్య లనఁగ నయగుణధుర్యుల్
నారయ పాగో ల్చేరెను
వీరయ యెలవఱ్ఱుచేరి విశ్రుతి నందెన్.

సీ. తెనుఁగు దేశప్రశస్తిని దిగ్విదిక్కుల
ముద్రవైచిన రాణిరుద్రమాంబ
మగువయై తెగువతో మగవారి నెదిరించు
మాన్యయా రావెళ్ల మల్లమాంబ
లలితకళారాధనల నిత్యసంతృప్తిఁ
బ్రకటించు రఘునాథరాయ నృపతి
ఋజువర్తనుండు శ్రీనృత్తరత్నావళీ
గ్రథకుండు జాయప్పఖడ్గికుండు
కులపతులుగాఁగ వెలసిన కోవయందు
శౌర్య ధైర్యవివేక గాంభీర్యములకు
నిరవుగా వీరయాఖ్య చౌదరి చెలంగె
దశదిశాసీమలను గమ్మఁదనము గ్రమ్మ.

మ. వరవంశమ్మును శాశ్వతమ్ముగను నిల్పంగోరి బంధుచ్ఛటల్
పరిశుద్ధాత్ములు మిత్రశేఖరులు నుద్వాహమ్ము గావించి రా
తరుణీరత్నము కోటమాంబిక పవిత్రప్రేమ నాత్మేశ్వరున్
దిరమౌ భక్తి భజించి పుత్రకుల నందెన్ బుణ్యగర్భంబునన్.

కం. వీరలు గృష్ణయ సుబ్బయ
శ్రీరాములు వీరిలోన శ్రీసుబ్బయ వి
స్తారయశుండై బుధమం
దారుండై వెలసె నన్నదానోత్సుకుఁడై.

ఉ. తల్లియుఁదండ్రియుం గురుఁడు దైవము బంధువు తానె యౌచు శ్రీ
మల్లముపాటి నారయ సమాదరణమ్మునఁ బుత్రికామణిన్
ఉల్లము పల్లవింపఁ దనయుగ్మలి కోటమ యాత్మమెచ్చు మే
నల్లున కిచ్చె జన్మచరితార్థత గాఁగఁ దలంచెఁ దృప్తుఁడై.

కం. తరుణీరత్నము రత్నమఁ
గరము సమాదరణమునను గైకొని సుయశ
స్విరుఁడై సుబ్బయ కవిబుధ
వరదుండై వెలసె ధర్మపత్నీవ్రతుఁడై.

సీ. ఏ రామ విద్వత్కవీశ్వరావళి కెల్ల
బంగారు పంటయై పరిఢవిల్లు
ఏ లేమ సద్బంధుబృందంబులకు నెల్ల
దివ్యాగమమ్మునై తేజరిల్లు
ఏ సాధ్వి సతతక్షమాసంపదల కెల్ల
నెల్లయై పొగడిత నుల్లసిల్లు
ఏ తన్వి వేళాగతాతిథిచ్ఛట కెల్ల
నమృతహ్రదమ్మునై యతిశయిల్లు
నట్టి నారీమతల్లి రత్నాంబ తనకు
గృహిణియై పూర్వవంశసత్కీర్తిఁ గూర్ప
నాయురారోగ్యభోగభాగ్యములు సుబ్బ
సుబ్బయఘనుండు దేవతాసురభి యయ్యె.

శా. భార్యాభర్తల నోములెల్ల ఫలియింపన్ వంశమర్యాదలున్
గార్యాకార్యవినిర్ణయమ్ములును గల్గం గల్గి రాత్మోద్భవుల్
శౌర్యౌదార్య గుణార్ణవుండగు హరిశ్చంద్రాభిధానుండు శ్రీ
యార్యస్తుత్యుఁ డాంజనేయులును జంద్రార్కప్రతీకాశులై.

కం. ఆ పుత్రయుగ్మమందును
శ్రీపతిచరణారవిందసేవాధర్మ
వ్యాపారుఁ డాంజనేయులు
ప్రాపించె నఖండయశము బంధురభంగిన్.

కం. హృద్రాజీవస్థాపిత
భద్రాచారుండు ధర్మవర్ధితభాగ్యో
న్నిద్రుండు సర్వసుగుణ స
ముద్రుండల యాంజనేయపుణ్యుం డెలమిన్.

సీ. తన నిత్యజీవితమ్మున నొక్కమచ్చైనఁ
గలుగని విబుధపుంగవుఁ డితండు
తనజీవికకు నొక్కయనృతవాక్యమైనఁ
దలఁపని ధర్మపుత్రకుఁ డితండు
తనవృత్తిలో నొక్క యణుమాత్ర హింసయే
నెఱుఁగని బలభద్రవరుఁ డితండు
తనకార్య నిర్ణయమ్మున నొక్కయడుగైన
సురుఁగని యానంద సుతుఁ డితండు
అని జనానీక మెన్నఁగా నాంజనేయ
చౌదరి వసించె నెలవట్టు జనపదమున
సార్థకాహ్వయుఁడగు హరిశ్చంద్రనీఁడు
భ్రాతృతం జూడ సత్కృపాపాంగములను.

ఉ. మానధనుండు సత్కవిసమాజనుతుండగు గోగినేని ల
క్ష్మీనరసయ్య పూజ్యమతి శ్రీమతి సుబ్బమ లాత్మపుత్రికన్
సూనశరోపమానుఁడగు సూనృతవాదికి నాంజనేయ భూ
జానికి రాఘవాంబిక నొసంగిరి మెచ్చి రుదాత్తమానసుల్.

శా. అష్టైశ్వర్యధురంధరుండగు నిజప్రాణేశు పాదాబ్జముల్
శిష్టాచారముతో భజించు మది హర్షించున్ సుతావాప్తికిన్
హృష్టస్వాంత మొనర్చు బంధుజనమున్ మృష్టాన్నపానమ్ములన్
దుష్టిం గూర్చును రాఘవాంబ బుధసందోహమ్ము నేప్రొద్దునన్.

కం. ఈ రమ్యగుణులు లక్ష్మీ
నారాయణ వేంకటరమణయ్య నరహరుల్
గూరిమి సుతులుగ సుతగా
ధీరాత్మను సత్యవతి సతిం బడసి రొగిన్.

కం. ఘనుఁడగు లక్ష్మీనారా
యణ హూణమునందుఁ బట్ట మందెను విద్యా
ధనులగు పుత్రులఁ బుత్రిక
లను గాంచి సమస్తసుఖములను గాంచె ధరన్.

కం. అమృతహృదయుండు వేంకట
రమణయ్య శకుంతలాఖ్యరమణిని గడు నె
య్యమునను నుద్వాహమ్మయి
కమనీయచరిత్రఁ బుత్రికామణిఁ గాంచెన్.

కం. తన సుగుణమ్ముల గుణమగు
ఘనతరమగు వైద్యవిద్య గడియించె సులో
చననామధేయ యెల్లరు
గొనియాడుదు రిద్ధచరితకుం గుదురనుచున్.

తే. ధన్యుఁ డాళ్లూరివంశవర్ధనుని ఘనుని
వైద్యవిద్యావిహారు సుబ్రావు ధీరు
రీవిదీవి సులోచనాదేవి ప్రేమఁ
బరిణయం బాడె బాంధవ ప్రకర ముబ్బ.

కం. కలుముల చెలువకు నెనయగు
నలినానన సత్యవతి మనఃప్రమదమునన్
వెలగా వంశోద్భవునిన్
నలరూపుని గొనియె సూర్యనారాయణునిన్.

చం. మురహరుఁడే యెదిర్చిన సముద్ధతిఁ జూపినఁ గొంకుకెన్నఁడే
నెఱుఁగనివాఁడు మానవ సమిద్ధచరిత్రను మూలముట్టుగా
నెఱిఁగినవాఁడు పండితకవీంద్రుల కెంతయుఁగూర్చువాఁడు మా
నరహరి కావ్యకన్య కథినాయకుఁ డాయె సమాదరమ్మునన్.

చం. గురుతర కార్యధూర్వహుఁడు కోవిదవంద్యుఁడు సర్వసద్గుణో
ద్ధురుఁడు సమస్తకార్య గుణదోష విశేష వివేచనోచిత
స్థిరతర బుద్ధివైభవుఁడు ధీరవరేణ్యుఁడు గుత్తికొండ శ్రీ
నరహరి కావ్యకన్యకు మనఃప్రమదమ్మునగూర్చె భర్తయై.

చం. తరతమభావసంతతులు దార్కొన మార్కొనలేక బాలకుల్
పఱియలు వాఱువేళ నొకపట్టునఁ దానొక బాలవీరుఁడై
గరగరిక ల్పొనర్చి మొనకట్టెను నిల్పెను నొక్క త్రాటిపై
నరహరి, వీనిసద్గుణ గణమ్ము లనల్పము లాత్మదర్శముల్.

చం. పరిపరి రీతులన్ మెలఁగు భారతసంహితలోని మర్మముల్
మొఱకుఁదనమ్ములున్ మనకు మూలముముట్టుగఁ దెల్పినట్టి ధీ
వరుఁడగు రాయి చిత్తమున వర్తిలి మన్నన లందినట్టి మా
నరహరి యీ యుపజ్ఞ గమనమ్మున భావన సేయఁగాఁ దగున్.

సీ. సభల వాక్రుచ్చెనా! జరరోరగస్వామి
పదివూఁకతలలు కంపమ్మునొందు
దయఁబాఱఁజూచెనా! నయకోవిదుల గేహ
రాజి రత్నాల వర్షమ్ము గురియు
కలము చేపట్టెనా! గద్యహృద్యమ్ముగా
హూణాంధ్రభాషల హొయలు చిందు
ఔను గాదనియెనా! హరిహరాదులనైనఁ
దీండ్రించి యెద్రిచి సాధించి తీఱు
మురిపముం జూపెనా! ముద్దుముద్దు మీఱు
నాత్మవర్గీయులకు హృదయము నొసంగు
మాననీయుండు రాఘవాంబా సుతుండు
నరహరి జితారిబృందసంధా నరహరి.

సీ. వాణిజ్యమున నూత్నపథము నుత్పాదింపఁ
బరదేశముల నెల్లఁ దిరిగినాఁడు
అధినాయకుల యాశయముల భాగస్వామ్య
మించించుకయ యుపార్జించినాఁడు
ఆమూలచూడమ్ముగా మహోత్తమమైన
తత్వశాస్త్రము నెదం దాల్చినాఁడు
నిజరూపమునకు వన్నియఁ గూర్పఁగాఁజాలు
సౌజన్యమందఁగాఁ జాలినాఁడు
రైతునాయకుఁ డాచార్యరంగతోడ
స్తుత్యుఁడౌ రఘురామయ్యతోడఁ గూడి
యాశిషమ్ముల వేవేల నందినాఁడు
నరహరి జితారిబృందసంధా నరహరి.

తే. మాన్యచరితుండు తనమేనమామ రామ
కృష్ణయాఖ్యుండు కూర్మిపుత్రిక సరోజి
నీమహాసాధ్వి నొసఁగి పెండిలి యొనర్చె
నరహరికి బంధుబృంద మానంద మంద.

ఉ. ఈలువు వంగడంబుగల యింతులలోపల మేలుబంతి యీ
బాలిక హేతువాద వరివస్యితుఁ డీతఁడు సత్యశౌచ సం
శీలము లిట్టి దంపతులఁ జేరు సుమీ యని యెల్లవారు మే
ల్మేలని సన్నుతుల్ సలుప మించిరి దానకళాప్రవీణులై.

తే. ఆంజనేయుండు, శ్రీరాఘవాంబ, సత్య
వాణి, రమణేంద్రబాబనువారి వర్ధ
మానులం గాంచి సకల సంపత్సమృద్ధి
నలరుదురు వీరు సమ్మోదగరిమ మీఱ.

సీ. అనుపమమ్మనను ఛాయాదేవి వెన్నాడ
ద్వాదశభానుఁ డెందాఁకనుండు
ఆకాశవీధీ విహారానుహారియై
తారకానాథుఁ డెందాఁకనుండు
మేరమీఱక నిజోర్మికల నుప్పొంగు ర
త్నాకరస్వామి యెందాఁకనుండు
శాక్యసింహుని తపశ్శక్తిపూరితములై
ధర్మబోధనము లెందాఁకనుండు
ధర్మసింధువు మోహనదాసుగాంధి
నామధేయమ్ము జగతి నెందాఁకనుండు
నంతకాలమ్ము గుత్తికొండాన్వయమ్ము
మాననీయమ్ముగాఁగ సంపదల మనుత.

గ్రంథకర్త
వేంకటకవి.

# నెహ్రూ చరిత్ర

## పర్యటనము

చం. పలువురు దుర్మదాంధులకుఁ బ్రాపగు దేశమునందు విప్లవ
జ్వాలనము పెల్లురేఁగుఁ దమశాసన మీచతురబ్ధి మేఖలం
దలకొనఁ జూచువారికి వినాశము తప్పదు పోరుగోరు మూ
ర్ఖుల కలవోకగా జయము గోరి వరింపదు ధారణీస్థలిన్.

ఉ. వీరులు మారిఁబోయిన వివేకము పాకము దప్పియున్న భూ
సారము సన్నగిల్లిన విశాంపతు లాత్మ సుఖైక కాంక్షులై
తీరుపు దిద్దకున్న జగతీవలయమ్ము లయమ్మునందు నీ
క్రూరత నేలనాల్గు చెఱఁగుల్ గనుపించె యథేప్సితమ్ముగా.

చం. రణమను సాకుతో నిరపరాధుల రక్తనదీప్రవాహముల్
తొణఁకిసలాడెఁ బాలకులతోఁ బ్రతి నిత్యము పౌరకోటికిన్
గొణగొణ లెక్కువాయెఁ దినఁగూడును గుడ్డ లభింపకుంట చే
నణఁగెను బీదబిక్కి, యణఁగారెను యూరపు ఖండమంతయున్.

ఉ. ఇంతటి ఘోరయాతనలనెల్ల సహింపఁగలేక విప్లవ
స్వాంతులు పెల్లురేఁగిరి, దిశావలయమ్ములు దద్దరిల్లఁగా
గొంతులు విప్పి, రీబ్రదుకుగూడదు మాకని ముక్తకంఠులై
సంతనకట్టి, రుద్యమముసాఁగె నికామము లెల్లఁదీరఁగన్.

ఉ. ప్రాఁతజగమ్ము పోకడలు పాడఱె నూత్నజగమ్ములోజనుల్
భీతితొలంగి నిల్చి రరిభీకరులై, తరుణీజనమ్ము వి
ఖ్యాతియుఁగాంచెఁ జెడ్డయొక కాలమునందును మేలుగూర్చు నా
నీతివచస్సు నిల్చె ధరణీ పరిణేతల మానసమ్ములన్.

కం. పదుమూఁడేఁడులు గడచిన
యదనున నేఁ బదము మోపి యరసితి స్నేహా
స్పదమా యూరపు ఖండము
మది ముద మొదవంగఁ జేసె మాకెల్లరకున్.

కం. ఇరువురు తోఁబుట్టువు లిం
దిర కమలానెహ్రూ లెదల నిండిన మోద
మ్మిరవుకొన నుండి రందుం
గర మారోగ్యమ్ము నబ్బెఁ గమలకు నచటన్.

కం. వెన్నీసు పురనివాసము
గన్నాఁడను మాఱుమూలఁ గల మన వారిం
గన్నారఁ గన్నవాఁడను
విన్ననువున విన్న వింతు వివిధార్థంబుల్.

కం. పర పరిపాలనమునకుం
దిరముగఁ దలలీని భారతీయుల నిచటన్
దరిసించితి దేశబహి
ష్కారణమ్ముల నందు నుక్కుగండెలు వీరల్.

గీ. కలిమి గలిగియు భృత్యవర్గమ్ము లేక
తమకుఁ దామయి సర్వకార్యములొనర్చు
కొనెడు "శ్యాముజీ కృష్ణవర్మను" జినీవ
జానపదమున హర్మ్య రాజమునఁ గంటి.

ఉ. ఆతని నేత్రకోణములయందు నివాసమొనర్చు విప్లవ
జ్యోతులు దేశగౌరవ సముద్ధరణమ్మున కెత్తు మంగళ
జ్యోతులు దేశదాస్యదళనోన్ముఖ మానస జాతభావ సం
ఘాతము లానుపూర్వికముగా బయలంబడు మిత్రసన్నిధిన్.

ఆ. వానిపత్ని సుగుణవతి విదేశమ్ములఁ
జదువు భారతీయసుదతులకును
వెచ్చపెట్టె నాత్మవిత్తంబు సర్వంబు
మగని యభ్యనుజ్ఞ సిగ ధరించి

గీ. అధిపతులతోడి పొత్తుచేయంగఁ బోవఁ
డనధికారులతోడ స్నేహము నొనర్చు
మానవత నిల్పుకొనెడి యాత్మాభిమాని
పరుల దాష్ట్యమ్మునకు సహింపంగఁబోఁడు.

చం. చదువఁగఁ దెల్విగల్గి ధనసంచయ మించుక లేక పేదలై
మదిని ముడుంచుకొన్న యభిమానధనుల్ గల రట్టివారికై
యొదవిన నాదువిత్త ముపయోగ మొనర్చెద ధర్మకర్తృతా
పదమును నిర్వహింపు మని పల్కె ననుంగని కృష్ణవర్మయున్.

ఉ. మాటలు మప్పవచ్చు నభిమానము చూపఁగవచ్చు డబ్బుకుం
బూఁటపడంగఁ బూనునెడఁ బుట్టు ననర్థములెన్నొ యిట్టి జం
జాటమునం దగుల్కొనెడు సాహస మించుక లేని నేను నా
పాటవ మింత గుర్తెఱిఁగి పాసితి నాపని నాచరింపఁగన్.

వ. స్విట్జర్లండులో రాజా మహేంద్రప్రతాపుని జూచితిని. అతఁడతివిచిత్ర మైన మానిసి. వేసబాసలయందు వైలక్షణ్యము గలిగి చూచు వారలకు వింతగొల్పుచుండును.

కం. తిరిగెడు వేళలఁ జీనా
పురజను లెవ్వారొ పొత్తములమంజూషన్
హరియించిరంచుఁ జొక్కా-
కిరువైపుల సంచు లెన్నియే న్గుట్టించెన్.

కం. తన సాహసకృత్యమ్ముల
వినిపించెడివేళ వీనువిందొనరించున్
మన మురళింపఁగ వానిం
గను నప్పుడు సంతసంబు గలిగెను నాకున్.

కం. ఆనందసంఘు మనునొక
దానిం బలుఁబొందఁజేసెఁ దా నధిపతియై
పూనిక నంతర్బుద్ధిని
"నానందో బ్రహ్మ" యనెడు నర్థ మెఱుఁగుటన్.

కం. ఇటలీదేశము నేగితి
నట నొబిదుల్లాను మౌల్వినరసితి నతఁడుం
బటు బుద్ధిశాలి మాటల
నిటు నటు దొర్లించి మించు నెంతటివానిన్.

కం. ప్రాచీన ధోరణుల న
ర్వాచీనపు సంస్కృతుల ప్రభావము లణఁచున్
మోచాఫల సదృశమ్మగు
వాచా జృంభణము చూప వలఁతి యతండున్.

తే. చుఱుకుపా లెగఁ బోసెడి చూపుగములు
కనలి పైఁబడునట్లుండు కంఠరవము
మదికి వెఱపుట్టఁజేయు కామా యభిఖ్య
నలరు దొరసానిఁ 'బ్యారిసు' నందుఁ గంటి.

సీ. ప్రాఁత పోకడల కుద్వాసనంబిడి నూత్న
మార్గముంద్రొక్కు సంస్కారమూర్తి
ముసిముసినవ్వు నెమ్మోముపై రాణింప
విన్నాణమౌ సుప్రసన్నమూర్తి
సుఖదుఃఖములకు హెచ్చును లొచ్చు నెఱుఁగని
వారాశి సదృశ గంభీరమూర్తి
విద్యాధనమ్ము లుద్వేలమ్ములై యున్న
గోరింపు లెఱుఁగని ధీరమూర్తి
బర్కుతుల్లాఖ్య మాల్వి సత్పండితుండు
నగుపడియె నాకు బెర్లిను నగరమందు
మధుర మధురమ్ములైన సంభాషణముల
నామెతలు గూర్చె మన్మనస్సీమ నతఁడు

లయ విభాతి. చదువుగలవారలకు మదిమొదవఁ బోదు మది
చదువులును గల్గ గుణ మధికము నశించున్
జదువు మది సద్గుణము లొదవిన సమత్వమును
గదుర దది గల్గినను బొదలదు యశమ్మున్
మొదలు తుదిదాఁక నొక పదవి లభియించుటయుఁ
గుదుర దిటులన్నియును గదిసిన మనుష్యున్
జదురు గలవాని భువి వెదకినను లేఁ డనుచుఁ
బదుగురను జూడ నిది విదితమయి పోయెన్.

తే. కాన సద్గుణగణ మొక్క మానవునకుఁ
గలుగఁబోదంచు నుడువ సాక్ష్యమ్మునకును
గలఁడు చంపాక్రమణపిళ్ల గలిసికొంటి
నతని బెర్లిను పురమున హర్ష మొదవె.

కం. జాతీయత యొక్కటియే
యాతని కర్థమ్మునయ్యె నాడంబరముల్
చేఁతలు వ్రాఁతలు కూఁతలు
ప్రీతిం జననిచ్చు విను వివేకులు గల్గన్.

కం. అధ్యయన ధర్ముఁ డాగమ
విద్యా సంపన్నగుణుఁడు వీరేశచటో
పాధ్యాయుఁ "డాక్సు ఫర్డన"
నిధ్యానము నిచ్చి మివుల నింపె ముదమ్మున్.

కం. కూటికి గుడ్డకు లోపము
వాటిల్లి భరింపరాని వ్యయమొనరింపం
బూఁటలు గడవని పరదే
శాటనమున నిత్యజీవి తాంబుధి నీఁదెన్.

కం. కనుమాసిన వస్తువులుం
జినిఁగిన దుస్తులును జివికి జీర్ణించి పురా
తనమైన గ్రంథనిచయము
తన ధనమై క్రాలఁ దృప్తతం గాంచు నెదన్.

కం. ఏడుపుగొట్టు మొగంబులఁ
బీడింపంబడెడు వారి విభవము నాకుం
జూడ నసహ్యత గూర్చున్
వాఁడిమి లేనట్టివాని బ్రదుకొక బ్రదుకే.

ఉ. తా ననుకొన్న పంతము వితావితమై చన నుక్కురోసమున్
మానక బంధు మిత్ర బుధ మాన్యజనమ్ముల వెంటనంటి దు
ర్మానము చూపుచో నిహపరమ్ముల కూరక దూరమై చనుం
గాన వివేకహీనుఁ డెటుగా వరివస్యితుఁడౌ జగమ్మునన్.

కం. అత్యంతోత్సాహమ్మున
నిత్యము హాస్యమున సత్య నిష్ఠా పరసా
హిత్యమ్మున శీలమ్మున
మత్యగ్రేసరుఁడు సుఖత మను నిజ్జగతిన్

తే. ఇట్టి సద్గుణగణము చేపట్టి నిలిచెఁ
గష్టములఁ దలయొగ్గి స్వాగతము వల్కె
ఘనుఁడు వీరేంద్రనాథుఁ డాతని హితమ్ము
గలిగె నామది కది యూఱటలను గూర్చె.

చం. కన విన దుస్సహమ్ములగు కష్టములన్ సహియించి మించు నీ
తని కిదమిత్థమంచు నెడఁదన్ భరియింపఁగ రాని పోని వే
దన సమకూరె మాతృవసుధం బదమూన నటన్న శోకమున్
జననియు జన్మభూమియును స్వర్గముకంటె ముదమ్ము గూర్చెడిన్.

కం. ఇదియే ప్రవాసి హృదయము
వ్యథపెట్టకమాను జీవితాంతము వఱకున్
బదుగురు తన బంధుగులను
గదియని మనుగడయు రోఁత గాదా! తలఁపన్.

కం. ఆశారేఖాంకూరా
వేశమ్ముల దేశదాస్య విదళన కరణో
ద్దేశములు గల్గువారి వి
దేశమ్ములఁ గంటి సుప్రతిష్ఠుల నచటన్.

కం. ప్రఖ్యాతి గల్గు జన సమ
భిఖ్యలఁ గొన్నింటిఁ దెలుప వీలాయెను నా
లేఖ్యమున లేని ముఖ్యుల
సఖ్యమ్ము ముదమ్ము గూర్పఁ జాలెను నాకున్.

సీ. భావదాస్యమ్ము దుల్పఁగ నెత్తిన పతాక
సామ్యవాద విధాన చక్రవర్తి
ప్రాక్పశ్చిమార్థశాస్త్రజ్ఞాన కోశమ్ము
ప్రఖ్యాత నవయుగ భాష్యకర్త
విశ్వమానవతత్త్వ వేతృతానయశాలి
పరిశుద్ధ జీవితాధ్వగవరుండు
బహుళ మూఢాచార పర్వత దంభోళి
నవమానవత్వ నిర్ణాయకుండు
సజ్జన హితుండు 'రాయి' రష్యాధరిత్రి
దర్శన మొసంగి నాకు సంతసము గూర్చె
ముడివడిన దీర్ఘసందేహముల వెలార్చె
నవనవోన్మేష దివ్యవిజ్ఞాన ధిషణ.

శా. భూమానందము మానవత్వమును గోల్పోఁబడ్డ కాలమ్మునన్
'రోమారోల' మనుష్యు నున్నతపదార్థుం జేయఁగాఁ బూని భా
షా మాహాత్మ్యముఁ జూపి భవ్యకవితా సామ్రాజ్య పీఠస్థుఁడై
ప్రేమాధిక్యము నెల్లయెల్లలను నిల్పెన్ విశ్వసౌభ్రాతృతన్.

ఉ. ఆతని గాంచి మా హృదయ మందిన కమ్మని జీవభావనన్
జేతము లుల్లసిల్లెను మనీషుల కాతని హేతుబుద్ధికిన్
ప్రాఁతచరిత్రముల్ విరియఁ బాఱె పునాదులు పట్టుదప్పినన్
బీతు జనించెఁ బెద్దల కభీష్టము చేకుఱె నెల్లవారికిన్.

చం. కవియగువాఁడు జాతిమత గర్వముతో జనుపాంధుఁడైనచో
భువిఁగలవారి జీవధనముల్ గొనుటెంతియు గాదు శాశ్వత
ప్రవిమల మానవత్వమును భస్మమొనర్చు నుపద్రవమ్ములన్
రవరవ లేక కూర్చును బడల్పడఁజేయును విశ్వగోళమున్.

కం. తన కొక్క మేలు లేదా
తన జాతికి మేలు లేద తనభూమికి మేల్
మనమునఁ దలఁచెడు కవియొక
మనుజుఁడె తత్కవిత లోకమాన్యతఁ గనునే.

శా నీ నా భేదములేక విశ్వహితము న్వీక్షించి కన్నాకుగాఁ
దానై ముందరనిల్చి సర్వసమతాధర్మమ్ము బోధింప వి
ద్యానంమండయి సత్కవీశ్వరుఁడు వ్రాయుం గంటముం బూనినం
ప్రాణింబ్రాణిని బొట్టఁ బెట్టుకొను నీర్ష్యాసూయముల్ మాయవే.

కం. ఈ "రోమారోలా"తో
భూరిస్నేహమ్ము చేయు బుద్ధిపోడమి క
స్తూరిబా ప్రియనాథుని
చీరకముం గొంటి సుపరిచితముం గంటిన్.

కం. యువకవి 'టోలరు' జర్మను
భువిఁ గంటిని వాని రచనముం గనిన మహా
కవులెల్ల రాశిషమ్ముల
సవసవ లేకడిరి భవ్య శబ్దాక్షతలన్.

మంజరీ ద్విపద.
పరభాష నెంతగాఁ బాండితిం గన్న
రచియింప లేరు సద్గ్రంథ రాజముల
విరచించినను సద్వివేకమ్ము గల్గు
మతిమంతు లెవ్వ రా కృతిమెచ్చఁబోరు

దేశాభిమాన ముద్దేశపూర్వముగ
నిరసింపఁజేయు నిబ్బరము వోనాడు
సమకాల కవులు మెచ్చరు తోడివారి
నన్యదేశీయులెట్లామతించెదరు
వరగుణమ్ముల కాల వాలమైచన్న
శబ్దార్థసంస్కార చాతుర్యమున్న
ఎద పోఁక రోమాంచ మొదవించుచున్న
కావ్యమ్ము సకలదిక్తటములఁ గ్రమ్మి
మన తన భేదమ్ము మాన్పించుఁ గాదె
భారతీయుండు 'గోపాల ముఖర్జి'
సత్కవీశ్వరుఁడు భాషాతత్త్వవేది
తనభాష తనదేశమును వీడిపోయి
యమెరికా వాస్తవ్యుఁడై గ్రంథపటలి
విరచించి యచ్చోట విఖ్యాతిఁ గాంచె
బుద్ధి సంపద నొరుఁ బోల్పఁగా వశమె
వీని తోడ 'జినీవ' లో నేస్త మబ్బె
"ఫ్రాంకుబుక్మను" నొక్క పరి గూడి యుంటి
మన భూమి మున్ను సంబర ముబ్బరముగఁ
బరికించితిని జినీవా పురి నేఁడు
వీని సిద్ధాంతమ్ము లానంద మిడును

# వివాదములు

ఆ. గనులఁ బనులఁజేయు కార్మికవ్రాతమ్ము
పట్టుఁబట్టి సమ్మె కట్టె నాంగ్ల
దేశమందు ననెడు తీవ్రతరాందోళ
నమ్ము దెసలఁ గ్రమ్మి చిమ్మెరేఁగె.

ఉ. చీఁదఱరేఁగి వాఁగి బలు సేగి యొనర్చుచు మానవత్వముం
గాదని మిన్నుముట్టి తిరుగం దలపెట్టు ననర్థకారులం
బాదము వట్టి మీదయకుఁ బాత్రులఁడ బిడ్డలు గల్గువాఁడ న
త్యాదరవృత్తిఁ జూడవలదా! యన మోదము నందరెంతయున్.

కం. శ్రీమంతుల దౌష్ట్యమ్ముల
స్వామిద్రోహముల నెఱుఁగఁ జాలక బ్రదుకం
గామించు వారి కెయ్యెడ
లేమిడిలో భేద మింత లేదు ధరిత్రిన్.

కం. నక్కిళ్లు వడ్డ నోళులు
బిక్క మొగమ్ములు భయమ్ము పీడించు కనుల్
బక్క శరీరమ్ములు నా
చక్కటిఁ గనుఁగొంటిఁ గంట జాజులు గంటిన్.

కం. పసివాళ్లు వాడి వేసరి
కసుఁగందులు చంటవెంటఁ గారింపంగా
నుసులు దిగఁద్రావి యాల్మగ
లెసలారిన దిగులు బ్రింగ నెంతురు మదులన్.

కం. ఇంకొక చోద్యము గలదీ
సంకటములఁ దీర్పఁగా విచారణచేయన్
మంకు లగు గనుల ఱేఁడులఁ
గొంకక సమకూర్చె విభుత కుసిగుంపులుగా.

ఆ. మొగము వాంచి పరుల మోచేతి నీటిని
గోరువారు సమ్మె జేర కునికి
వెక్కిరించి రనుచు వెలఁదుల నలువుర
బచ్చకీడ్చి కాల బూచినారు.

చం. సమయముఁ జూచి నోరదిమి చక్కటులెన్నియొ చెప్పఁగోరుకుల్
భ్రమగొనఁ గొంతమంది పనులంజొరఁబాఱిరి వారిచేతలం
గ్రమమున నల్వురందుకొనఁ గల్గిరి నిల్వఁగలేక మెల్లఁగా
సమతులలోని వారు దిగ జాఱిరి మాఱిరి కూటి పేదలై.

ఉ. సంతన లేక కల్మిగల సాహుల ధాటకుఁ దాళలేక గ
ల్లంతుల నాఁపలేక తమ లావిదియంచు నెఱుంగలేక వా
రంతట వారె సమ్మె విడనాడిరి హూణులు, భారతీయులీ
వంతలఁ జిక్కుచో నడుగు వారెవరుందురు జాలిగుండెలన్.

కం. శాసన సభలకు నెన్నిక
లీసమయమ్మునన వచ్చె నిరుదెగలై యు
ల్లాసమ్ము రేఁగ నాయకు
లాసాసలఁ గ్రుంక ఛేద మగ్గల మాయెన్.

కం. జాతీయ సభ యొనర్చిన
నీతికి నేఁడేమి ముప్పు నెలకొనెనో యీ
చేఁతకుఁ గారణమేమో
చేతమ్ములు విప్పి చెప్ప సిద్ధపడరు సూ!

ఉ. కాసును గీసు దూసి బ్రదుకం దలపోయుచుఁ దప్పుఁద్రోవ ల
భ్యాస మొనర్చుచుం బయలు బంగరు సేయఁ దలంచువార లా
యాసము నందుచుందురు జనాభ్యుదయమ్మున కేపగింతు రీ
వీసర పోవువారు వెలివేసిన దోస మదేమి సంస్థకున్

ఆ. ధనము మతము కులము తాఁకిన మైలందు
ననెడువారు సందు కోనిన నాఁడు
పేదసాదు లెవరు పాదమ్ము మోపరు
సమసిపోవు సంఘ శక్తి తుదికి.

కం. తమకోరికి నెఱవేఱని
సమయమ్ముల వెలికిఁబోవ సాగెడివారిన్
మమత వెలయించి యెవ్వాఁడు
తమకమ్మునఁ జూచుఁ జూడఁ దత్ఫల మేమీ!

ఆ. తప్పుఁ జూప నాకతాయలు మూఁకలై
విననినాఁడు తొలఁగి చనుట మేలు
పరులభావ మరసి పరికించి దరిసించి
యచ్చొ ముచ్చొ తెలియ వచ్చుఁ గాదె.

వ. సంఘమునఁగల్గు మేలు గీళ్లు విచారింపక తమ మనోభావముల వెల్ల
డింపక మాలవ్యా లజపతులు కాంగ్రెసు సంస్థనుండి తొలఁగిరి.
దీనికిఁ గారణ మ్మెఱుంగనైతి. ఎన్నికల సంరంభమున లజపతి
మాత్రము కాంగ్రెసు నాయకులు భారతీయేతరులతోఁగూడి కుత్సి
తపుటూహల దేశద్రోహ మొనర్చు చున్నారని వివరించెను.

కం. లాలా లజపతి వాదము
గాలించిన మనకు నిజము గన్పట్టదు దు
శ్శీలుఁ డెవఁ డిట్టి దుష్కృతి
పాలంబడు మాతృదేశ భగ్నోత్సుకుఁడై.

గీ. ప్రతినిధుల నెన్నుకొనెడి సంరంభములను
గలుగు నీలాపనింద లగ్గలము దలఁప
నెట్టివారలు సత్య మూహింపలేరు
జయజయ ధ్వానముల దిశాచక్ర మగల

ఉ. గందపుమ్రాని మీఁద భుజగమ్ము జలమ్మున నక్రమట్టు లా
నందము చిందు దివ్యభవనమ్ముల సాహుల పాదదాసులై
డెందము గందళింపఁ బురడించు మహామహు లాత్మతృప్తి చే
కొందురు పేదవారి బలిగొందురు సభ్యుల నెన్ని వేళలన్.

ఉ. కాని తలంపుతో భరత ఖండ నివాసి మతప్రవక్తలం
గాననినాఁడు వేదహితకర్మ మెఱుంగనినాఁడు వైదిక
జ్ఞానము మోక్షదాయకము గా మది నమ్మనినాఁడు మానవ
స్థానమునుండి వాఁడు దిగజాఱునసుం గడు మాలపీయుఁడున్.

ఆ. కట్టు బొట్టు జుట్టు చిట్టాడుత్రోవలు
పూర్వధర్మమునకుఁ బొందు పఱచి
మాఱురూపు వడిన మతము నుద్ధారింప
నడుముగట్టి కంకణమ్ము దాల్చె.

చం. మనమున సాంఘికార్థిక సమస్యల వ్యత్యయ మెన్నఁబోవఁ డీ
ఘనుఁడు సనాతనాధ్వమునఁ గాని చరింపఁడు రాకుమారు లీ
తని వెనువెంట మిత్రుల విధమ్మున నుందురు చేయి చాఁచుచో
ధనికులు కొల్లకొల్ల లుపదానము లిత్తురు మెత్తు రెత్తఱిన్.

చం. పరమత సంప్రదాయములు భారతభూమి నలంద ధర్మమే
పఱియలు వాఱు జాతి మత భావము లాఱు విరుద్ధసంస్కృతుల్
మెరమెర గూర్చ ధర్మ మవలీల నడంగు నటంచు నూహలం
బొరిఁబొరిఁ జేసెఁగా మదన మోహన పండితుఁడట్టి పట్టులన్.

కం. చేపడిన దాని విడువరు
ప్రాపింపనిదాని నంద వగవరు మిథ్యా
రోపిత మహానుభావులు
రూపింపఁగఁ బూన నిస్పృహో యనిపించున్.

గీ. ఐన నేమాయె నినుపాఱు వాని సేవ
ప్రీతిఁ గూర్చెను భారత జాతికెల్ల
నతి మధురమైన వాని కంఠా రవమ్ము
హృదయ తంత్రులఁ గదలించి మదికి నించు.

ఉ. చెప్పిన యంతవట్టు పని చేసియె తీరును వట్టి డంబముల్
గుప్పఁడు గొప్ప ముప్పెదురు కొన్నను బల్కినపల్కు నెప్పుడుం
దప్పఁడు కానిపుంతలఁ బదం బిడి తప్పుల నొప్పుఁజేసి క
న్గప్పఁడు వీని సద్గుణ గణమ్ముల నెన్నఁగరాదె యేరికిన్.

కం. మదికింపని మార్గమ్ముల
నడుకుడు పడువారు వెంట నంటెరి సౌఖ్య
ప్రదముగఁ బర భాగ్యమ్ములఁ
గదిమిరి మాలవ్య వీరిఁ గాదనఁడు గదా!

కం. ఈ తరుణ మ్మతి మానుష
మాతత మత భూత వికట హాసభయ వ్యా
ఘాతము దుర్మద జన సము
పేతము స్వాతంత్ర్య సమర వికలము నయ్యెన్.

సీ. హిందూమహాసభ యందు రేఁగిన చిచ్చు
నాలుకల్ కోడె మిన్నాగు రీతి
జాతీయ యువన సంస్థల విషజ్వాలలు
చప్పరించెను దిశాచక్రమెల్లఁ
దెరువాటు కొట్టు తుత్తరమూఁక చెయ్దముల్
మితి తప్పిపోయెఁ గంపింప జనులు
చివ్వకై మొన గాలు దువ్వు వారలు గేరి
బాహాప్పళించిరి బయలు బ్రాఁక
నల్పసంఖ్యాకులకు గుండె లదిరి పోయె
నధిక సంఖ్యాకులకు హర్ష మతిశయిల్లె
నమ్మగలు వమ్ముగా జీవనమ్ము సేయఁ
దలమె మనియుండఁ గోరు జీవులకుఁ దలఁప.

ఆ. పగటివేళ శాంతి పాఠముల్ వల్లించి
రాత్రివేళఁ బరుల వ్రచ్చునొకఁడు
శాంతిమత మటంచుఁ జక్కట్లు దిద్దుచు
హింస నెపుడు ప్రోత్సహించు నొకఁడు.

గీ. చేఁతలకు మాఱుచేఁత లుజ్జృంభణములు
చాఁదుకొనె జీవహింస వినోద మయ్యె
మతవిరాగులు సైత మున్మాదములకు
లొంగిపోయిరి జాతి కల్లోలములకు.

కం. ఈ వైషమ్యము లలజడు
లావేశము లింతలంతలై పెచ్చుటిలెన్
ద్రోవలు గానక ధనికులు
శేవగలును వగల దద్దఱిల్లిరి భయులై.

పణవ వృత్తము
గ్రామగ్రామము కలంతం గూరెన్
స్వామిద్రోహుల చనవుల్ మీరెన్
ప్రేమజ్యోతులు విడి చల్లారెన్
సామర్థ్య మ్మటి జనమూ మారెన్.

వ. మాలవ్యాలజపతులు సంస్థాపించిన జాతీయ పక్ష మీచిక్కుల నధిగమించి సంపూర్ణజయమునందెను చిత్తరంజనుదాసు నా తండ్రియు నెలకొల్పిన స్వరాజ్యసంస్థ కొంచె మూసరిల్లెను పోరాటమన నుత్సహించు చిత్తరంజనుఁ డిట లేకుండుటయే దీనికిఁ గారణము.

ఉ. పున్నెము పాపమేమొ తలఁపుం జొరనీక సుకమ్ములందు నీ
యన్నలు నిన్న మొన్నవఱకైన జనమ్ముల యీతిబాధలం
గన్నులఁ గాంచకే యిపుడు గావలె నోటులు మా కటంచు నీ
తెన్నులు ముట్టుచో నెవఁడు దీర్చును వీరలు పూను దాహమున్.

గీ. ధనము వెదచల్లి యోటులు గొనెడివారు
అప్పుసప్పుల నిచ్చి నో రదుమువారు
కుల విభేదమ్ములం గూర్పఁ గలుగువారు
జయము గాంతురు దీన సందియము లేదు

చం. కలిగినవారు రచ్చలను గాలిడఁ జేసెడివారు దౌష్ట్యముల్
సలిపెడివారు జాతిమత సంఘములుంచెడివారు నల్వురే
యలబలముంబొనర్తురు మహాపదముంతురు కంఠనాళముల్
నులుముదు రంతరంగములలో సివమెత్త నొనర్త రెయ్యెడన్.

ఆ. కలిమిబలిమి మతము కులము దైవము వీడి
నిలువలేరు సొంత బలములేక
పరుల నల్లఁ ద్రావి బ్రదుకిచ్చగించెడు
వీరె వేరుపురువులైరి నేఁడు.

కం. పదవులు బిరుదులు డాబులు
మదిఁ గోరినవారు యాజమాన్య మొనర్పం
గదిసిన నీ సంఘమ్ములు
గుదిసెను బో నేఁడు పుట్టగొడుగులు వోలెన్.

వ. ఈ మతోన్మాద మహాజ్వాలనము పొగిలి పొగిలి ప్రజ్వరిల్లి 1926 వ సంవత్సరమున స్వామి శ్రద్ధానందుని భస్మీకరించెను.

మంజరీ ద్విపద
ఆజానుబాహుఁ డాయతమహోదారస్కుఁ
డాకృతిఁ గన్న విద్యానయశాలి
కాషాయ వస్త్రప్రకాశ భాసురుఁడు
సరిలేని విజ్ఞాన చాతుర్య ధుర్యుఁ
డాగమవేది సమైక్య సంధాయి
కరుణారసాపూర్ణ కమ్రవచస్వి
దూరీకృతాఖిల దోషమనస్వి
ఊరీకృతాష్టాంగ యోగతపస్వి
స్వీకృతప్రాణి సంసేవా యశస్వి
హిందూముసల్మాను లేకమ్ముగాఁగఁ
గంఠమెత్తిన మహాగంభీరమూర్తి
మిలమిలలాడు కన్నుల కాంతిరేఖ
కడువృద్ధుఁడైన వంగని కాయపుష్టి
ప్రాణమ్ముతో నుట్టిపడు విగ్రహమ్ము
ముడుతవాఱిన వాని ముఖమండలమ్ము
తలఁచినయంత నిద్రాకాంతులీను
దివ్య తేజము సదా దీపించు మోాల
ఢిల్లీపురమ్ము కాఁడిన భీతిమున్గి

మిత్తికోటులు రాయ నెత్తుటం దోఁగి
రోదింప "జుమ్మామసీదు" పై నిలిచి
హిందూముసల్మాను లేకహో యనుచు
శాంతి చేకూర్ప సుస్వరము వెలార్చె
స్వామిశ్రద్ధానంద సంయమీంద్రుండు
ఆశాంతిమయుని వెన్నాడి రాపాడి
కరసానఁ బట్టిన యొఱబాఁకుఁ బీకి
రక్త మాహారించె నక్తంచరుండు
చిఱునవ్వుతోడ నాశీర్వాదమిచ్చి
శాంతి శాంతి యటన్న శబ్దమ్ము పలికె
బయలులో బయలయ్యెఁ బరమపదించె.

## పీడితజాతుల సభ

కం. పీడితజాతుల వారలు
గూడి మహాసభను జరుపుకొనఁ దలఁచిరి వా
యోడక బ్రస్సెల్సుపురిం
జూడం బోఁగోరి కాంగ్రెసునకుఁ దెలిపితిన్.

కం. నా యభిమత మెఱిఁగిన జా
తీయ మహాసభయు సమ్మతించెను నేనా
సాయం సమయమ్మునకే
యాయత్తుఁడ నైతి మిత్రు లందఱుఁ గలియన్.

ఆ. కలము వలయుపుస్తకములు ముక్కద్దముల్
పడుకపరుపు మేలి యుడుపులెల్ల
సంతరించుకొంటి సంతోషముం గంటిఁ
బయనమున్న నిదుర పట్టఁగలదె.

గీ. నేల నాలుగు చెఱఁగుల నిల్చువారు
కూలినాలి జనాలకై కుములువారు
బాలిశుల పాలనమ్ము గీడ్పఱుచువారు
శీలవంతులు కూర్చు నెచ్చెలులు గారె.

చం. మగసిరి నిండుగాఁ గలిగి మానవతత్త్వము గుర్తెఱింగియున్
బుగిలి తపించిపోవు జనముం జగముం గని వెచ్చనూర్చియున్
మగువల పారతంత్ర్య మణుమాత్రము గాంచి మదిం గలంగియున్
దెగిన మహానుభావు లటుదీర్చినకొల్వు సుఖమ్ము నింపదే.

చం. ధనము మనమ్ము విద్యయును దర్పము రూపము మేలిదార్ఢ్యమున్
ఘనముగఁ గల్గువారు తమకై తమ బంధుజనాళికై సుఖ
మ్మును మునుగోరకుండ జనముం జగముం గని గుండె బెంగగా
మనియెడువారు చేరఁ గన మానసికవ్యథ లంతరింపవే.

కం. తరతరముల యాచారము
మరమేకునుబోలె బిగియ మతముం గులముం
బెరచేతను సడలించిన
సరసుల సందర్శనమ్ము సంతస మిడదే.

కం జీలుడిగిపోవ నిసువుం
బాలకు, నెడబిడ్డ కడుపుమంటల నార్పం
జాలిన మెదుకున కలమట
పాలా తల్లులకు మేలు వలదా! చెపుఁడా.

కం. రారాపు లంది యాలికిఁ
జీరయు బిడ్డలకు మొలకు జేనెఁడు గుడ్డం
గూరుపఁ గస్తిం బడియెడి
వారల కేనాఁటికైన వచ్చునె సుఖముల్.

ఉ. అన్నము పున్నెముం దెలియనట్టి జనమ్ములు మేనువంచి సం
పన్నుల పొట్టనింపుదురు పాలికిఁ గూలికి లొంగిపోయి వీ
రన్ని విధాలఁ గ్రుంగిన సహాయపడం దలపోయ రింతకున్
వన్నెకురాని సేవవలనన్ ఫల మేమిలభించునో కదా!

ఉ. దానము ధర్మమంచుఁ బెడదారులు వట్టి మతమ్ము నూఁతగాఁ
బూని సమస్తదేవతల పూజకుఁ గానుక లిత్తు రాస్తులం
గానరు వింతవేషములకై ధనమెల్ల వ్యయింత్రు వీరి దు
ర్జ్ఞానము మాపఁగాఁ గల సమర్థులు పుట్టువులందు నెన్నఁడో!

చం. పలువురు గూడి మాడిన సభం బలుకాడిన, మేలిదుస్తులుం
గలిగిన బీదవారి నధికారమదాంధులు ద్రవ్యశాలురుం
గలిబిలి చేసి యెల్లిదముగాఁ గనుఁగొందురు లాఁతి యున్నతుల్
దలఁపున సోఁక మెచ్చరుగదా! మదరోషకషాయితాత్మకుల్.

ఉ. లేమిడి గల్గువారిఁ గనలేని మహాత్ములు సర్వభోగని
ష్కాములు సామ్యవాదపథకాంక్షులు సత్యవచఃప్రవర్తకుల్
దీమసమింత గల్గు కడుధీరులు లోకహితమ్ము గోరఁగాఁ
గామితముల్ ఫలింపవె సుఖమ్ములు ముమ్మరమంది నిల్వవే.

ఉ. జీవికయెల్ల దుర్భరము జీవితమెల్లను నిస్పృహమ్ముగా
భావలయమ్మునం గలుగు పోటరులెల్లరు నొక్కకూటువై
రావలెనంచు బెర్లిను పురమ్ము ముదమ్మున నామతించి సం
భావనసేసెఁ బీడితసమాజము చేరెను నొక్కపెట్టునన్.

కం. జీవన్మరణ సమస్యగ
భావించెడివారు బ్రతుకు భారముగా సం
భావించువారు బెర్లిను
నావాసముగాఁగఁ దలఁచి యందిరి తృప్తిన్.

కం. ప్రాచీన ప్రభువంశపు
రాచటికమ్మును నదల్చి రష్యాప్రజ సం
కోచమ్ములేక ముందుగఁ
బ్రాచీదిశ నిలిచెఁ బ్రజల పరిపాలనమున్.

కం. మనుముందు ప్రజారాజ్యము
గొని తెచ్చిరి హెచ్చుతగ్గు కుందులు వ్రీలన్
నినిచిరి శాసనముల దు
ర్మనుజావళి మానసములు మ్రాన్పడి యుండన్.

కం. ఆ జయరేఖాంకూరము
లీ జర్మనుభూమి మోసులెత్తెను వీనిం
దేజోమయ రూపము ఫల
భాజనముం జేయఁదలఁచి వచ్చిరి వీరల్.

వ. వలసరాజ్యములు గల యింగ్లాండు ఫ్రాన్సు ఇటలీదేశములు మాత్ర
మీయుద్యమమునకు వ్యతిరేకముగా నిలిచెను. ఐనను 1927 ఫిబ్ర
వరి మొదటివారములో నీసభ బ్రస్సెల్సులో సమావేశమాయెను.

సీ. మత కులావేశదుస్థితికి లోపడి మ్రగ్గు
జనుల రెక్కొల్పు శాసనము లరసి
తమ దైన్యమునకు దైవము హేతువని నమ్మి
ముడుఁగఁబాఱిన జనమ్ములను గాంచి
వెలలేని భాగ్యవంతులు పెట్టిపుట్టిన
ట్టులు దెల్పు పూర్వ గాథలను జూచి
మాతృతిల్లి దుఃఖముల్ మఱచి వేదాంతార్థ
ములను వల్లించు బోద్ధలను దలఁచి
పనులు పాటులు లేకున్నఁ బస్తులుండు
కూలినాలిజనమ్ము నాకులత లెంచి
యోరుపుందక్క చైనీయు లొక్కసారి
పెల్లుబుక వేచియున్నారు వీలువెంట.

కం. ఆ యా వారల కలయిక
లాయుద్రేకములు కనుల కానంద రస
ధ్యేయములై విలసిల్లును
స్నాయువు లుడికించుఁ దలఁపునం జొరఁబాఱన్.

కం. బలవద్విరోధములు గల
పలుజాతులు నొక్కత్రాటిపై నిలిచె, మహా
త్ములు సిద్ధాంతముపట్లను
వెలివాదము తేరు పట్టు విడ రెప్పాటన్.

కం. తామై చైనా రష్యా
భూమిప్రజ వెలికి నిలక పోయిన లోలో
నీమండలి కిష్టార్థము
లామెతలుం గూర్చె ఘనసహాయ మొనర్చెన్.

కం. చీనా టర్కీ పాల
స్తీనా జావా సుమిత్ర సిరియా వాసుల్
మాన ప్రాణమ్ముల సం
ధానించిరి యుద్యమమ్ము నడపం గడఁకన్.

కం. ఇటు భాగధేయభాగులు
పటుతర ధర్మానుబంధభావులఁ బ్రజలన్
గిటగిట లాడఁగఁ జేసిన
నెటు నిల్వఁగ వచ్చుఁ జెప్పుడీ యోర్మిమెయిన్.

ఆ. శతవిధాలఁ దగిన సామ్యమ్ము లేకున్న
సామ్యవాదులకును జాలినన్ని
కారణమ్ము లుంటఁ గార్యముల్ సలుపంగ
నడుముగట్టి నిలిచినారు నాఁడు

మ. ఇది సామ్రాజ్యవిధానముం జులిపి సాహిత్యమ్ము సంధిల్ల స
మ్మదముం గూర్పఁగ యత్నమీపని కసామాన్యప్రభాభాసితుల్
పదముల్ మోపి యుగాంత భైరవుల రేవన్ నిల్చినంగాక సం
పద లాసాసల నిల్చునా గలుగునా శ్రేయసమ్ముల్ భువిన్.

గీ. ఒక్కరుఁడు నష్టపడిన వేఱొక్కరునకు
సౌఖ్యముం గల్గ నది సుప్రశస్తి గాదు
పదుగురకుఁ గీడువాటిల్లు పట్టులందు
నొకఁడు సౌఖ్యమ్ముతో నుంట నోర్వఁ దగునె.

కం. అపరాధశతము లొనరుచు
నపకారికి మేలు సేయనగునా! ధర్మ
వ్యపదేశమ్మున సాగెడు
నుపదేశమ్ములకు హద్దులుండఁగ వలదా!

ఆ. క్షమయ సాధనమ్ముగా నహింసావాదు
లంది మేలిసౌఖ్య మంది రోటు
పురుషకార ముడిగిపోవ సత్ఫలితముల్
వడయఁ గలరె జగతి పంచజనులు

ఆ. గుములు గట్టి నాయకులు గూడి బాసలం
బలికి నిశ్చయములఁ దెలిపి రచటఁ
బేరు పెంపు గన్న పెద్దల సుద్దులు
హృదయమునకు శాంతి నిడియెఁ గొంత.

వ. ఆ సామ్రాజ్య వ్యతిరేక సభకు 'జార్జిల్యాన్సుబరీ'గారధ్యక్షత వహించిరి. ఆ నాఁటి వీరి యధ్యక్షోపన్యాసము ముదమ్ము చేకూర్చెను. 'బ్రిటిషు లేబరుపార్టీ' వారి కినుక కిది కారణమగుటచే వీరీపదవికి విడుదల వ్రాసిరి.

గీ. పరుల మెఱమెచ్చులను గోరువారు రేఁగి
యున్నతస్థానములఁ బాద ముంచుచుంద్రు
తోడివారలు మురముర లాడునాఁడు
వీడుదురు బాధ్యతలను మోమోడకుండ.

గీ. నిక్కువమ్మైన బాధ గాన్పింపకుండ
నుద్యమములందు నిల్వఁ గా లూనువారు
తమకుఁ దమవారి కెట్ట తొందరలు లేక
తిరుగ జతనమ్ము చేయుచుందురు ధరిత్రి.

వ. ఐన నీయుద్యమమున సుప్రసిద్ధులగు ఈన్ స్టీను, సన్యటుసేనుభార్య, రోమా రోలా మొదలగువారు పెక్కురు గలరు. అరబ్బు లీద్దానికి మూలస్తంభముల వలె నుండిరి.

చం. సమయముగాని యప్పు డొకసాకున దేశము దేశమంచు సం
భ్రమములు వల్కి కార్మికసమాజము నుద్ధరణం బొనర్ప ను
త్తముల విధంబునం దమకుఁదామె మెలంగుదు రాధిపత్యమున్
గ్రమమున నందఁగోరుదురుగాని తలంపరు పేదసాదులన్.

కం. పడమటి దేశీయులలో
నడు గడుగునఁ గానిపించు నంతఃకలహ
మ్మొడనెడ నెటేఁగితి నెడఁదం
గడు ఖిన్నుఁడ నైతి నిజము గన్పడ కుంటన్.

కం. ఈవైవిముఖ్యము ముఖ్యము
గా విస్తృతమయ్యె హృదయకంజమ్మున నా
భావమ్ము సామ్యవాదపుఁ
ద్రోవం జరియించె ధర్మ దోహల మగుచున్.

సీ. త్రికరణశుద్ధి సందీపింప లోవెలి
నొక్కలై మెలఁగుఁ గమ్యూనిజమ్ము
నిఱుపేదవాని దుర్భరజీవికను సౌఖ్య
ముగఁ జేయఁ జాలుఁ గమ్యూనిజమ్ము
కులమత వర్గ సంకులత పోకార్పంగ

మునుముందు నిలుచుఁ గమ్యూనిజమ్ము
మొఱకు నమ్మకముల మొదలంట ఁదులుపంగఁ
బూను నష్టోదయ కమ్యూనిజమ్ము
సంఘవిద్రోహశక్తి పై జంగచాఁచి
"యాత్మవత్సర్వభూతాని" యనెడిపల్కు—
పూర్ణరూపమ్ము దలఁపఁ గమ్యూనిజమ్ము
మోసమెఱుఁగదు నిజము కమ్యూనిజమ్ము.

కం. పారిశ్రామికయుగ సం
చారమ్ములు దమకుఁదామె వర్ధిలె రష్యా
వారికి, సోషలిత నమా
దూరమ్మై పోయె సిరులు తులతూఁగె ధరన్.

కం. మతకర్తలు ధనవంతులు
నతుకుడు పడఁజేయువార లాఱిన భూమిన్
బ్రతుకులు స్వచ్ఛందములై
మతిమద్వారు లుంద్రు సౌఖ్యమయజీవనులై.

కం. ఇది నా దది నాయాలిది
యదెవో మాబిడ్డ దంచు నంతటఁ దానై
యెదిరికిఁ జోటీయని దు
ర్మదులను దొలఁగింప మేలురాదా! ప్రజకున్.

ఉ. నేరిచి నేరకున్న ధరణీపతి మెచ్చుల తానకంబుగా
మాఱును, నానుపూర్వికపు మన్ననలందు తలంపుతో జమీం
దారులు దారితప్పి భజనమ్మొనరింతురు, పూఁటకాఁపులై
నేరుపుతో నుతింతురు మనీషులు చిత్తము చూఱకోలొనన్.

కం. ఈ దురవలేప మెదఁలోఁ
బాధై తమతోడి వారి బాధలు దమకున్
మోదము కూర్పఁగ మనుదురు
శ్రీదయితులు నేల నాల్గు చెఱఁగుల వారల్.

కం. మానక మనకిద్ది యనూ
చానాచారమ్ము గాఁగ సాగినచో ని
మ్మానవత పొల్లువోదా !
ప్రాణాంతకమైన దాస్యభావము నిలదా !

కం. పరిచరు లూడిగ మొనరుప
వరుమానము రేఁబవల్లు వర్ధిల ధనికుల్
మరియాద వీడి తిరిగెద
రోరిమికలం దలఁపనొల్ల రుల్లములందున్.

కం. ఈ విధి దుశ్చేష్టలకుం
దావలమైనట్టి ధనికతత్త్వము నెడఁదన్.
భావించి సర్వసమతా
శ్రీ విధిఁ గాంక్షింత్రు దేశసేవా నిరతుల్.

మ. అవిజయ్యస్థిర కార్యధూర్వహులు రష్యావార లాత్మ ప్రవృ
త్తి విభిన్నమ్మగు హింసతోఁ బరుల నార్తిం గూర్పఁ జింతింతు రం
చు విచారించితి నేను మొట్టమొదటం జోద్యమ్ముగాఁ, గాని దు
ర్వ్యవసాయుల్ గలిపించి రిచ్చెనటి యూహల్ చిత్రచిత్రమ్ముగా.

కం. అని తెలిసికొంటిఁ గాలము
చనఁజన, నానేర్చినట్టి శాస్త్రజ్ఞాన
మ్మును నట్టిద నా మనుగడ
యును నట్టిదయాటఁ దెలియకుండెను దొలుతన్.

కం. ఆ చర్చలలో సభ్యులు
వాచాజృంభణము చూప వలదని యర్థ
ప్రాచుర్యమున్న పల్కులె
వాచవు లూరంగఁ బలుక వాంఛించితి నేన్.

గీ. పురాణవిఖ్యాత రచయిత దీని చరిత
నెల్లిదముగాఁగ నావేళ మెల్లగాఁగ
వాని సంస్కారమే బట్ట బయలు గాఁగ
వ్రాసి ప్రకటించెఁ బత్రికా రాజములను.

కం. ఆ రచ్చ కేగుదెంచిన
వారలలో వేగువాండ్రు వందలుగల ర
వ్వారలు గడపట మాకుం
గోరింపులు గూర్పఁ దెలిసికొంటిమి మదులన్.

కం. ముంజేతులు ముంగాళులు
నంజక తన దేహమెల్ల నలమిన మసిపూఁ
తం జర్చలఁ బాల్గొని మము
రంజింపఁగఁ జేసె "ఫ్రెంచి" రక్షకభటుఁడున్.

మంజరీ ద్విపద. సమ్రాట్టుతనము మెచ్చక మచ్చరించు
ధీరవర్యులు మహోద్రేకమ్ము గ్రమ్మ
గుమికట్టి జయభేరి గొట్టి "కొలోను"
నగరమ్ము నందు నోలగము సాగించి
వలయు తీరుపు లొక్క వైఖరి చేసి
సభికు లెల్లరు పరస్పర గౌరవముల
సంభాషణముల నచ్చటు వాసి చనిరి
వ్యక్తిత్వమును గోలువడక యాసంస్థ
దద్దయు సామ్యవాదము వైపు మ్రొగ్గె

వై స్రాయితో సంధి వచ్చిన యపుడు
ఢిల్లీ పురాన గాంధిని గూడి యుండి
రాయబారము హయాణరాజ్యమ్ముతోడఁ
జేసితి నని బహిష్కృతిఁ జేసె నన్ను
నాఁటి నాస్థితి నిదానముగ నీక్షించి
న న్నుత్తరము గోరి విన్న యాపిదప
దండింప నెడఁద సంతస మంది యుందు
యారపులోఁ దండ్రి యున్న దెటింగి
ముదముతో వెన్నీసు పురమునఁ గలిసి
సకుటుంబముగను రష్యా దేశ మేగి
సరిక్రొత్త పరిణామ సార మ్మెటింగి
తనుపుతో జన్మభూమిని జేరఁగోరి
పయన మైతిమి దేశపర్యటనమున.

# మలిరాక

కం. మానవుఁ డార్థిక దుస్థితి
చే నలఁగిన నాఁడు గడుఁగృశించు నశించున్
మానసిక వ్యధ దొలఁగిన
మేనికిఁ గడు లావు గల్గి మించు న్నించున్.

కం. కలిగిన వానికి సౌఖ్య
మ్ములు గల పాశ్చాత్యదేశముల నివసింపన్
గలిగె ననామయ, మాత్మం
గలిగె సుధామధుర వీచికా నివహమ్ముల్.

ఆ సమసి పోయె నాత్మ సంఘర్షణమ్ములు
మాటు మఱఁగె నాఁటి యోటములును
గుతుక మందె మనసు క్రొంగ్రొత్తపనిదీర్ప
దృక్పథమ్ము మివుల పృథుల మయ్యె.

కం. ధామమ్మున సేమమ్మును
ప్రేమమ్మున సంతసమును విద్యా విభవ
క్షేమమ్మున వినయమ్మును
సామమ్మున శుభము నంద జనుఁ డిచ్ఛించున్.

చం. చదురులు పల్కుచుందు రిది సత్యము ధర్మ మహింస యంచు స
మ్ముదమున సామ్యవాదపథముం దిలకింపరు నాయకాగ్రణుల్
హృదయము వేఁగునం బలవరించు జనమ్ము సుఖమ్ము నెమ్మదిం
గుదురుపకున్న శాంతి సమకూడదు వీడదు దాస్యభావమున్.

కం. చేరువఁ జేరిన వారిం
గారవము వెలార్చి తృప్తిగాఁ గనుఁ గొనఁగా
నూఱట వహింతు రిటు ధి
క్కారము గావింప నెంత కాలము చెల్లున్.

ఆ. నోటి మాట బలిమి నోనాడ బదులాడఁ
గళవళించినారు కర్మకరులు
ఇచ్చకంపు మాట లెంత కాలము సాగు
నెంత దనుక బ్రదుకు నీడ్వఁగలరు.

ఆ. కసవు మెసవు పశువుఁ గరమాదరమ్మునఁ
దల్లి యనుచుఁ గొలుచు లొల్లెగాఁడు
పాటివానిఁ గానివానిఁగా మదినెంచు
నంట నంటు వెంటనంటు ననుచు.

కం నలుగడలఁ గడలుకొను తెరు
వులు పౌరువులు రాజకీయ భూకంపములం
గలిగించు నంచు నెంచితిఁ
దలఁపున విసుమానములు ముద మొందవించున్.

కం. అనుపదము జనపదమ్ములఁ
గని మనవారలకు శిక్ష గఱపుట దేశ
మ్మును జనమును సంసిద్ధ
మ్మొనరుచుటే లక్ష్యములుగ నుంకింతు నెదన్.

చం. ధనమును గాచియుండు పెనుదయ్యము రీతి మతిమ్ము భాగ్యవం
తుని మొగసాల నిల్చును గనుంగివ విందొనరించు వానికిన్
మునుపడివచ్చు లంపటము మూర్ఖ లెఱుంగిక మెత్తు రీస్థితుల్
పొనుఁగువడం దలంతు మొలపూసలు ద్రెవ్విన నాఁటనుండియున్.

కం. శ్వేతద్వీపోద్భవ మా
చేతమ్ములు నినుప ననిబిసెం టియ్యకొనెన్
ప్రీతి మినుముట్టె సభ్య
వ్రాతము జేకొట్టె నిబ్బరమ్మగు భక్తిన్.

గీ. సర్వసభ్యసమావేశసదమునంచు
నడుగుమోపియు నౌను గాదనఁడు గాంధి
యతని మానమ్ము మాకు సమ్మతిని గూర్చె
శాంత్యహింసల బోధ లుత్సాహ పఱిచె.

ఉ. సైమనుసంఘమున్ భరతజాతి బహిష్కరణం బొనర్పఁగా
స్థేమము నిల్పఁగాఁ దగిన తీరుపుఁ దీర్చె మహాస్వతంత్రతా
శ్రీమహిమమ్ము రూపమును జేకొనె ప్రోఁగె దిశావకాశముల్
జే మన భారతోర్వికి విజేతకు గాంధికి నా నినాదముల్.

చం. పదవులకై పెనంగు మితవాదుల చేతికిఁ జిక్కనంచు నా
హృదయము గుర్తెఱింగిన యరిందముఁడౌ ''యనసారి'' పీరిపైఁ
బదమిడెనంచు సభ్యజనభావము దీర్పఁగలాఁడనంచు నే
ముదమునఁ గార్యదర్శిపదముం గయికొంటి ననాస్థతోడుతన్.

కం. కనుగట్టి యైంద్రజాలికుఁ
డొనరించిన బొమ్మలట్టు లుడుగక సంస్థల్
పొనరింపఁ గుక్కగొడుగుల
యనువున నశియించు దాన నగునే శుభముల్.

కం. నిలలేక నీళ్లకంటెం
బలుచనయై తాఱుమాఱువడి నడచిన లో
వెలివారు నవ్విపోవరె
నిలుచునె యీసంస్థ లెంత నెత్తు రొడిచినన్.

వ. గోట్టుమిట్టాడు సన్నిట్టి "రిపబ్లికన్ కాన్ఫరెన్సున" కధ్యక్షునిగా నిల్పిరి. అది మఖలోఁబుట్టి పుబ్బలో న స్తమించెను. మదరాసు జాతీయమహాసభల సంపూర్తి మొనర్చుకొని ఢిల్లీపురమున కేగ నట హకీము అజ్మలుఖానుగారు కీర్తిశేషులైరి.

ఉ. ఈతని మోములోఁ బ్రతిఫలించుఁ బురాతన యావనప్రభ
వ్రాతము తోనతోన కనుపట్టును శాంతదయారసమ్ము లీ
చేతనమందు కుందనపుఁ జిత్తరుబొమ్మ జగమ్ము వీడినం
జేతము తత్తరంపడె నిసీ యనిపించెను జీవితాశలున్.

శా. ఢిల్లీ పల్లవపాణికంఠమునఁ గుంఠీభూతమై రత్నమే
డుల్లెన్ దేశము శోకసాగరములో డొల్లెన్ విచారమ్ము సం
ధిల్లెన్ భారతనాయకప్రతతి, కా తేజమ్ము దర్పమ్ము మా
యుల్లాసమ్ముల నెల్లలం బఱుపఁ జేయుం ద్రోయు నిర్వీర్యతన్.

ఉ. ఆ మృదుహాసభాసురము లా నవజీవనకంఠనిస్వనం
బా మధురాచ్ఛభాషణము లా నిజనైతికసత్ప్రవర్తనం
బా మరియాద లా కనులయందము చందము డెందమంది యి
య్యో! మఱపింతరావు మము నూఱటలెట్లు సమాశ్రయించునో.

ఉ. ఆతఁడు వైద్యవిద్య ననహాయుఁడు భారతతత్త్వశాస్త్ర వి
ఖ్యాతుఁడు గాంధితాతకు సహాయుఁడు సంస్కరణాత్త సద్గుణ
స్ఫీతుఁడు ప్రీతిపాత్రుఁడు విశిష్టుఁడు దుష్టజనాంధకార ఖ
ద్యోతుఁడు కార్యశూరవరుఁ డూర్జితసత్త్వుఁ డుదారుఁడన్నిటన్

సీ. యవనజాతిస్త్రీల నాదరింపఁ దలంచి
పరదాల బ్రదుకు నవ్వలికి గెంటె
మతమువైషమ్యమ్ము మాయింప సమకట్టి
జనమెల్ల నొక్కటేయని వచించె

పరధరాధిపుల యేల్బడి నడంపఁగఁబూని
మణిబంధమునకుఁ గంకణముగ గట్టి
ప్రాఁతక్రొత్తలఁ జక్కఁ బఱుప నాలోచించి
దోసమ్ములెల్లఁ దుత్తుమురు సేసె
చండతరమైన సైనికశాసనమ్ము
దులుప యత్నించి ప్రాణాహుతుల నొసంగె
నితఁడు సామాన్యుఁడే జగద్ధిత సుబుద్ధి
సుగుణగణముల గీము హాజ్మలుహాకీము.

ఉ. తిన్నని వేదమార్గముల తీరు తెలుంగఁడు సాంధ్యకృత్యముల్
పన్నఁడు దైవతమ్ముల కృపారసధారల కంజలింపఁ డీ
యన్నువ పారసీకమునయం దభిమానము వీడఁడంచు నం
గన్నుల నిప్పులంటుకొనఁగాఁ గనుఁగొందురు హైందవాగ్రణుల్.

ఉ. మాఱెడు దేశకాలముల మట్టును గుట్టు నెఱుంగుచుంద్రు కా
శ్మీర నివాసు లెల్లరు సుమీ యెఱుకేది మనుష్యతత్త్వమే
యాఱుపఁ బూన రీతురక మాంగ్లము పార్శియరబ్బి భాషలన్
నేరిచి రట్టి సంస్కృతుల నిల్చిరి మార్చిరి వేసబాసలన్.

ఉ. కాలము మార్పుఁగోరఁ జిరకాలవిశీర్ణపురాణ ధర్మముల్
బాలిశులై సభాంతరములన్ వినిపింతురు గాదటన్న ను
ద్వేలతఁ జూపుచుందురు వివేకము పాకము వీటఁబుత్తు రీ
తాలిమిలేనివారలు సదా విసిగింతురు లాఁతివారలన్.

మ. అవమాన మ్మభిమాన మిద్దియని విద్యాగంధమున్ లేనివా
రవలోకింపనినాఁడు చెల్లుబడి యానాఁ గార్మికుల్ గర్షకుల్
యువకుల్ లోకము గుర్తెఱుంగు నపు డీయూహల్ పచారింప న
ధ్యవసాయం బొనరింప సమ్మతుల నీయ న్వత్తురా! మెత్తురా!

శా. పారిశ్రామిక కర్షక ప్రవర సంభారమ్ము మేల్కొన్నచో
ధీరుల్ శూరులు సూరు లగ్రకులజుల్ దేవప్రియుల్ నిల్తురే
నూరార్తైన జగమ్ము మేలునకు మేనుల్ వంచి కష్టించు నీ
ధీరోదాత్తుల వాఙ్మనఃక్రియల భక్తిం గొల్వ ధర్మమ్ముగున్.

ఉ. పాటిగఁ బట్టణమ్ములను బల్లెల శ్రామికవర్గ సంఘముల్
నేటికి నిల్చె మానవత నిల్పుకొనం గమకించె విజ్ఞులి
ప్పాటున కండదండలయి ప్రాజ్ఞతఁజూపిరి యంత్రశాలలం
గూటువగట్టువారి వరఁకుల్ గడతేఱెను మూలముట్టుగా.

కం సమయానుకూల శీలురు
భ్రమపెట్టిరి కార్మికులను వ్యవసాయుల, న
క్రమ మదియని తెలియక పలు
శ్రమలకు లోనయ్యె బీదజన మవ్వేళన్.

కం. కదలిన మెదలినఁ బన్నుల
నదుమఁగ సంయుక్తరాష్ట్రమందు నయోధ్యన్
మొదలంటె రైతులోకము
గోదచేఁ బీడింపఁబడియెఁ గూలిజనమ్మున్.

గీ. అన్నమో రామచంద్రా యటంచుఁ దొల్లి
పనవినారలు కోసలవాసులెల్ల
నేఁటి కామాట ప్రతినోట నిలిచిపోయె
రైతురాణువకెల్ల సాకేతమందు.

ఆ. గుజ్జరాతి రైతు కూఁకటివేరుతోఁ
బెళ్లగిల్లి సొంత మొల్లఁబోయె
వాని నుద్ధరింప వల్లభాయి పటేలు
దీక్షఁబూని ధర్మసేనఁ గట్టె

శా. ఆ దీక్షానిధి కార్యదక్షతకు రాజ్యశ్రీ సభా వేదికల్
పాదుల్ద్రెప్పె నఖండ భారతము జవ్వాడెన్ మహోద్విగ్నులై
శ్రీదుల్ భూదయితుల్ చలించిరి విశేషీభూత సత్యాగ్రహ
ప్రాదుర్భావము దిగ్విదిక్కులను నట్టాడెన్ జయోత్సేకమై.

కం. తరుణీ తరుణులు బద్ధ
స్థిరులై జాతీయసభలఁ జేరిరి తేజ
స్స్ఫురణ మ్మొసఁగిరి సంస్థకుఁ
బౌరపులువో నాఁడ దీక్షఁ బూనిరి వారల్.

కం. కులమత భేదమ్ములకును
వెలియై యార్థికపుఁజింత విస్తారమ్మై
నిలఁద్రొక్కుకొనుట కనువగు
చులకన మార్గమ్ము పాఱఁ జూచిరి వీరల్.

సీ. అదెరాకు మిదెరాకు మాఁగుమన్న రవాళి
పెల్లుతోఁ జెవులు దిబ్బిళ్లువడియె
తిరిగిపో భరతోర్వి దరిఁజేరవలదన్న
పెడఱంకె లాత్మఁ బింపిళ్లు గూసె
మరియాదకును భంగకరము రాఁబోకుమీ
యను అంతు దిక్కుల నవఘళించె
మఱచిపోఁబో మహింసను నిల్వుమీ యన్న
యార్భటి నిలువెల్ల నావరించె
జంగ చాఁచిన సైమనుసంఘమునకుఁ
గలుగు నవమానమనుచు లగ్గలకు లేచె
భారత సవిత్రిసుతకదంబమ్ము నాఁడు
మడమతిరుగని పౌరుషం బడఁచికొనుచు.

గీ. నాఁడు మాఱొడ్డి లజపతినాయకుండు
నిలిచె నాబాల గోపాల మళుకు వీడి
నడుము బిగియించెఁ బంజాబు నల్లలాడిసెఁ
దలఁపునకుఁ బాఱ నొడలెల్ల జలదరించు.

ఉ. కంచుకమూడ్చి వక్షమిదె గాల్చుము భారతవీరపుత్త్రుఁ డీ
వంచన నాదరింపఁ డరివర్గము ముట్ట దయారసమ్ము వ
ర్షించును రమ్మటంచుఁ బరుఁ జీరెడు నాయకు నజ్జునజ్జుగా
వించిరి చూచునాప్రజలు వేఁగిరి క్రాఁగిరి దోఁగి రశ్రులన్.

ఆ. మిత్తి పూనినట్లు మెడకాయ తలకాయ
బమ్మరింప నొడలు దిమ్మదిరిగ
నల్ల తెల్ల మిఱ్ఱుపల్లమ్ము లివియను
తెలివితొలఁగఁ జీఁకటులును గ్రమ్మె.

కం. జాతీయ పరాభూతికిఁ
జేతము లుఱ్ఱూఁగి యువకసింహము లాయా
చేఁతలకు మాఱుచేఁతల
నే తలఁచిరి నిలిచి రధికహింసాయుతులై.

మంజరీ ద్విపద.
ఆ మహోద్రేక మాహాత్మ్యమ్ము గ్రమ్మె
దిక్తటమ్ముల నుష్ణ రక్త ముప్పొంగె
నరనాథులకు జీవనాడులు గ్రుంగె
గర్జిల్లెఁ గొదమసింగము భగత్సింగు
పుక్కిట రక్తమ్ము పుణికిస లాడ
సుఖదేవు మొదలుగా సఖులతోఁ గూడ
శ్వేతాధిపుల ధూమకేతువో నాఁగ
బ్రక్కలో బల్లెమై భగభగ మండె

పరివారముల మధ్య పండు పాలకుఁడు
కోటలోపల నిద్రపోఁడు నుద్యోగి
యాయుధమ్ములఁ బట్టినట్టి సైనికుఁడు
వచ్చె వచ్చెను సింహ చచ్చితి మనుచుఁ
గళవళమ్మందుఁ గన్నులు దేలవైచు
గగ్గోలువడు గుండె గాలమ్ముగాఁగ
వినిపె రొకయింత వీనులు సోఁక
మెలివెట్టు మీసమ్ము మిక్కిలి వృద్ధు
పసరుప్రాయము వాఁడు బాహాస్ఫళించుఁ
బాలబుగ్గలవాఁడు పరికించు దిశల
నింతటి విఖ్యాతి యేనాయకునకు
రాలేదు రాఁబోదు రాదు దేశమున.

# అనుభవము

కం. ఇరుచెవి యెఱుఁగక సలిపిన
దొరల దురాలోచనమ్ము దొంఁదరపఱుపన్
బరుగిడితి మేము లక్నో
పురమున కవ్వేటి మిత్రముల చేయూఁతన్

కం. పాలించువారి పతనము
నేలా కోరెదరు సమయ మిదియే పరు లీ
వేళకు నెత్తుట లెఱుఁగరె
చాలరె సాయమ్ము మాకు సలుప న్నిలుపన్.

కం. అని మును దొరలాడిన మా
టను నిలకడలేమి యేమిటను గాంక్షితముల్
ననలొత్తమి యీ పాట్లకు
మునుకొంటిమి ఘోరకృత్యములు సేయుదుమే.

కం. సైమను సంఘమ్మును మన
భూముల కంపించు జతనముంజేయు నవల్
సామయికమ్ముల నెఱపుట
లేమాత్రము గాదటంచు నెఱుకకు వచ్చెన్.

వ. 1914నుండి సాగిన పోలికలను 1919 వఱకుఁ బ్రజ్వరిల్లినది ఆలో మాకు సాయమొనర్చిన మీవాంఛితములఁ దీర్తుమనిన వారీయతు కులమారి కర్జమునకుం దిగిరి. దేశీయ వ్యవహారములఁ దీర్ప మార్ప నచటివారి కనుసగుఁగాని లాఁతి కెట్లుంతువట్టును. దాన మేమీ కర్జమున కసమ్మతిఁ జూప నెంచితిమి.

కం. లాఠీపోటుల మ్రగ్గిన
పోటరి లజపతియు మరణముం జెందుట లా
నాఁటికిఁ గ్రొత్తలగుట ను
ఱ్ఱూటల నూఁగించె జనసమూహము నెల్లన్.

ఉ. పంతముపట్టి యీ వెడఁగుపాటున కొల్లమి దెల్పఁ గూటువుల్
సంతనకట్టె మాండలికసభ్యజనమ్ములు ముక్తకంఠమై
బంతులు దీర్చె భారతసభాభవనమ్ములు దద్దరిల్లె వి
భ్రాంత మొనర్చె హూణపరిపాలకవర్గము నొక్కపెట్టునన్.

చం. పలువురు గుంపుగూడి యొకపట్టున నిల్చుట, కాని కర్జముల్
సలుపుట రాజ్యతంత్రము నలంచుట నోరికి వచ్చినట్లుగాఁ
బలుకుట, మేళతాళములఁబట్టి మెలంగుట యెట్టి వేళలం
దలకొన రాదటంచు నృపధర్మము వెల్వడె మిన్నుముట్టగన్.

ఉ. శాసన మెంతగా నదుమసాగెనొ యంతకుమించి పాలకుల్
దూసిరి కత్తులం బ్రజల దోర్బల మంతకు మించె రెండిటం
గాసిలి యూపిరాడ కధికారులు నోళులు పొక్కిపోవఁగాఁ
జేసిరి యార్భటుల్ తమకు సేగి దొరంకొనునన్న భీతితో.

శా. ప్రారంభించిరి వీధివీధి విజయధ్వానమ్ము లింతంతగా
నూరేగించిరి దేశనాయకుల నామోచ్చారణమ్ముల్ దివిన్
గారింపన్ మన మూఁడువన్నెల పతాకల్ శాంతిసందేశమం
త్రారావమ్ముల నుచ్చరింప జనులాహా దేశమాత్రాకృతిన్.

శా. ఊలాఁమాలపుఁ గొంటెగుంట లిటు "కల్లోజోగి" యంచార్చినన్
జాలు న్మాలయు లేని మార్గముల "భిక్షాం దేహి" యం చెచ్చటన్
జోలెం గట్టఁగఁబోదుమే పరతమస్సుల్ నిండి తూలించినన్
శీల మ్మాల మొనర్తుమే పరుల మోఁచే నీటి కాసింతుమే.

చం. బ్రదికిన నాల్గునాళ్లు గడుపారఁగఁ దిండి ధరింపఁ జీరలున్
గొదవపడునాఁడు నా యనుచుఁ గోర్కెవెలార్పఁగ లేనినాఁడు మే
మదలిచి నిల్వ దోసమగునా! జయమో మఱి చావో తేల్పఁగాఁ
బదుగుర మెచ్చరా! పిఱికిపందలమై బ్రదు కిచ్చగింత మా.

చం. అని జను లొక్కపెట్టు సమయ మ్మొనరించిరి చిత్తశుద్ధితోఁ
దనిసిరి దేశదాస్యము నదల్పఁగ నిల్పఁగ నీ స్వతంత్రతన్
మనన మొనర్చి రెట్టి యపమార్గము ద్రొక్కక నిల్చి రీస్థితిం
గనుఁగొన నేగి నేనొకఁడఁగా నటనిల్చితి మోద మందితిన్.

గీ. కల్లు కంఠాన నిడి దిబ్బి కొల్లఁగొట్టి
తెల్ల దొరలకు నుల్లము ల్తల్లడింపఁ
గొట్టి కోలాహల మొనర్చి నెట్టి శంక
వలదు మీకంచు భటులకు సెలవు లిడిరి.

గీ. రాకపోకల కెల్ల నట్టాఁక లగును
నుత్సవమ్ముల వీధుల నునుప ననుచుఁ
దీరుపుం గల్గ శాస్త్ర ధిక్కారమునకు
నోపమిం జేసి యటు చేయనొల్ల మపుడు.

చం. పరిమితమైన సంఖ్యగల వారల జట్టు తదానుపూర్వియై
యొరవడి రీతి వేఱొక సమూహము చీమలబారు లట్లు జే
భరత సవిత్రికిన్ జయసబర్మతియోగి కటంచు నాదముల్
జరుపుచు సాగ శాంతియుతసైన్యము సత్యపథావలంబమై.

ఉ. మా వెనువెంటఁ 'బంతు' గుణమాఁడనుఁ డా వెనువెంట నాయకుల్
ద్రోవలు దీర్ప నెల్ల జనులుం బొగలంబడి మన్ను మిన్ను లా
రావ మొనర్చు రీతి జయరావ మొనర్చిరి యొక్కపెట్టుగా
స్థావరజంగమాకృతులు సైతము నోళులు విప్పెనో యనన్.

సీ. ఆలకించితిమి గుఱ్ఱాల డెక్కలమ్రోఁత
సకిలింత నిగిరించి సరస మాఁడ
పరికరించితిమి జవ్వాడు భూభాగమ్ము
గదలివచ్చెడి నెఱా కాలిబంట్ల
తిలకించితిమి తీరుతెన్నులే కఱిముఱి
వెన్నాడు ప్రక్కటోపీల వారి
పుడిసిలించితిమి దుమ్ములు రేఁగు రోషాగ్ని
గర్భగోళమునందుఁ గదల నీక
చెండి చెకపెకలాడ నుద్దండు లగుచు
నదుర ప్రేటులఁ బ్రళయనృత్య మ్మొనర్చు
ఘటకదంబమ్ము గాంచి సంభ్రమము మించి
కన్ను విప్పుము శాంతిమార్గమున నుంట.

ఉ. పట్టుఁడు కొట్టు కొట్టుఁడు కృపం గనఁబోకుఁడు మొండికట్టలై
పట్టిరి మొండిపట్టు మెడఁబట్టి యదల్పుఁడు వీరి నింతఁ జే
పట్టియె మట్టుమీఱి యెగఁబ్రాఁకిరి రట్టడిసేయు నిట్టిరుల్
పట్టముగట్టుకొన్న నరపాలురు పోదురె కూటిపేదలై.

చం. అఱపులకే స్వరాజ్య ముదయమ్మగునంచుఁ దలంచి వెఱ్ఱులై
తిరిగెద రేమి వీరి దురదృష్టము నేమని యందు మింతసం
గరుణ యొకింత చూపఁ జులుకందన మయ్యెను గుట్టకున్నఁ గు
మ్మరి పురువౌను దేల నెడిమాట యథార్థము సూ జగమ్మునన్.

చం. అని పెనుబొబ్బలార్చి విరియంబడి వెంబడి పాఱుకాఁడుచుం
గునపముఁట్టి కఱ్ఱలు పగుళ్లు వహింపఁగఁ జావమోదుచుం
బనవిరి కావికావిరి కబాయులు చల్లడముల్ చెమర్పఁగాఁ
దనిసిరి రిక్తహస్తుల నదల్చిరి మీసలు మీటి సైనికుల్.

కం. లంగనముఁ జేయఁ దివియక
ముంగాళులు పైకిఁ జాఁచి మోరల దెసలన్
భంగించి యొత్తఁ జూచెఁ దు
రంగము లవ్వేళ నాదరమ్మున మాపై

కం. విశసనము సేయనొల్లమి
దిశలకుఁ బోఁ జూచుఁగాని తెలివేది మముం
బశుజాతి కీడు సేయద
పశువులె దయఁ జూచు మనుజపశువులకంటెన్.

ఉ. దెబ్బలు కాఁగ లేక వెనుదీసిరి మిత్రులు శత్రులెల్లఁ బె
ల్లుబ్బిరి నేల గ్రక్కదల నోహరిసాహరి నైన రక్షకుల్
గుబ్బ తిలంగ నిబ్బరములుం గడివోయిన లజ్జ పెంపు నా
కెబ్బెఱికమ్ము గూర్చె నొడ లెల్లను జూఁడిన మాడికయ్యెడున్.

ఉ. ప్రాణముమీఁది యాస బలవంతముగా నను లాఁగదీయఁగాఁ
బూనెను దెచ్చుకోలు దృఢముం గయికొంటిని దల్లిదండ్రులున్
మానసమందుఁ దోఁచిరి కొమారిత కన్నులఁ గట్టె నాలియుం
దానయి మానరక్షణ మొనర్చుకోనం బురికొల్పె నెంతయున్.

కం. ఇను మిక్కిలి దెబ్బలకుం
దనువులు బడలంగ నిలువ ధైర్యము లేమిన్
జనులెల్లఁ గాకి గోలగఁ
గను జెదరిరి దృశ్యమద్ది కంపము గూర్చెన్.

కం. తొలఁగుట నిలుచుట తోఁపక
తలగిఱ్ఱునఁ దిరిగె నిట్టి తర్కము నాలోఁ
దల చూపె మఱుక్షణమున
మలఁగెను నిలిచితిని మార్గమధ్యమునందున్.

కం. భీకర హుంకారముతో
నాకడ కేతెంచి రౌతు నడిపెఁపగలన్
జేకోలఁది కశాఘాతము
సోఁకింపఁగ సొమ్మసిల్లి సోలెం దనువున్.

గీ. చెవులు దిబ్బెళ్లువడెఁ దల యవిసిపోయెఁ
గనులు దిర్దిరఁ దిరిగి చీకట్లుగొనియె
నొడలు నఖశిఖపర్యంత మూఁగిపోయె
మానవత్వమ్ము మలమల మఱేఁగిపోయె.

ఆ. బారుదీరు సైంధవములు నాపై రౌతు
లందగింపఁ గనులవిందు సయ్యెఁ
జేఱుకోల మోదు లారాటముం గూర్పఁ
గాడురీతి గుండె గాడిపఱచె.

ఆ. చూడవచ్చువారు సుఃగిరి యీలువు
గలుగువార లొడలు నలఁగిపడిరి
రాజవీధు లెల్ల రణరంగముగ మాఱె
ప్రళయరుద్రనృత్యభంగిఁ దోఁచె.

కం. ఏమో మామానసముల
దీమస మొకయింత రేఁగి దెబ్బకు దెబ్బం
గామింతుము మార్గమ్మది
గామికి నోరిమి వహింపఁ గర్జమ్మయ్యెన్.

సీ. బలిమితో ద్రిప్పు పెంబడి తెవాటులకుఁగా
లొంగనేరక చరమాంగ మిడితి
గునుగుఁబేరెమున డాసినయోధు తరటున
కాకంఠముగఁ దనువాఁక నిడితి

మిడిమేలముగను బైఁబడు దండపాశికు
నమ్మెత్తునను ఱొమ్ము నడ్డమిడితి
కసిపోవ కెటులఁ గక్కసము గ్రక్కెడువాని
దుర్భాషలకు వీనుదోయి నిడితి
మిడిసిపడు నాశ్వికుని బోరమీఁదఁ దన్ని
భూమిఁ బడద్రొబ్బి యటనిల్చు క్షేమభ్రాంతి
యనెడి భావమ్ములకు నంతరాత్మ నిడితి
మొక్క వోవుటచే మ్రుచ్చుమునిఁగి యుంటి.

చం. ఎఱిఁగి యెఱింగి కోరుకొని యింతటికష్టము నోర్చుకొంటి నా
యిరుగడ మిత్రులేరిఁ జొరనీయరు బాధలువెట్ట మానరీ
మొఱకు లదాటుగానొకఁడు మోదెను దానను సొమ్మవోవఁగా
నిరువురు నన్ను మోసికొని యేగిరి మూఁగిరి సేదదీర్పఁగా.

కం. కనుఱెప్పపాటు యుగమై
కనుపించెను మమ్ము గుంపుగాఁగొని రాణ
మ్మునఁ జేర్చిరి సాయంతన
మున విడిచిరి బెదరి లొంగిపోయితి మంచున్.

కం. పగలటులుండి నిశిం
బగఁబట్టెను గాయములు శ్రమ మ్మగ్గలమై
సిగమొదలు గాలిగోటికి
దిగఁద్రాఁకిన మంటలేర్చె దేహము నెల్లన్.

కం. మరునాఁ డరుణోదయమున
నరుదెంచును సైమనంచు నార్భాటమ్ముల్
పురమునఁ జెలరేఁగెను నవి
పురపుర పొక్కింప విలువఁబోయితి మటకున్.

ఆ. ఒడ్డు పొడుగుఁ బెరిగియుండుట నొడ్డుల
లెక్క చేయకుంట నిక్కమైన
దేశభక్తుఁడగుటఁ దెగఁబడియుండుటఁ
గారణముగఁ 'బంతు' గాయపడియె.

ఉ. క్రంతలనెల్లనిల్చి జయగర్వముతోడుత నల్ల టెక్కెముల్
దొంతరవెట్టి యాగడముతోఁ జనుదెంచుట పాడిగాదు మా
పొంతల రాకుమందు జనముల్ బరిమీఁదనె నిల్చి సైమనుం
బంతము లాడఁ జూడఁ బడవాళ్లరుదెంచిరి దండపాణులై.

చం. కనుఁగొను నారటమ్ము తమకమ్ము మనమ్మున జోడుజోడుగాఁ
బెనఁగొన నాగలేక వెనువెంటఁ బ్రయాణమొనర్చివచ్చె నా
జనకుఁడు నన్నుఁ జూచుఁడు విచారము రౌద్రము నొక్కపెట్టుగాఁ
బనుపడ జేవురించి మునిపంటఁ గసిక్కున నొక్కె వాతెఱన్.

శా. ఎన్నోయూహలు సంతరించుకొని వహ్నిజ్వాలలై పొక్కెనో
కన్నీరెంతగ గ్రుడ్లఁ గ్రుక్కుకొనెనో కన్నాకుగా నిల్చి యా
తెన్నుంబాపుకొనంగఁ గాంక్ష నిడెనో తీవ్రించెనో యేమొ యా
సన్నల్ మా హృదయైకసాక్షికములై సత్యమ్ము చేకూర్చెడున్.

ఆ. తగులరానిచోటఁ దాఁకమి ప్రేటులు
నిలువఁ గలిగినాఁడ నిబ్బరముగ
నిట్టిభాగ్యమునకు నేని నోఁచక మిత్రు
లలమటించి విడిచి రాయువులను.

ఆ. దాడి వెడలి తప్పిదారి యొక్కరినైన
విడువనొల్లరైరి బడియవాళ్లు
కా మహోగ్ర దృశ్యమందు భీభత్సమ్ము
చిమ్మిరేఁగె నుత్సవమ్ము తోడ.

కం. మొగదాపులేని దున్నలు
దిగఁ ద్రావిన రీతి భటులు దేరకుఁ దేరం
బగఁబట్టి కొట్టి రీరల
మొగములు నేఁటికిని హృదయముం గలఁచు నోహో.

కం. దేశీయులైన భటులా
వేశమ్ములఁ జూప రాంగ్ల వీరాగ్రణు లా
కాశమ్ము దూఁటువడగ
ర్భాశయములు వీడు వడఁగ నార్చిరి రొదగా.

తే. పాపపుణ్యమ్ములకు నిల్వఁ బాదు దొలఁగె
మంచిచెడ్డల కచ్చో సమాధి యయ్యె
మానవత్వమ్మునకుఁ బెద్ద మచ్చ యయ్యె
హూణసైన్యమ్మునకు వెఱ్ఱి యూహ లెత్తె.

మంజరీ ద్విపద.
ముకుబంటిగా రక్తమున మున్గివారు
"తృప్తాస్మ" యనరు సంతృప్తులు గారు
మానవ లక్షణ మ్మానంగఁ బోరు
సానుభూతికి నిల్వస్థానమ్ము నీరు
రిమ్మెత్తినట్లు దర్శింతురు మమ్ము
వాయెత్తఁగాఁబోవ మాయింతు రదిమి
మానసమ్మున శాంతి మల్లాడు చున్న
మొగమున రౌద్రమ్ము మూర్తీభవించు
దానిలోన లలితమ్ము దోచుచునున్న
పలుకులోఁ బలుకు వెంపఱు లాడుచుండు
బలమైన వింత శక్తుల మధ్య నిల్చి
కాల్గదల్పము గండ కత్తెర కైన

వచియింపరాని పరిచితులైనార
లానాట నానాఁడు నా యుద్యమమునఁ
బాద మూంచిన దేశభక్తులు మాకుఁ,
జలి దీఱి గడిదేఱి నిలువఁ గల్గితిమి
తిరమైన దేశభక్తిని వెలార్చితిమి
హృదయమ్ములను నాఁడు తృప్తి నందితిమి.

# కార్మిక వ్యవస్థ

సీ. ఉసికొల్పి యిసిరింత లుప్పతిల్లఁగఁజేయు
నై మనుసంఘు దుష్కార్యములకు
దేశభక్తుల కనకాశమ్ము భంగించి
కారఁగ్రుక్కెడు బహిష్కారములకు
రాజకీయముల నట్టాడు ముక్కడిమూఁక
సాగించి విసివించు స్వార్థములకు
సాంఘికాచార పిశాచ బృందము రేఁగి
జనులఁ బీడించు దౌర్జన్యములకు
నడుము విఱిగి కూలఁబడిపోయి యరవాయి
గొనిన వారినెల్లఁ గూడఁదీసి
యొక్క త్రాటిమీదఁ నుక్కుతో నడిపింప
జతనములను జేయసాగినాఁడ.

కం. ఈ లక్ష్య సిద్ధి తోడుతఁ
జాలవఱకుఁ దిరిగితిరిగి శ్రమమందితి నే
నాలుగు రాష్ట్రమ్ముల సం
చాలించితి సభల జన సమాదరణమునన్.

కం. మదరాసు మహాసభలోఁ
బాదవెట్టిన తీరుమానముల నెల్లరకున్
మదికింపఁ దెలుప నిలుపన్
గొదకొంటిని నేను దోటి కూటువతోడన్

కం. బరువైన కాఁపురమ్ముల
మురముర ములుగుచును గర్జముల సాగింపన్
వెఱవని వరవృడు కాంగ్రెసుం
దరిసించితి ధర్మబోధనలను దెలిపితిన్.

తే. సాంఘికస్వేచ్ఛ మానవ జాతికెల్ల
నొకటిగానుండఁగోర నార్థికసమస్య
తేలవలె రాజకీయ సందీప్తి దిశల
నేలవలె నెల్లచుమ్మలు ప్రీలు దాన.

కం. కలవారు కులము బలముం
గలవారు కడింది చదువు గలవారు నెఱా
తలఁపుల సంకోచమ్ముల
వెలయించిరి సామ్యవాదవిధదూరగులై.

కం. పెనులేమిడిఁ బెటపెటఁ బే
ల్పను నప్పులు సప్పులొడిచి పట్టిన దినముం
జనఁబోని కాఁపురమ్ముల
మునుకొని చేయంగ శక్యముం గాదుగదా!

కం. ప్రాచీనౌన్నత్యమ్మా
లోచన మొనరించి తాతలును దండ్రులునుం
బ్రోచిన యాచారమ్ముల
నాచంద్రార్కమ్ము నిలుపయత్నింతు రహో!

చం. పలువురఁ జేరఁదీయఁ దమ బళ్లను గుళ్లనునిల్పి రాత్మవి
ద్యల నెఱెయంగఁజేయ నిది ధర్మమధర్మము నాక చెట్టలై
నిలిపిరి శాసనమ్ముల మనీషుల వంచిరి భూమిపాలకుల్
కులమత ధర్మ కర్మములఁ గూల్చిరి మార్చిరి వేసబాసలన్.

చం. అనునుడు లంతరంగముల యందుఁ గవోష్ణపు రక్తబిందువుల్
దొణికిసలాడఁగా సభలలో వచియింతురు నాయకాగ్రణుల్
జనులను రెచ్చఁగొట్టుటకు సాధనమైనను దీన లాభముల్
పొనపొన నిల్చునే మతముపొత్తున సౌఖ్యము లావహిల్లునే.

చం. జనపదవాసు లీరెఱుకచాలక నిల్చిరి పట్టణప్రజల్
మునుకొని పిండుగట్టి జవముం జలముం బలముం గడింపఁగాఁ
బనివడి సామ్యవాద పథవర్తన జాతిమతాంతర ప్రస
క్తిని విడనాడి నిల్చిరి జిగీషువులై రి పరాయి యేల్బడిన్.

ఉ. నేనిది ముందుగా నుడువనేర్చు వలంతినిగాను గాని నా
మానస మిందు లగ్నమగుమాట యథార్థము హెచ్చు లొచ్చులం
దీన జయింపవచ్చునని నిర్ణయమందితి సామ్యవాదముం
బూనిరి తోఁడివార లనుమోదము తెల్పిరి సమ్మదమ్మునన్.

కం. ఐదేండ్ల పదకములతో
సాధించె ననంతజయము చాఁగు బళీ ర
ష్యాదేశ మిట్టి మార్పులె
పాదుకొనం జూతు నెపుడు భారతభూమిన్.

కం. పిడికెఁడు బోనము పొట్టకు
ముడిబట్టయు మూరెఁడైన మొలకును వలదా
మడిదున్ని దోఁకువానికి
నడుగడుగున గేలిసేయుటా! యిది తగవగునే.

కం. శ్రామికుల నెమ్మనమ్ములఁ
బ్రేమించిన నాఁడె సిరి వరించును దేశ
క్షేమ మ్మభివృద్ధి యగుం
గామితములు పొసఁగు నెల్లకళ లందెసఁగున్.

వ. పాశ్చాత్యదేశములనుండి 1927 డిసెంబరులో నేను దిరిగివచ్చునప్పటికి మార్క్సుసిద్ధాంతము భారతదేశము నలుమూలల నావరించెను. 1926 సంవత్సరములోనే సామ్యవాద కార్యక్రమము నొకదాని మారాష్ట్రమున నిలుప యత్నించితిని.

కం. జాతీయసంస్థసభ్య
వ్రాతమునను వలచె సామ్యవాదమ్మును నా
చేతమ్ము నలమె ముఖ్యుఁడ
నైతిని నేనందుకతన నందితి యశమున్.

సీ. ఊరిచుట్టును భూములుండి రెండవవాని
రాపాడఁజూచు దౌర్జన్యపరులు
పసిఁడిముద్దలు చందువాపెట్టియల మూల్గఁ
గోరమీసలు దువ్వు కొండెకాండ్రు
పరివారమునకు సంబళ మొకింతయునీక
కొలువు లందఁగఁ గోర్కిసలుపు దొరలు
పరులనెత్తురును జక్కెరపానకమ్ముగాఁ
గ్రోలు సామంత భూపాలవరులు
దాహ ముడివోవఁగాఁ బోని సాహుకార్లు
గలరు మారాష్ట్రమున వారి నిలువరించు
తీరుమానమ్ము లుంపఁగా దీక్షఁ బూని
కాలుమోపితి సభల సౌఖ్యముల రోసి.

కం. తల వెట్టిగొలుపు తలఁపులు
సలిపిరి మార్పులకుఁ గొంకుజంకులుగల స
భ్యులు డబ్బాటుగ మేమిది
సలిపితిమని నింద వైవసాగిరి పెలుచన్.

ఉ. గారవమెంత సంఘమునఁగల్గిన గొప్పకులాలవారు సం
సారములందుఁ బట్టుదిగజారిన మాఱినఁ గూడుగుడ్డలం
గోరుదు రెల్లవెంటఁ దమకుం గడుదైన్యము దాఁపురింపఁగా
నారటమందిరా మనములందు యథేచ్ఛత లందఁ బొందగన్.

ఆ. గుడికి బడికి నూరినడిమికి రావీలు
పడనివాఁడు బెంగపడిన నాఁడు
భరతభూమి కెంతస్వాతంత్ర్య మబ్బిన
మేలుగలదె పొగడికోలు గలదె.

తే. వ్యావసాయిక కార్మిక వ్రాతమునకుఁ
బాలనమునకు మధ్య భూస్వాములుండఁ
దగదటంచును సామ్యవాదముచు నిలుపఁ
దీరుమానమ్ము ఘటియించితిని సమజ్య.

మ. పరిషత్సభ్యులలోనఁ గొందఱిది సంభావించి రీయర్థముం
బరిహాసమ్ములు గొందఱాడి రిటుదీర్మానమ్ము గావింపఁగాఁ
దరుణుల్ పూరుషు లంగనాజనము లుత్సాహమ్ముఁ జూపించి రీ
మురిపెమ్ముల్ మునుముందు రాఁదగు శుభమ్ము ల్చూపఁ జుక్కాణులై.

చం. అదియిదె కారఁగూరు సమయ మ్మరుదెంచిన దంచు మిత్రులుం
బదుగురు హెచ్చరించి రిది పట్టుదలం గడుఁగూర్చెఁ గర్జముల్
పదిలముగా నొనర్చుకొను పాఁగెము నాకొనఁగూడె నొంటిగా
మెదలుట కుత్సహించితి సమీక్ష నొనర్చితి భూతకాలమున్.

కం. కలకత్తా కాంగ్రెసునకుఁ
దలమానికమయ్యె నాదుతండ్రి యతండుం
బులుమగఁ జూచెను మాపై
బలిమిం దన యఖిలపక్షభావము లెల్లన్.

కం. బలవంతుఁ డెత్తివచ్చిన
బలహీనులు నిల్వఁగలరె ప్రాణములు పణ
మ్ములుగాఁగ నిడిననైనం
దలఁచుట సామాన్యపురుష ధర్మ మ్మగునా!

కం. వేలకు వేలు జనులు పే
రోలగమున ధర్మముల మహోన్నతరీతిం
గూలంకషముగఁ దెల్పెడి
వేళల మోమోటపడెడి వేటిడి యున్నె.

చం. అదియిది యానుగాదని మహాసభఁ బల్కుటె కాని బాధ్యతా
స్పదమగు తావుల న్నిలిచి భారము మోయఁ గడంగువారు మా
సదమున నేరులే రిదివిచార మొనర్చెడు వేళ నాకెదో
మదికి వెతారముం గలుగు మంటలు గ్రమ్మ శరీరమంతటన్.

ఆ. ధర్మమును వచించు తరుణమ్ములందును
దల్లిదండ్రు లన్నదమ్ము లనెడి
బాంధవమ్ము వెంటఁబడరాదు గాన నా
తండ్రి నెద్రిచినాఁడ ధైర్యమునను.

ఉ. అంతము లేని ఘోరవిపదంబుధి మున్గిన మున్గఁగాక సి
దాంతవినిర్ణయమ్ముల నుదారత చూపఁగరాదు చూపెఁబో
చింతలవంతలం జివికిజీర్ణము తానగు టేమి బ్రాతి య
త్యంతవిపత్పరంపరలయందు మునుంగఁగఁజేయు లోకమున్.

కం. మానప్రాణమ్ముల పై
స్థానము సిద్ధాంత మట్టి దానిని బలిగా
నేనరుఁడు నిల్వఁగల్గునో
యానరుఁడే జాతిజీవనౌషధ మరయన్.

కం. జాతీయసభ ననేకులు
నేతలు గాంధీమహాత్ము నిందింతురు వా
రాతని వెలివేయఁగ లే
రీ తిబిరులుపల్క నాల్క లెట్లాడునొకో.

కం. ఎదిరించినాఁడ నాఁడా
సదమునఁ దీర్మానమును నిజమ్ముగ నెడఁదన్
జివగొద లుదయించెను నా
కది యాత్మోన్నతికె మూలమయ్యెం దలఁపన్.

ఉ. నీతివివిల్చి నమ్మినది నిష్కలుషమ్ముగఁ బల్కునట్టి* నా
చేత మెచ్చుంగువారు నను సేమముగోరెడువారు ధర్మని
ర్ణేతలు కార్యదర్శిగ వినిర్ణయముం బొనరించిరీ నను౯
సాతతముంటి నేనొక ''బిషప్పు'' విధమ్మునఁ బెత్తనమ్మునన్.

ఆ. బొగ్గుగనుల కేంద్రమున జారియాపురి
నఖిలరాష్ట్రకార్మికాళిఁ గూడి
కొలువుదీర్చి దాన నిలిచితి రెన్నాళ్లు
కలకటాకుఁ బిదపఁ గదలినాఁడ.

కం. అతిదైన్యాతిభరమ్మున
బ్రతుకీడ్చెడు కూలివారు రైతు లెడందన్
సతతము వసిఁతు రీరల
గతికై తపియింతు నెల్లకాలము దీక్షన్.

సీ. సాంఘికవ్యవహార సంస్కర్తలగువారు
తిలకింపఁబోవ రార్థికసమస్య
ఆర్థికవ్యవహార మరసి దిద్దెడువారు
రాల్పెఁగా లేరు వర్ణవ్యవస్థ

వర్ణవ్యవస్థ డిల్పడఁ జేయఁగలవారు
తడవఁగాఁబో రన్యదౌష్ట్యములను
అన్యదౌష్ట్యమ్ముల నణపఁగాఁ గలవారు
మన్నింపఁబో రహింసావ్రతమ్ము
సాంఘికార్థికములు జాత్యభేదాహింస
లొక్కరీతిఁ దీర్పనున్నవారు
దేశమునకు దివ్యదీప్తుల నిడువారు
వలయు దాస్యబంధములను ద్రెంప.

చం. మగఁటిమిగల్గి పేలియభిమానముగల్గి యుదారభావముల్
మిగులుగఁగల్గి యెన్నఁడు చలింపని ధైర్యముగల్గి నిల్వఁగాఁ
దగియెడువారె నాయకపదమ్ముల నిల్తురు వన్నెఁగూర్తు రీ
పగతురనోర్తు రీవెడఁగుపాటు నడంతురు మింతు రంతటన్.

చం. బుగిలి తపించిపోవు మనపూర్వచరిత్రలనెల్ల రూపుమాఁ
పఁగఁ బగఁబూని రన్యజనపాలురు దీనికి నోహటెల్లకే
తెగియెడువారు శౌర్యబలతేజముగల్గెడువారు ధీరులై
నెగడెడువారు మాతృధరణీనిగళమ్ములఁ ద్రెంప నుద్భటుల్.

కం. శ్రమపడువారికి మేళులు
క్రమముగ రాఁగోరి జోపిగావించెఁ గృషిన్
సమయమ్ము లేచి మించి
త్తము మాభాగ్యమ్ము పలుకు దలఁప రితరులున్.

కం. అతివాదులైరి గొందఱు
మితవాదులు గొందఱైరి మిశ్రితభావా
లతుకవడవాయె సభ్య
వ్రతతియు నిరుపాయలై విరాజిల్లె నొగిన్.

కం. వత్సరములతరబడి యా
పత్సమయములందుఁ గూలివారలకొఱకై
మత్సరముగొనిన ధనికుల
నుత్సాహముతోడ జోషి యోర్చి యెదిర్చెన్.

తే. భేదభావమ్ముగల యతివాదులెల్ల
నభినుతింతురు జోషి కార్యక్రమముల
నుద్యమమునకు సర్వస్వ మొప్పగించు
వీరులకు నెల్లవారు జోహారు లిడరె.

ఆ. ముఖ్యముగను నాఁడు బొంబాయిపురములో
నేయువారు కూలిచేయువారు
ప్రజలయండతోడ యజమానుల నెదిర్చి
సమ్మెచేసి గారవమ్ము గనిరి.

తే. జాతకమ్మును నెఱాసత్యమ్ముగాఁ బల్కి
జనిధర్మముల బోధసల్పు నొకఁడు
సాముద్రికమును నచ్చఁగ మెచ్చఁగ వచించి
కర్మమ్ముతో వాయిగట్టు నొకఁడు
శనివారదానమ్ములను నూకలంజల్లి
కూలివారలఁ గొల్లఁగొట్టు నొకఁడు
పాపభారమును దైవముదీర్పు వినుతించి
పనివారి నోరుగొట్టును నొకండు
కొఱవిచీమలకెల్లఁ జక్కెరలు మేపి
కాలసర్పమ్ములకునెల్లఁ బాలుద్రాపి
కాలముంబుచ్చుకొను భాగ్యశాలులకును
దెలియవచ్చునె భాగ్యహీనుల యలంత.

కం. వ్యక్తిగత సానుభూతియు
వ్యక్తముగా మార్పుఁ గోరువారలపయి నే
భక్తిం జూపితి దాస్యపు
ముక్తిం గోరితిని దేశమున మేలొదవన్.

కం. మితవాదు లొక్కరీతిగ
నతివాదుల గెలువ నన్ను నధ్యక్షునిగాఁ
బ్రతిపాదించిరి దానికి
నతివాదులు సమ్మతించి యౌననిరి సభన్.

కం. మత కుల సంఘమ్ములలో
నితరులు పెదగద్దె నెక్కు టెఱుఁగము వేఱొ
క్రతిసభకన్యుఁడు నేతగ
వితమెఱుఁగకయుంట నేఁడువింటి మయారే.

కం. హరిజన గిరిజన సభలకు
నెఱుకల యేనాది సభల కెవ్వారలొ వే
పిఱుదివియకుండ నుండుట
పరియాచకమయ్యె నాకు భావమునందున్.

కం. పనివారి తెగకుఁ జెందక
వినువీథిఁ జరించువాని వేగరి నొకనిం
గనుకనిగ నెన్నుకొనుటలు
మనమునఁ బోటెత్తు దురభిమానము లొత్తున్.

వ. 1928-1929 సంవత్సరములు వేతనవివాదములతో సమ్మెలతోఁ గడచెను. వంగదేశమున నార మరలలో "జెంషడ్పురము"న నినుప పనులలో మఱియు రైల్వేలలో సమ్మెయలు జరిగెను. పనివారు యజమానుల యినుపహస్తముల ద్రుగ్గిరి.

సీ. హీనాతిహీనమ్ములైన వస్త్రములతో
రాపాడఁబడిన నేత్రములతోడ
సత్వశూన్యములైన సంధిబంధములతో
నదుమ ఁడువడిన దేహములతోడ
దుర్గంధపూరితాంధువులైన యిండ్లతో
సమతవీడ్వడిన మార్గములతోడ
అర్ధనగ్నశరీరలైన భామినులతో
శుష్కించిపోయిన సుతులతోడ
కామ్యములరోసి భోగభాగ్యములఁ బాసి
కాఁపురములీడ్చు సంబళకాండ్ర కెల్ల
దినదిన మ్మొక్కగండకత్తెరయు నాయె
లేమితోఁ బొత్తుసేయఁగా లేఁదు నరుఁడు.

ఉ. మీరటు కుట్రనేరము సమేలము చేయఁగ ముఖ్యనాయకుల్
కారల ద్రోయఁగాఁబడిరి లాఁతిజనమ్ముల నెప్పు పెట్టులే
తీరుల నొంతురో యనెడు తీవ్రత హెచ్చె సుఖమ్ము శాంతి చ
ల్లాఱె నఖండభారతమహాసద ముట్టటలూఁగ నొక్కటన్.

మంజరీ పోటుకూఁతలు పెట్టు పోకిరినరులు
ద్విపద. నేలమాలెలు ద్రవ్వి నిల్చు దుర్జనులు
అదరించి బెదరించి బ్రదుకు ముష్కరులు
దయయు ధర్మములేని దార్జన్యపరులు
గుణగణహీనులౌ కుంటెసుంకరులు
నమ్రత్వమున హూణసామ్రాజ్యమునకు
దాసానుదాసులై తాళముల్ వైచి
బిరుదమ్ములను బెక్కు వరపదమ్ములను
దెక తేరగాఁగ నందిరి ముదమ్మునను
చెఱసాలమ్రగ్గి శుష్కభూతులైన

వారికై డాక్టరన్సారియు మేము
పదిమంది యొక్కటై వాగ్విశారదులఁ
బలువుర న్యాయవాదులఁ గూడిమాడి
శ్రీమంతులెల్ల రార్థికపుష్టి గూర్చ
నాస్థనిల్పితిమి న్యాయస్థానములను
పరమదరిద్రులౌ పనివారినుండి
ప్రోవుచేసిన రూకరూక పైకమును
న్యాయవాదుల చేతికందింప వారు
సంతృప్తివడక కష్టము గూర్చినారు
రాజకీయములు నేరములు పైఁబడ్డ
వాదించినను లేద వాదింపకున్న
ఫలముశూన్యము నష్టపడు టధికమ్ము
మమ్మెల్లరను ప్రభుత్వ మ్మింతలోనఁ
గారలోవేసె హుంకారమ్ము సేసె.

## ఉత్సవములు

కం. పదివత్సరములు గడచిన
యదనునఁ బంజాబులో మహాసభ జరుపం
బదుగురు వినిశ్చయించిరి
యది గతకాలమును దలఁపునందును నునిచెన్.

వ. 1929 వత్సరమునఁ బంజాబురాష్ట్రములోని లాహోరులో జరిగిన కాంగ్రెసుమహాసభ 1919-వ యేఁట నచటనే జరిగిన సభను మఱియు నీమధ్యకాలమున జరిగిన సన్నివేశములను సభ్యమహాజనులను జ్ఞప్తి కెలయించెను.

సీ. మరతుపాకులను డయ్యరు దయ్యమై ప్రేల్చి
యపహాస మొనరించు నమృతసరము
బడితవాట్లకు గుండెపగిలి నెత్తురు నోటఁ
బ్రవహించు లజపతిరాయిమిత్తి
అవమానపూరితమ్మై మహాభయదమై
వాసించు సైనిక శాసనమ్ము
కాలమేఘములు నల్గడల గర్జలుసల్పి
కదలిరానున్న సంగ్రామఘోష
తూలిపోయిన నాఁటి వస్తువులధరలు
వాలిపోయిన జీవితావసర విధులు
ప్రేలఁగొట్టెడు భావనైస్పృహ్యాగతులు
తలఁప గుండెలుప్రేవులు వెలికివచ్చు.

ఉ. కేవలమానహీనత నకించను లల్పగు లాత్మవంచకుల్
దేవులుగొట్టు లన్యజగతీపతి సేవకు లర్థకాంక్షులై
జీవితమంది మమ్ము నెడసేసిరి ధర్మపథమ్ము దప్పి మా
త్రోవల నడ్డగించి కడుదూఱిరి స్వార్థపరత్వబుద్ధితో.

కం. అధికారయుత విభుత్వము
బధిరితమై ప్రజల మొఱలఁ బాటింపదు దు
ర్విధి మెయి శాసనసభలం
బదమూంచినవారు సంభ్రమముగొని రెదలన్.

కం. బత్తెములకు సంపత్తుల
కొత్తగిలంబడుట తప్ప నొండేమియు మా
పెత్తనములందు లేదని
చిత్తమ్ములఁ దత్తరమ్ము నెందిరి సభికుల్.

కం. సైమనుసంఘు బహిష్కృతి
నేమించిరి సభికు లెదిరినిర్ణయములనుం
బ్రామిరి రాజన్యుల కిది
తామసముంగూర్చె నిండుతాల్మి వెలార్చెన్.

కం. స్వాతంత్ర్య సమరవీర
వ్రాతమ్మున విఠలుభాయిపట్టేలుకు వి
ఖ్యాతియుఁ గలిగెను జనులకుఁ
జేతఃప్రీతియును గలిగెఁ జిఱచిఱ లణఁగెన్.

ఆ. ఇంట బయట రెంటనంటియుంకుట చేత
మోతిలాలు మొగము మొత్తె దీన
వీలువెంట సభల విడువఁగా నుంకించెఁ
జట్టమునకు లొంగు చతురుఁ డగుట.

ఉ. గారడివానిటోపి నెలుకల్ దిగజాఱినయట్లు న్యాయముల్
వారక మార్పులందె బహుళమ్ముగ, నొప్పరికించి చూచినన్
బారముముట్టదయ్యెఁ బరిపాలకు లెప్పటికప్పు డేవొ దు
ర్త్తారములెల్లఁ బల్కుదు రెదో తమయిష్టము వచ్చినట్లుగా.

ఉ. పాశవికప్రవృత్తులకుఁ బారముఁజెప్పగఁ బూను తండ్రి కా
వేశముహెచ్చె వక్రపదవి న్నడయాడెడువారిఁ దీర్పఁగాఁ
గాశల మెంతచూపినను గాదను సత్యమెఱింగె నాపతత్
క్లేశము లోర్వఁజాలక యెదిర్చి విదిర్చెను బాహుయుగ్మమున్.

సీ. కోపించినట్లుండు భూపాలకులతోడ
నెంతకాలము నిర్వహింపఁ గలము
వంచించినట్లుండు పరిపాలకులతోడ
నింపుతో నెటు సంచరింపఁ గలము
చండించినట్లుండు దండధారులతోడ
వియ్యమ్ము నెట్లు గావింపఁ గలము
జంకించినట్లుండు శాసనమ్ములతోడ
దినవెచ్చ మేరీతి దీర్పఁ గలము
నీతికిందప్పి నీచాతినీచముగను
బ్రదుకుగడపుట మిపుల దుర్భర మటంచు
నామతించెను శాంతిసంగ్రామమునకు
ముఖ్యులౌవారి నాత్రండి మోతిలాలు.

కం. కలకత్తా కాంగ్రెసు లో
పల బాధ్యతఁ గొనుటఁదక్క వార్ధాబుషి యా
వల నంటుసొంట లేకయ
మెలఁగెను ఖదరుద్యమమున మేకొని నిలిచెన్.

చం. తను మొనకట్టి రాట్నమున దారముదీసెను లాఁతివారలం
బనుపడఁజేసె నంత నెగఁబ్రాఁకనొనర్చెను బల్లెపల్లెకున్
మునుకొని సర్వదిగ్వలయముల్ తనుదానయి చుట్టివచ్చె నే
ననుపదవర్తినై తిని మహాద్భుతమందితి నాప్రతిజ్ఞకున్.

కం. కనుమనసులు దనియంగా
జనములు వేవేలువచ్చి సందర్శనముం
బొనరించె నామహోత్సవ
ఘనతను వర్ణింప నలవిగా దెవ్వరికిన్.

ఉ. శ్రీయుతులైనవారి దరిఁజేరె మహోక్తులతో దరిద్రనా
రాయణులైనవారిని దయంగనఁగోరు దరిద్రతాపద
మ్మాయెడ నాయెడంద రుచియింపదు లేమిని బాపలేనిచో
నాయకు లీస్వరాజ్య భజనమ్మున నిల్చుట వేఁడికోర్కెకా!

గీ. అతిదరిద్రులనుండు నారాయణుండు
వానికై బిచ్చమెత్తఁగా వచ్చినాఁడ
ననెడుపల్కులు నాహృదయమ్ము గలఁచు
గాంధి యూరూర నిదిగట్టిగా వచించు.

కం. దారిద్ర్య మనుభవించెడు
వారలు నారాయణునకు వారసులైనన్
నారాయణు సంస్మరణము
ఘోరమ్మగు, వానికొలువు కొలయగుఁ గాదే!

కం. మనదేశమ్మున నారా
యణుఁడుండెడుదనుక బీదలావారి కిఁకన్
మనుగడల సుఖము లేదా
పనిచెడుపులదొరలఁ గొలువ భావ్యమ్మగునా!

చం. పరహితకాంక్ష వెన్నవిలి భైక్షపరిగ్రహజీవమాత్రుఁడై
నరుఁడెటు లోర్వఁగాఁగలఁ డనారతదౌష్ట్యపరంపరన్ నెఱా
సిరిగలవారు లోకులవశీకృతులం బొనరించుకొంటకై
తిరిపము వెట్టుచో నదియుఁ దీర్చునె పీడితజాతిబాధలన్.

చం. ఆదియిదియంచుఁ జెప్పు హృదయంబు నయం బనయంబటంచు నెం
చమఁగద లేనివారి యగచాట్లనెఱింగిన నాయకోత్తముల్
పొదలిననాఁడె ముక్తి మనభూమికి నివ్వటిలుం దదర్థమై
యదుకులు వెట్టుచో భువి ననాశ్రితులం గణుతింప రెయ్యెడన్.

ఉ. ప్రీతిజనింప దీని వివరించి వచించితి గాంధితాతకున్
దాతలనాఁటి దృష్టి నొకదానఁ బరిష్కృతి నాచరింపఁగా
నాతఁడు చూచె ద్రవ్యముగలట్టి మహాత్ములు ధర్మకర్తృతా
స్థాతలు మాత్రమంచు బహుధా ప్రతివాక్యము వక్కణించెడున్.

ఉ. నేనిది మేలిత్రోవయని నేఁటికి నమ్మకముంపలే నవా
జ్ఞానసగోచరమ్ములని మన్ననచేసినఁ జేయవచ్చు నీ
పూనిక లెల్లవేళఁ బరిపూతములంచు సహేతుకమ్ముగా
నేనరులైనఁ జెప్పఁగలరే సభలందు ననన్యచిత్తులై.

కం. ఇది యిటులుండఁగ శాసన
సదనమ్మున సభలుజరుపు సమయమ్మున నే
యదిరిపడ రెండుబాంబులు
వదలిరిపో సింగు దత్తు పౌరుషశాలుల్.

కం. నిదురంగూరిన సభలం
బ్రదిలిన యారవము కర్ణవేధ మొనర్చెన్
హృదయములు వ్రీలఁ బదుగురు
చదిసితిమని డిల్లపోవసాగిరి పెలుచన్.

కం. ఇది కుట్ర నేరమనుచుం
బదుగురఁ జెఱసాలనుంచి బాధించిరి దు
ర్మదమున నమానుషమ్మున
మొదలుతుదలు లేని నిందుమూర్ఖత్వమునన్.

కం. నిరయమునకన్న మిన్నగు
చెఱసాలంబడి తపించి జీర్ణించి మహా
నిరశనదీక్షం బూనిరి
పరమాసహ్యాత్త్వమున కుపగ్రహులెల్లన్.

తరల. నిరశనవ్రతదీక్షఁబూనియు నీరసించినవారలన్
జెఱలనుంచి కచేరిచేర్చుట చేఁతగాకను దీర్పులన్
బఱుపవచ్చుఁ బరార్థవాదులు వచ్చిరాకయు దక్కినన్
దొరలుచట్టము లేర్పఱించిరి నోరునొక్కిరి లోకులన్.

మాలిని నెలయుఁ గడచిపోయెన్ నేను లాహోర్పురానన్
నిలిచి చెలులఁ జూడన్ నేతలా వారి యాజ్ఞన్
గలిగి మొదటసింగున్ గంటి నాపైని దత్తున్
దలఁపు మెలఁగు మిత్రున్ దా "జతీందాసు" గంటిన్.

మత్త కోకిల వారలెల్లరు బక్కచిక్కిన వారు పట్టిరిమంచమున్
మారకాంతి "జతీను" దా సుకుమారబాలికపోలికన్
సౌరుమాఱియు సుప్రసన్నత జాఱిపోకయ నిల్చె న
య్యారుపుం గని బ్రుంగె నర్వదియొక్కనాఁ డుపవాసియై.

ఉ. ఈ కమనీయగాత్రుఁ డిటులీల్గిననాఁడు సమస్తలోక ము
ద్రేకమునందె నాప్రళయదీధితియే మిఱుమిట్లుగొల్పి చీ
కాకొనరించెఁ బాలకులు గాతరభావమునంది బంది పి
ర్యాఁదుల నెల్లఁ దీర్ప నొకరిన్ నియమించిరి ప్రోచికోలుగా.

ఆ. బందికాం(డ్ర మూఁడుపాయలుగాఁ జీల్చి
టొకటివక్క లాభమొకటి లేదు
సూత్రతతిని గ్రొత్తచూపుటయే వినా
సాగుపాటు మార్పు జరుగలేదు.

వ. ఈసమయమున నాంగ్లేయ ప్రభుత్వమువలెఁ జండభానుఁ డుద్దండుఁడై గ్రీష్మమునఁ బ్రవేశించెను.

సీ. చెమటచిత్తడి కొడల్ చిమచిమలాడఁగా
జలయంత్రములచెంత నిలుచువారు
నీరుమజ్జిగ నిమ్మనీరు చక్కెరఁగల్పి
కొంచె కొంచెముగాఁగఁ గ్రోలువారు
చలిపందిరుల నెలంతలతోడి ముచ్చట్లు
విసువునందకను గావించువారు
పొల్లుసుద్దులఁ బ్రొద్దుపుచ్చు హెచ్చినరిచ్చ
మల్లగుల్లములతో మసలువారు
ఆరుబయళులఁ జుక్కలతీరుఁ జూపి
పిల్లలకు వింతకతల విన్పించువారు
డిల్లపోయిరి వేసంగి నెల్లవారు
చంద్రనిప్పుల వడగాలి జబిరి వీవ.

ముత్యాల సరాలు గేయము.

ఊఁదినది నలుదెసల నూష్మము
పాదమిడె మిడిమిడిగ జ్యేష్ఠము
లేదు లేదిఁక శుభముహూర్తము
పేదవడిపోయినది ఘోషము
ఎండమావులమీఁద గ్రీష్మము
దండిగాఁ బరవళ్లు దీసెను.
పదును పాతాళమ్ము పట్టెను

నదులగర్భము లవసిపోయెను
చిదురుచేఁపల మేను లుడికెను
పొదలలోఁ దాఁబేళ్ళు దూరెను
చంద్రనిప్పుల గ్రీష్మ ముమిసెను
మండి వనముల భూతి యెగసెను.
నిప్పుజల్లులకాంతి రప్పున
నుప్పరమ్మున కెగసె గుప్పున
నప్పుకోరకు లూరె జనమున
ముప్పుతిప్పలు గల్గె ఘనమున
నొడలిబడలిక మేరమీఱెను
బుడుత వేసవిసెలవు లందెను.
కడచె జ్యేష్ఠాదేవి జ్యేష్ఠము
వడిగ నాషాఢమ్ము వచ్చెను
పుడమి నవతారమ్ముదాల్చిన
వడువుగా మేఘములు మొలచెను
కాళిదాసుఁడు కలముపట్టెను
కాలచక్రము మాఱిపోయెను.
కూఁతు రల్లుఁడు కొడుకు కోడలు
చేతముల నుప్పొంగుజాడలు
ప్రీతితోఁగను నత్తమామల
రీతులకుఁ దాళమ్ము లుఱుములు
మల్లెమొగ్గలు వెల్లివిరిసెను
పల్లములలో వెల్లి విరిసెను.
గాలితరఁగల తాఁకిడికి ను
య్యాలలూఁగెడు ముదురు చివురులు
రాలిపోవురహస్య మెఱుఁగక
మేలమాడును ముదురుటాకుల
నడుమువంగిన నాయనమ్మను

బుడుత నడలో ననుసరించెను.
మల్లెమొగ్గపసందు డెందము
కొల్లఁగా హరియించి వైచెను
పల్లవాధరగోష్ఠిమాత్రము
చల్లఁగా హృదిఁ దాఁకి కలఁచెను
చెమటఁ జిమచిమలాడె దేహము
కమిసి దుముదుములాడె దాహము.
చదువుచెప్పెడి పంతులయ్యకుఁ
బదము లర్థముగాక పెనఁగెను
మదిని నెమ్మదిలేక శిష్యుఁడు
బదనికకు మూలమ్ము నడిగెను
వదలె నరములపట్టు సాంతము
కదలె మస్తిష్క మ్మమాంతము.
వేఁడి వెలుపల వెడలఁగ్రక్కెడు
నాఁడు జీవుల శైత్యమెక్కుడు
మూఁడమంచెగఁబడిన యప్పుడు
నాడినాడిని నుష్ణమెక్కుడు
జీవశాస్త్ర రహస్యమేమో
భావుకులు గ్రహియింత్రు గావుత.
తీరుతీరా మావిఫలములు
నారికేళఫలాల రసములు
కోరుకొందురు భాగ్యవంతులు
ఆరటము, వలి యాను సమతలు
కలిమిబలిమికిఁ గన్నుసన్నల
నిలుచుఁగోర్కెలు సర్వజగముల.
తాప మనుతాపమ్ము పుణ్యము
పాపమును సౌఖ్యమ్ము దుఃఖము

తీపు చేఁ దిటులనెడి వాక్యము
వేఁపపండిడి తెల్పె గ్రీష్మము
శుచి మహాశుచియైన ఋతువిది
ప్రచలితంబయి నిలిచె నేఁడిది.
ఈయెడను బరిణామసౌఖ్యము
లాయె దివసము లెల్ల మదికిని
హాయిగా సర్వర్తుశోభిత
మాయె గ్రీష్మము తుట్టతుదికిని
బోటిమిన్నల ప్రియతమమ్ములు
పాటలీసుమపరిమళమ్ములు.

ఆ. వేఁడిబెడఁద కడలి బెకబెకలాడుచు
గోండ్రుగప్ప నోరుగొట్టుకొనియె
నెడఁద కరఁగి మొయిలు విడిచెను గన్నీరు
ఘనులు లాఁతివెతలఁ గాంచలేరు.

ఆ. మెఱిక పల్లమనక మెఱుముచు నుఱుముచు
సర్వ మొకటిచేసె జలధరములు
కొట్టములను గట్టుమట్టులఁ బశువులు
నిలువుకాళ్ళతోడ నిట్టనిలిచె.

ఆ. ప్రళయతాండవముగ నలుగడలం గ్రమ్మె
మేఘములును యుద్ధమేఘములును
బాహిరముగ నాఁడు లాహోరుసభకు న
ధ్యక్షు నెన్నుకొనెడు తరుణ మయ్యె.

కం. జాతీయరాష్ట్రసభలుం
బూతాత్మకు గాంధి యోగిపుంగవు జనతా
ప్రీతికరు ముక్తకంఠ
వ్రాతమ్మున నెన్నుకొని రభంగురభంగిన్.

కం. పోరాటము నడపింపఁగ
నారాటము నెందువేళ నధ్యక్షుండై
ధీరత్వము చూపని-చోఁ
గారాగారములు గావె కాంగ్రెసుసంస్థల్.

ఆ. యోధవరుఁడు దండనాథుఁడు మొనకట్టి
నడుపువాఁడు లేపినాఁ డొకండు
పేరుపెంపు నాత్మవిశ్వాసముం గల్గి
మెలఁగువారె వీరి నిలువఁ గలరు.

కం. అంగీకృతునిం గావిం
పంగను సమకట్టె సభ్యమండలి యిదియున్
బింగడమై విస్మయమును
భంగంబును గూర్చె దేశభక్తుల కెల్లన్.

తే. గాంధి నాపేరు సూచించెఁ గట్టకడకు
సంభ్రమాశ్చర్యవిస్మయస్వాంతుఁడ నయి
నతశిరస్కుండ నైతి విన్ననువు దప్పి
మంటతో మేను చూఁడినమాడ్కి యయ్యె.

కం. అంహాస్స్ఫూర్తిని నే నిటు
సింహద్వారమును విడిచి చేరితి ననుచున్
బంహిష్ఠులైన వారల
సంహతి వాకొనక యుండఁజాలదు భావిన్.

కం. ఇది ధిక్కృతి నొనరింపఁగఁ
జమరగువని భావనమ్ము సలిపితి నైనన్
బదుగురు నా నిర్ణయమున్
వదలించిరి చేసి రధిక బలవంతమ్మున్.

కం. ఈ నిశ్చయమున జనకుని
మానస మానందవార్ధిమగ్నం బాయెన్
దానయి పీరమ్మొక్కిన
షోణిమిగని గాంధి హృదయపుష్పము విరిసెన్.

సీ. తనతండ్రి వెనుక పెత్తనము నందెనటంచు
సరసులౌవారు గర్వరు వహింప
పసరుప్రాయమున నిష్పట్టమబ్బె నటంచు
యువకసింహములు సాహసించింప
సర్వస్వ మొడ్డె దేశమున కీతఁడటంచు
నిస్వార్థపరులు వన్నియ ఘటింప
ఆరోగ్యమంది దీర్ఘాయుర్భవ యటంచు
శేముషీవిభవు లాశీర్వదింప
నాయకులు సర్వజనులు వెన్నంటినిలువ
సర్వదిగ్వలయమ్ము లుత్సాహపడుప
జరిగిపోయిన యమ్మహాసభను దలఁప
నేఁటికిని జిత్త ముప్పొంగు గాటముగను.

కం. రాజప్రతినిధి యిర్విను
జాజరమున గుండ్రబల్లసభ జరుపంగా
నోజం బ్రకటన మొనరుప
యోజించిరి నాయకులు మహోద్విగ్నమతిన్.

కం. వలపన్నినట్లు జల్పము
లలవడుటయె కాక యెట్టియర్థమునైనం
గలిగింపఁగలిగె నిర్విను
వెలయించినయూహా జాతివిద్రోహంబై.

ఆ. కొంపమునిగినట్లు కొందఱు నాయకుల్
తొందరించి ఢిల్లియంద సభను
జరుప నిశ్చయించి సరవి నాహ్వానమ్ము
లంపి రెల్ల దెసల నాయకులకు.

వ. ఆసదమున నాతండ్రిమోతిలాలు, గాంధి, శాసనసభాధ్యక్షుఁడగు విఠలుభాయిపటేలుగార్లును, తేజబహదరుసప్రూ మొదలగు మిత వాదనాయకులు నుండిరి. రాజప్రతినిధి ప్రకటనములఁ గొన్నింటి కనుమోదింతుము. మా యీవాంఛల మున్ముందు నెఱవేర్పుఁడని కోరిరి.

సీ. జరుగనున్నట్టి చర్చలను స్వాతంత్ర్యమ్ము
ప్రకటింపఁగావలె భరతభువికి
సభలఁ గాంగ్రెసువారిసంఖ్య మిక్కుటముగా
నుంపఁగావలె నడ్డగింపులేక
భరతోర్వి స్వాతంత్ర్యపథ విధానమ్మును
చాటింపఁగావలె నేఁటినుండి
దేశసేవలకు బందిగబడ్డవారల
వదలఁగావలె నిర్వివాదముగను
నిర్ణయములివ్వి వీని సంపూర్ణముగను
మార్పు లేమాత్రములులేక తీర్పవలయు
సత్యమును ధర్మమును నహింసయును నమ్మి
వ్యవహరించెద మిది నిశ్చితార్థమనుచు.

చం. అతిమితవాద పక్షములయందలి వారలు తీరుమానపుం
బ్రతినొకదాని హూణజనపాలుర కంపిరి దీనిదీర్ప స
మ్మతమది మీకుఁ గానియెడ మాసహకారము గూర్పఁజాలమీ
స్థితి గుఱుతింపుఁడీ యను విశేషములన్ విలిఖించి రాదటన్.

కం. మేమెల్ల బందిఁగుంచం
గామితములు దీర్చుకొంటకై మితవాదుల్
ప్రేమించిరి హూణులఁ ద
త్సామర్థ్యము లెన్ని రాత్మసామర్థ్యములన్.

కం. సహకారతత్త్వవేత్తలు
తహతహపడి రాజ్యకార్యధౌరంధరులై
విహితులయి మెలఁగి మాకా
గ్రహముం గలిగించి రెల్లకార్యములందున్.

ఉ. చీలిక లుప్పతిల్లనవి చెట్టలుగూర్చు నటంచుఁ దాలిమిన్
మాలిమిగల్లు తెన్నుల సుమాళములందినయట్టు లుంటి మా
పోలికలందు నేసరసముం గనఁబోము దురర్థకమ్ములన్
గాలముపుచ్చువారు కనఁగా వినఁగా మదిఁగోర రెంతయున్.

మందార దామము. వీరమ్ముతో వీరి భేదింపకున్నన్
క్రూరాత్ములా వారి రోధింపకున్నన్
వైరమ్ము నే మేము వాంఛించియున్నన్
భారమ్మయా దాస్యబంధమ్ము ద్రెంపన్.

ఆ. ఇష్టగోష్ఠివార లెల్ల రొక్కటఁ గూడి
తీరుమాన మొకటి తీర్చిదిద్ది
రందు సంతకముల నందఱఁ జేయింప
నంపి రేము సమ్మతింప లేదు.

కం. సాహంకారుల మైత్రీ
బాహుళ్యమువలన నెట్టిఫలమగునని తా
నాహుతులఁ బ్రజ్వరిల్లెడు
స్వాహాకాముకునివలె సుభాసు వెలింగెన్.

కం. స్వాతంత్ర్యవాంఛ, యుక్తుల
చేతన్ సిద్ధింపదిది వశీకృతచేతః
ప్రీతులకు నందరానిది
పూతాత్ముల రక్తదానమున లభియించున్.

మంజరీ ద్విపద.
గాంధీమహాత్ము నేఁ గాదనలేక
చేవ్రాలు నిడితి వ్రాసినపత్రమందు
నాతోడివార లానాఁ డెదిరించి
నిలువఁ గల్గిరి గుండెనిబ్బర మ్మొబ్బ
అతివాద మితవాదులను పక్షములుగఁ
గాంగ్రెస్సు రెండువర్గములుగా నుండెఁ
గార్మికసంఘసంఘటితులౌ వారు
మూఁడవప్రక్క కమ్యూనిష్టులైరి.
ధనవంతులెల్ల బిఱ్ఱున బిఱ్ఱబిగిసి
కూలీలనెల్ల గగ్గోలు గావించి
డబ్బుతో దెబ్బతోడన్ లొంగఁగొట్టి
పదవులపైనాస పైఁడిపైనాస
గలిపించి పొరపులు గలిపించి రంతఁ
బనివారిబ్రదుకు దుర్భరమయ్యె మిపుల
దేశదేశాల నార్థికమాంద్య మెచ్చె
కొనుగోలుశక్తి నెక్కుడుగ క్షీణించె
పగలెల్ల డొక్కలూడ్పఁగఁ బొట్టతిండి
లేని దుస్థితియుఁ గూలీలలో నుండె
కువలయమ్మెల్ల నొక్కుమ్మడిగాఁగ
దైన్యాతిదైన్యమై తద్ద వాపోయె
రైల్వేలకార్మికవ్రాతమ్ము లెల్లఁ
దమవైపునుండఁ గొంతకు లాభమయ్యె.

# స్వాతంత్ర్యము

కం. నాలోఁజనించు నూహలు
ప్రాలేయాచలము నవలిభాగమ్ములపై
వ్యాలోలములగు వానిన్
శీలింపఁగ జతనమెంతో చేయుచునుందున్.

కం. ఊహాజనితములగు సం
దేహము లుదయించు నడఁగుఁ దీండ్రించును న
ప్పోహణ లెడనెడ లాహో
ర్బాహిర మొనరింప రాచబాట యగుంగా.

ఉ. భారతభూమి నల్గడలఁ బర్విన సర్వజనమ్ము లొక్కటై
చేరినయట్లు దాస్యము నశింపఁగఁ జేయఁగ ముక్తకంఠమై
కోరికఁ దెల్పినట్లు తమకుంగల భక్తిని జూపినట్లు లా
హోరుపురమ్మునన్ జరిగియున్న సదమ్మొఱేఁగించు నిన్నియున్

కం. మఱపునకు రాని సత్కృతి
నెఱపిరి నాకొఱకుఁగాక నెఱిసిద్ధాంత
స్థిరతకొఱకైనఁగానీ
గుఱుతుగ నొకఁడుంట మేలిగుణ మగును గదా!

కం. ముడివడు వ్యవహారమ్ముల
విడఁదీయఁగ రాక బిఱ్ఱబిగిసెను వానిన్
సడలింప సభాసదు ల
య్యెడనిల్చిరి మోదమాన హృదయమ్ములతో.

కం. వాదప్రతివాదమ్ముల
తోఁ దద్దయు నలఁగికలఁగి దురదృష్టమునం
బాదులు దొలఁగినజాతికిఁ
బేదఱికమెయకాక వేఱుపెంపుం గలదే.

ఉ. మాఱుపులిట్టివంచు మతిమద్వరు లేరు భవిష్యదర్థముం
గూరిచి చెప్పఁజాల రిదిగూడని కర్దమమైన ముందు దు
ర్వారవిపత్పరంపరలు పైఁబడి రాఁగల వందుకై మన
స్సారముతోడుగా సమరసంబున నిల్వఁదలంచి రెల్లరున్.

కం. గృహసౌఖ్యములకు వేడ్కల
కహరహముం బ్రాఁకులాడు టది లెస్సే దు
స్సహదాస్యసహనభావము
బహుమానమె దీన మేలువడయుం గలమే.

కం. శారీరకమానసికా
ధారములగు బాధలెన్ని దవిలిన వానిన్
ధీరతతో నెదిరింపఁగ
నోరిమితో నిలఁగనుంటి ముత్సాహములన్.

కం. స్వాతంత్ర్యోద్యమ మిట్టిది
ప్రాఁతచరిత్రలను ద్రవ్వి ప్రాణాహుతులం
బ్రీతిగఁ జేయుఁడు శౌర్య
స్ఫీతులరై శాంతిసమరపృథుశక్తులరై.

కం. అను తీర్మానమ్మును నూ
తనవత్సర మేగుదెంచు తరుణమ్మునకున్
వినిచిరి సాహోనాదము
లొనరించిరి మన్నుమిన్ను లోకమై పొరలన్.

వ. 1929సం. డిసెంబరు 31వ తేది రాతిరి పండ్రెండవగంట మ్రోఁగు
చుండ జయశబ్దపూర్వకముగ సీతీర్మాన మామోదింపఁబడెను.

మ. అవమానాసహమైన వీర్యమున శౌర్యజ్యోతి వెల్గించి రే
యవనీనాధులు శాంతిమంత్రముల దివ్యజ్యోతి వెల్గించి రే
భువనాధీశ్వరు లట్టివారలకుఁ బెంపుంగూర్తు మేకాని గా
రవమర్యాదల వీటిఁబుచ్చుకొని నిల్వం గొల్వఁ గాంక్షింతుమే.

చం. తనిపెడువాఁడు పూజ్యుఁడు నుతస్థిరశక్తియుతుండు మానియై
మనియెడువాఁడు సర్వజనమాన్యుఁడు సత్యవచఃప్రధానుఁ డి
ప్పనినొనరించుఁగాని యొకపాటిమనుష్యున కెట్లుదీర్పఁగా
ననువుపడున్ మహాత్ముఁడె సమర్థుఁడు పూనఁగఁ గార్యభారమున్

కం. కదలిన రధచక్రము లా
పదలకు గుఱికాక మిట్టుపల్లమ్ములకోఁ
గుదుపుఁ గొనఁబోక నడుపఁగ
సదమలుఁడౌ గాంధి విజయసారధి యయ్యెన్.

ఉ. పాశవికప్రవృత్తిగల వా రెగఁబడ్డను సడ్డసేయ కా
వేశ మొకింతలేక తమబృందము బిమ్మిటిపోవకుండఁగా
దేశమునాడి గుర్తెఱుఁగు ధీరు లుదారులుగూడి సంతత
క్లేశములెల్ల నోర్చిరి భళీభళియంచు నుతింప నెల్లరున్.

ఆ. సమయ మరుగుదెంచె శాసనసభలలో
నిలువఁ దగదటంచు నిశ్చయించె
మోతిలాలు వాని మొనకానితనమునఁ
దొలఁగి రెల్ల రుల్లములు సెమర్ప.

కం. జనవరి యిరువదియాఱవ
దినమున స్వాతంత్ర్యసమరదీక్షను గొనఁగా
జన మాసేతుహిమాచల
ముననుండియుఁ గదలె మోదముం గడలుకొనన్.

ఉ. అల్పపుబుద్ధు లిట్టిసమయమ్ముల నిమ్ములనిల్చువారి సం
కల్పము లిట్టివంచుఁ గనుగానక మానక మూలమూలలన్
జల్పములాడి రీమొనలుసాఁగిన తీఁగెల నుత్తరింపఁగా
సల్పిరి మంతనమ్ముల విశాంపతివర్గము లుల్లసిల్లఁగా.

కం. సమయమ్ము వేఁచి మాజీ
వములొడ్డి యఖండదీక్షఁబడసియు స్వాతం
త్ర్యమునందఁ గోరితిమి స
త్యము ధర్మ మహింసలను పథమ్ములు పొదలన్.

కం. జనవరి తొలివారమ్మున
మునుకొని నే నలహాబాదుపురమున నుంటిన్
జనులకవి కుంభమేలా
దినములు మాఘమునవచ్చి తెచ్చెం దృప్తిన్.

కం. పొలముల యంత్రాలయముల
నలఁకువగలవారు యాచనాపరులు బెహా
రులు చేతిపనులవారలు
వెలలిరి గంగాప్రయాగవీక్షారతులై.

ఉ. గుంపులుగుంపులై జనులుగూడి నమోనమదేవదేవ ర
క్షింపఁగ రమ్మురమ్మనుచుఁ గేకలువైచుచు నాలుబిడ్డలున్
వెంపరలాడి వెన్వెనుక నే చనుదేర మహోత్సవమ్ము గాం
క్షింపఁగ వచ్చువారి వివశీకృతచిత్తులఁ జూడవేడుకో.

కం. గంగాజలములలోన ము
నింగిన నిర్వాణమనెడి నిర్ణయములతో
డం గదలివచ్చు నమ్మక
ముంగన నాయెడఁద ఖేదమోదము లొదవున్.

కం. తరతరముల విశ్వాసము
నరనరముల బిఱ్ఱబిగిసినం బెకలింపన్
దరమా పౌరపులువెట్టెడి
గురువులు నిక్కవము దెలుపఁ గొంకుదు రెవలన్.

ఉ. ఈమతసంప్రదాయములకే బలియైన మనమ్ములందు నిం
కేమి చొరంగఁజాలవు మహీపతు లల్పముచేయుచున్న భూ
స్వాములు నోరునొక్కి తమసత్త్వ బొత్తిగలాగుచున్న నీ
శ్రామికవర్గమందుఁ గల స్తబ్ధతపోదు యుగాలుమాటినన్.

చం. పిడికెఁడు కూడులేని నిఱుపేదలు నిల్చిన పల్లెపట్టులన్
గుడులకు లోపముండదు కనుంగొన దేవర కన్నవస్త్రముల్
ముడుపులు పెండ్లిపేరఁటములుం గలిగింతురు సొంతమేళులఁ
దడవరు దైవకార్యము లొనర్చెడుపట్టుల నిట్టలమ్ముగన్.

సీ. అంధవిశ్వాసమ్ము లావరించుటఁగదా
కులమతభేదముల్ గూడుగట్టె
కులమతభేదముల్ గూడుగట్టుటఁగదా
పరభూమిపతులు సంప్రాప్తమైరి
పరభూమిపతులు సంప్రాప్తమాటనుగదా
వెలవేని రత్నరాసులు నశించె
వెలలేని రత్నరాసులు నశించుటఁగదా
దారిద్ర్యదేవత తాండవించె

గతచరిత్రలలోని సంగతి నెఱింగి
పారమార్థికచింతనాధరము నడచి
సత్యమును ధర్మమును నహింసయును దలచి
యిట్టిచెట్టల సైరింతురేల జనులు.

కం. ఈ యుత్సాహమె స్వాతం
త్ర్యాయుధమై నిలుచునెడల నాంగ్లేయులె కా
దేమోజ నెవ్వరొడ్డిన
మాయింపఁగఁ దగును నవభిమానము పేర్మిన్.

ఉ. నిండుమనమ్ముతో నిలువనేర్చిన యీమతవాదు లింద ఉ
ద్దండత దాస్యముక్తికి యథామతి పూనికనిచ్చి నిల్వ బ్ర
హ్మాండము లొంగదా! పరులప్రాణము మానముఁ బాచికొన్న దు
శ్చండిమ మంతరింపదె ప్రశస్తతర మ్మగుఁగాదె దేశమున్.

శా. భారద్వాజమహర్షి నిర్మితమహాప్రాచీన విద్యాలయ
శ్రీరమ్యమ్మగు చోట మాగృహము నిల్చెన్ దానఁ దీర్థార్థులౌ
వారల్ గారవమార మమ్ములను సంభావింప వీక్షింపఁగా
బారుల్ తీర్తురు నేత్రపర్వముగ నాప్రాహ్ణమ్ము నాసాయమున్.

మ. బలవద్వైరులు హూణపాలకులు సంబాధంబు బాధింపఁగా
నిలువంగల్గిన తాతపాదులను నన్వీక్షింప భాషింప ని
స్తులసంతోషము వెల్లడింతు రదియేదో శక్తి మాకున్న య
ట్టులు భావింతురు, లేనిగాథలును బుట్టుం బుట్టలై తెట్టలై.

చం. గతమును విస్మరింపక చికాకు వహింపక వర్తమానసం
గతులఁ దలంచి భావి జరుగంగల కార్యము లాలకింప సం
తతము ముదమ్మునందు సరదారులు ధీరులు రాజకీయవి
జ్ఞతగలవారు ప్రశ్నము లనంతముగాఁ గురియించి రెంతయున్.

ఉ. వేనకువేలుగా జనులు వెల్లువయై జయశబ్దపూర్వక
ధ్వానము లాచరింతు రొకపారి మముం గనుఁడందు రంతలో
మానముఁదాల్చి నమ్రత నమస్సుల నిత్తురు గానుపింప, మా
స్థానము వీరభూమిగ నెదం దలపోయుదు రేమిసెప్పుదున్.

చం. తలుపుల సంధిబంధముల ద్వారతలమ్ముల జాలపంక్తులన్
మలఁచిన దృష్టిజాలముల మమ్ములఁ గన్నులజుట్టుకొంటకై
నిలిచియుఁ దొందరించుకరణిం గనుపట్టెను వారిభక్తికిన్
ఫలమగురీతి నేమి యులుపానిడి తీర్చెద నప్పుభారమున్.

చం. సహచరభావభావుకులు సానునయమ్ములు దప్ప వేఱు స
స్పృహులయి ధర్మమార్గములు వీడరు గర్భదరిద్రతాప్తికిన్
సహనముచూపుచుండు రపచార మొనర్చిన వారికిన్ మహా
మహులయి కీడుచేయక సమాదరణమ్మునఁ జూతు రెంతయున్.

ఉ. చుట్టముచూపుగా నొకతె చూడఁగవచ్చెను నాఁడు నన్ను నీ
ఘుట్టము చూచిచూచి తమకమ్మున నంగని వీరపూజకుం
బట్టముగట్టుకోఁగలుగు భాగ్యముచేకుఱె నంచుఁబల్కె ని
ప్పట్టులు దేశభక్తుల కపారముదంబులు నోలలార్చెడున్.

చం. భువనజనావనమ్మునకు మూపలయై నిజభోగభాగ్యముల్
దివులక మేనిసౌఖ్యము దలంపక సర్వసమత్వకాంక్షులౌ
యువయువతీగణమ్ములు మహోద్ధతి నవ్వొక బాలవీరుఁగా
నవునని గద్యపద్యములనల్లిరి కావ్యకళావిశారదుల్.

చం. చలన మొకింత లేని ఋషిసత్తమునైనఁ గలంత వెట్టఁగాఁ
గలిగినయట్టి యీపొగడికల్ ననుగర్వితుఁజేసె నమ్మొక
మ్మలవడె నెంటనంటుజనమా గలదంచు విశేషశక్తి నా
తలఁపున సోఁకె దేహమున దార్ఢ్యము దార్కొనె నొక్కపెట్టునన్.

చం. సురుచిరమైన కీర్తి పొడసూపిననాఁడు నియంతమై దిగం
తరములఁ బ్రాఁకుచుండును యథామతి సంచరణంబొనర్పఁగం
బరువులు వాఱుచుండును స్వభావము, నేనటులైతినే మొ నా
యెఱుకకురాదు మిత్రతతి కించుకయించుక గుర్తురావలెన్.

చం. ఇదియని జీవితానుభవమే గుఱుతింపఁగలేనివాని కె
య్యదనునఁ గీర్తియూడిపడెనా! యవినీతికిఁ దోఁపునీడయై
పదుగురువెక్కసంపడ సభార్థులలం జరియించు మూర్ఖతం
బొదలును వెంటరానిజనముం గడకొత్తును దుర్విదగ్ధుఁడై

ఉ. భారతదేశముక్తికి యువప్రకరమ్ములు వేనవేలుగాఁ
గారలలోనఁ జిక్కి యురికంబము లెక్కి రహింస నాత్మలం
జేరిచి రామహామహుల జీవసమాధులపై స్వరాజ్యముం
గూరిచినార మీయశముకుం గుఱి వారలుకారె యారయన్.

చం. వినయము కార్యదక్షత వివేకము గల్గిన వారలెందఱో
మనకయి సర్వశక్తుల సమర్పణచేసిరి వారినామముల్
మననమొనర్చి నెమ్మనములం బరిశుద్ధము చేసికొందమీ
వినికిడికేమి సర్వజనవిశ్రుతికేమి సుఖమ్ము గల్గెడిన్.

ఉ. లోఁకులు కాకులై నుడులలో వినయమ్ము వెలార్తు రీజుగు
ప్సాకరమైన భక్తిని నసత్యము తాండవమాడు దీనికిం
బ్రాఁకగుదుష్టచేష్ట యివిపాదులువాఱిన సత్యమెక్కడో
కూఁకటివేఱుతోడ నడఁగున్ బరమాద్భుతగాధలేర్పడున్.

ఉ. లొంగక కార్యనిర్ణయములుం గడతేర్చు మహానుభావులే
సంగడికాండ్రు నాకగుట సత్యము ధైర్యముగల్గియుందు ను
ప్పొంగుచుఁ గష్టనష్టములు పుట్టినవేళ నిరర్థకప్రలా
ఫుం గనుచోఁ జిరాకు మనముం గలిగింపఁగ నుందుఁ దొందరన్.

చం. నిజమునకన్న భిన్నమగు నేరుపుఁ జూపి యభూతగాథలన్
సృజనమొనర్చి వింతలు విశేషములం గడుఁగూర్చి పామర
ప్రజలకు వింతు రూఁకొనెడిపట్ల వినోదమెకాని వానిలో
నిజమును లేని హేతువున నిల్వవుసూ నగుఁబాటుమాటలై.

కం. ప్యారిసునగరమ్మునఁ బ్రతి
వారము మూడుస్త్రు లుదుకఁబడు నని వింతల్
గూరిచి రీవిడ్డూరము
లూరూరను నోరనోర నుబికె నయారే.

ఉ. కన్నులు నెత్తికెక్కిన జగా సిరిమంతుఁడె యైన దుస్తులం
దిన్నఁగ నీళ్ళగుంజఁ బరదేశము లంపునె యింతకన్న నే
మున్నది దుర్వ్యయమ్ము మది నూహ మొనర్పుఁడు మూర్ఖపద్ధతిం
బన్నినమేము దేశమును బాగొనరింపఁ గలామె చెప్పుఁడా!

కం. పదుమూఁడేఁడులు సీమలఁ
జదివితి యువరాజు వేల్సునరసన యని స
మ్మదమింతగాని గాథలు
పొదలెను గలరూపు లేశముం గన మిందున్.

కం. కలిమికి వెలియయి త్యాగ
మ్ములు చేసి సమస్తభోగములు వీడిన వా
రల నెల్ల రామతింతురు
తొలిమలి సంజలను జేయుదురు సన్నుతులన్.

సీ. పనిగల్ల నోరు విప్పక మెలంగెడువాని
సద్గుణమ్ముల నెమ్మి సంస్తుతింప
ఆధ్యాత్మికానంద మందితి ననువాని
యాత్మోన్నతుల సుంత యాదరింప

ఆడంబరమె జీవితాశయం బనువాని
సిరిసంపదలను జేజేలు నింప
శ్రమజీవితమును ముఖ్యముగఁ జూడనివాని
కార్యదీక్షల నింత గౌరవింప
కర్జముల నెఱింగి కష్టసహిష్ణుత
పట్టుదలయుఁ గలుగుప్రాజ్ఞవరుల
పాదపద్మములను బ్రణుతింతు హర్షింతు
మదిఁ దలంతు మేలిమార్గములను.

కం. జనుల మనోభావమ్ములఁ
గనుగొందును వానిఁ దీర్పఁ గాంక్షింతును నా
తనుధనమనమ్ము లర్పణ
మును జేయుదు బుద్ధిపూర్వముగఁ దృప్తుఁడనై.

తే. నరనరమ్ములలోని నెత్తురులు సెదరి
దుఃఖభాగుల కన్నీళ్లతోఁ బెనంగి
యాటుపోటులతో గుండె లవియఁ జేయు
వేదనాభారమునఁ గ్రుంగిపోదు నెపుడు.

ఉ. స్థానికసంస్థలెల్ల బహుధా నతిపత్రపురస్సరమ్ముగా
మానసము ల్చిగుర్ప బహుమానము లుత్సవముల్ నితాంతస
మ్మానము లాచరించె నది మామకమానసవీధి బింకముం
బూనిచె, సత్యశోధనకు మూలములౌ నిటువంటిఘట్టముల్.

చం. గరువము కొవ్వుగాఁ బొరలుకప్పి నియంత నొనర్చు నెప్పుడుం
బిరుసుఁదనమ్ము గూర్చుఁ దనపెంపువినా జగమెల్ల లొల్లెగా
నరయఁగఁ జేయు జీవితమునందున ఘర్షణ లుప్పతిల్లుచోఁ
దఱుఁగు నొకింత లేనియెడఁ దల్పులు పల్పులు చాల వెంతయున్

మంజరీ ద్విపద.

ఆంతరంగిక భావహోవమ్ము లెల్ల
నతిప్రయత్నమునఁ ద్రొక్కితి మానసమున
బహిరంగసభల నప్పటికప్పటికిని
జాజువాఱినకనుల్ సౌమనస్యముగఁ
గలుషితమ్మైన దృష్టులు నిర్మలముగ
నుంప యత్నింతు నాయోపిన యంత
నను గుఱించి యొకింత గనలూని యూని
వ్రాసె హిందూమాస పత్రిక యొండు
మిపుల దీనత వితంతువుపోలె నుండు
జహ్వారుండని యదిసత్యమ్ము గాదు
నాడెందమునయందు నైరాశ్య మెపుడు
కాలూని కదనుద్రొక్కఁగ నిక్కఁగలదె
చిఱునవ్వు చిలుకు హాస్యరసమ్ము గులుకు
జీవితమ్మే ముద్దుసేయు నాకెపుడు
భారతభూషణ భారతరత్న
త్యాగమూర్తి యటంచు నామతించెదరు
లలితమ్ముగాను వేళాకోళముగను
బంధువుల్ మిత్రులు పరిసరప్రజలు
వివిధశక్తుల వింతవింత చేష్టలకు
రంగస్థల మ్మంతరంగమ్ము నయ్యె
వెలు పలితోడివారలతోడి పోరు
మలఁచుఁబో యంతరాత్మనుగల్గు శ్రమము
బందిఁగుందుచు భూతభావజాలముల
మథియించి విరచించి వ్యథ మాన్పుకొందు.

# ఉల్లంఘనము

ఆ. మెఱుఁగుఁదీఁగె బాగు మిఱుమిట్లు గొల్పుచు
దేశమునకు నూత్న తేజ మిడుచు
జనులమనము లుబ్బ స్వచ్ఛందమాదిన
మలవరించె దెసలఁ దెలివి నించె.

ఆ. శాంతియుతము గాఁగ స్వాతంత్ర్యసమరమ్ము
సలుప నిర్ణయములు సభలు జరిగె
మోదమునను మృత్యుముఖమునఁ జొరఁబాఱి
నుల్లసిల్లి రెల్ల రుల్లములను.

కం. భావప్రకోపమునకుం
దావలమౌ జనము శౌర్యధైర్యమ్ములతో
నావేశమందె జనముం
జీవమునుం గలుగ సర్వసిద్ధులు గలిగెన్.

కం. గ్రామగ్రామమ్మునఁ గల
సామాన్యమ్మైనజనము సత్యాగ్రహసం
గ్రామమున నిలువఁ గలిగెను
భూమీశుల హృదయకుహరములు ప్రిదులంగన్.

ఆ. ప్రజలనాడి గుర్తుపట్టు మహాత్ముండు
శాంతిసమరమునకు సమయ మనుచుఁ
గాలమానములను గాలించి మేలెంచి
యుద్యమమును నడుప నుత్సహించె

కం. నడితరపు గుణము గలిగిన
దుడుకఁడు కడుపెనఁగులాడ దోర్బల మెల్లం
బొడ వడఁగి పోదె విజ్ఞుఁడు
గడఁగిన కర్జములు నిలువఁ గలవా పుడమిన్.

ఉ. దీనదయాళుదర్శనులు దివ్యమనోరథు లర్థనీయమున్
మానసమందు నూహము నొనర్ప విఘాతము లుప్పతిల్లునే
జ్ఞానమయూఖముల్ దెసలఁ గ్రమ్మిననాఁడు విపత్పరంపరా
స్థానము లాఱవే దయయు ధర్మము సత్య మహింస నిల్వ దే.

తే. ఉల్లమున నమ్మకమ్ము సంధిల్లెనేని
యెల్ల రాత్మారణమ్మున నుల్లసిలరె
జనులలో నైకమత్యమ్ము పొనుగువడిన
దనఁ, బ్రజానాయకుల దోసమని వచింతు.

సీ. ధనమనఃప్రాణమ్ములను నప్పన మొనర్ప
సజ్జీకృతుండాయె సాహుకారు
గొడ్డుగోదల నాలుబిడ్డల విడనాడి
గడకట్టె నిల్చెఁబో కమ్మతఁడు
కొడవలి లిక్కి దోఁకుడుఁబాఱఁ దెగనమ్మి
మాఱొడ్డి నిలిచెఁ గర్మణ్యభుజుఁడు
ప్రాక్తనాచారసంబంధబంధనముల
నలిచేసి నిలిచెను నైష్ఠికుండు
పతితజాతికి మానవత్వమ్ము పెఱిగి
జబ్బచఱిచెను జాతిమాత్సర్య ముడుప
శాంతిసమరమ్ము నడుప దుస్సాధజనులు
గుములుకట్టెరి కోలాహలము లొనర్చి.

చం. తరుణము వేచివేచి యవధానమతిం దగు శాంతిదాంతులం
దొరలువిధించు శాసనమునన్ మితిమీఱు మహోద్యమంబునుం
బరపఁగఁజూచె గాంధి యదిబాగని నాయకు లుత్సహించి రి
ప్పరుసున హేతు వేరుపఱుపన్ సమకట్టిరి దేశసేవకుల్.

వ. అది 1930 జనవరి 26-వ తేదినాఁడు స్వాతంత్ర్య దినమవుటచే నొక ప్రత్యేక కార్యక్రమమును దీసికొన నెల్లరు సముత్సహించిరి. నిత్యజీవితావసరమగు నుప్పుపన్నును నిరాకరించి స్వయముగఁ దమకుఁదామే యుప్పును దయారొనరించుకొన నిశ్చయించుకొనిరి.

ఆ. గంజిద్రావి బ్రదుకుఁ గడపువానికి సైత
ముప్పుఁగల్లు ముఖ్య మూర్వియందు
జనులలోన దీనిఁ జాటింపఁ గవ్వింప
వచ్చు సాధనముగిఁ బట్టవచ్చు.

ఉ. ఐనను బూర్వకాలిక మహద్విపదంబుధి నీఁదియుంట మా
మానసముల్ రవంత యనుమానము లందెను మున్నెవండొ దు
ర్మానము తోడ శాంతి కిసుమంత విఘాతము నాచరింప మే
మూనిన భారమంతయు మహోద్యమమంతయు వ్యర్థమై చనెన్.

ఉ. దేశము దేశమెల్ల నొక తీవ్రపరిస్థితి నద్దగించు చోఁ
బాశవికప్రవృత్తి లోకపట్టున జీవుల మట్టుపెట్టుచోఁ
బేశలవాక్సుధారసపుఁ బెంపులు ముంపులు వెట్ట వచ్చు డా
వేశము రాకతప్పదు దవిష్ఠులు శిష్టులుగారు ధారణిన్.

కం. చోరీచోరాలో నొక
దౌరాత్మ్యము సాఁగ నాఁపఁదగునా యంత
స్సారమ్ము డింపఁదగునా
మాఱుప సత్యాగ్రహోద్యమ మ్మల్పమ్మా!

ఉ. నాఁటికినేఁటి కిట్టిఘటనమ్ములు గూరినవేళల న్నిరా
ఘాటముగా నదే కనులఁగట్టుచునుండు మహాత్ముఁ డింతబా
హాటముగా నెదుర్పఁగఁ బ్రయత్నమొనర్చినవాఁడు గాన నే
లోటును రాదటంచు మదిలో నొకనిశ్చయముం బొనర్చితిన్.

కం. ఈ సందేహము తోడ స
భాసదులెల్లరును గలఁతవాటిరి వారిన్
వేసారక ముదలించియు
నాసత్యవచోభిరత మహాత్ముఁ డదల్చెన్.

కం. కాతరభావులు హింసో
పేతులు స్వాతంత్ర్యసమరవీధిని నిలువన్
నీతి దొలంగును జనులన్
భీతి మెలంగును విపక్షవృద్ధి చెలంగున్.

కం. ఇఁగ నుప్పుపన్ను చెల్లిం
పఁగరాదు తదాజ్ఞ మనల బాధించినచో
మొగమోడరాదు శాంతిం
దిగఁద్రావఁగరా దటంచుఁ దీర్మానించెన్.

కం. నిఘ్నులరు గాక మీరలు
విఘ్నము లేతేర మదిని వెఱవక కార్యో
పఘ్నతఁ జూపింపుఁడు ని
ర్విఘ్నమ్ముగ జయము మిము వరించున్ మించున్.

కం. ములు మోప వీలుగానిది
తెలవారల శాసనమ్ము దీనను వంపం
గలమా యని మీ మదులం
దలఁపకుఁడీ గెలుపు గాంచు ధర్మమె జగతిన్.

కం. ఎక్కడి దీసత్యాగ్రహ
మెక్కడి దీయుప్పుకప్ప మీరెంటికిఁ బా
త్రైక్కడి దని యూహింపకుఁ
డిక్కార్యము మనకుఁ దప్ప కిచ్చును జయమున్.

కం. అని గాంధి దెలుప మామా
మనముల సందేహ మెదవె మారణహోమా
మ్మున దూఁక నుత్సహించిరి
జను లెల్లరు శాంతిసమరసంరంభకులై.

ఉ. హేళనగాక యేమిది మహేశ్వరుశాసన ముప్పుఁగంటికిం
జాలక పోయెనే పరులు శాస్త్రవిదుల్ విని నవ్విపోవరే
పాలకు లుప్పచప్పనిరపమ్ముల నుండురే రుషావిష
జ్వాలలు గ్రక్కకుందురె విషాదముతోఁ దలవంచుకొందురే.

చ. అదిగదిగో జనమ్ము ప్రళయమ్ముగఁ గ్రమ్మి దిశావకాశముల్
పొదివెను బాలబాలికలు పూరుషు లంగన లధ్వనీనులై
కదలిరి యుప్పుచట్టములు కంపిలి పొంపిరిదక్కి స్రుక్కుచున్
వదలెను దేజముల్ దలలు వంచె భటావళి యుక్కు దక్కుచున్.

చం. పదుగురు వెంటనంటఁగ సబర్మతినుండి మహాత్ముఁ డంతటన్
గదలెను దేశదాస్యదళనమ్మున కాయువు ధారవోయఁగాఁ
గొదుకక శాంతిసైన్యములు కోయని యార్పులు నింగి ముట్టఁగా
ముదమున వచ్చి నిల్చె సిడముల్ ధరియించిన కేలుదోయితో.

కం. వెనువెంట నహమదాబా
దున సభలను నిశ్చయమ్ముతోఁ దత్సభ్యుల్
చనుదెంచి రట్టిపట్టులు
తను పొనఁగూర్చెను మదాత్మదార్ఢ్యము పెటిగెన్.

కం. మునుముందు బందిఁ బడియెడి
జననాయకుఁ డొకని నిల్పఁజనును సభాధ్య
క్షుని వారు లాఁతివారల
మునుకొని యధ్యక్షపీఠమున నుంపఁ దగున్.

శా. అత్యుత్సాహము ధర్మదీక్షకును దోడై నిల్వ వీరాగ్రణుల్
మత్యగ్రేసరు లాసభాసదులు దీర్మానమ్ముగావించి రీ
నుత్యమ్మౌ మహాముం గనుంగొనఁగ వెన్నుందన్ని సర్వప్రజల్
సత్యాహింసలు నెమ్మనమ్ములను నిల్వ న్నిల్చి రప్పట్టునన్.

శా. స్వాతంత్ర్య మ్మొదఁగోరు నాయకులు తుచ్ఛస్వేచ్ఛ భర్జింపుచున్
జేతఃప్రీతిగ గాంధి దివ్యసరణిం జేపట్టి రాత్మార్పణ
ఖ్యాతిం గట్టిరి వీరకంకణములం గామ్యార్థసంసిద్ధికై
వీతత్రాసులు నైరి శాంతిసమరోర్వి న్నిల్చి రుత్కంఠులై.

శా. మాతృద్రోహులు స్వార్థబుద్ధు లగుసంపన్నుల్ మహోద్రేకులై
శ్వేతాధీశుల కండగా నిలిచి రా స్వైరమ్ముతో మాపయిం
బ్రీతిం జూపెడు వారి నెల్లయెడలం బీడించి రాకృత్యముల్
చేతోవీధిని దాండవించు నిపు డిస్సీ గుప్తి కేతెంచినన్.

కం. జనవరి మొదలిడి యేప్రియ
లును జొరుసమయమ్ము మధ్యలోఁ గడపి జనుల్
వెనువెంటనంట బోధల
వినిచెను జనపదములకు వివేకము గల్గన్.

ఉ. చీమలబారువోలె నిరుచక్కియలందును వెంటనంటె ని ,
ష్కాములు శాంతిదూతలు ప్రసన్నమనస్కులు రా మహాత్ముఁడున్
సేమముతో సముద్రతటసీమకు మిత్రులతోడఁ జేరి యా
భూమిని నుప్పుసేయఁ దలపోసెను వీసరవోని ధీరతన్.

కం. ఉన్నట్టు లుండి నేలకుఁ
గన్నముపడి నీటిపొరలు గమించిన రేవన్
బున్నమ వెన్నెల కలిమున
మున్నీ రెగఁబొడుచుభంగిఁ బొంగెం జగముల్.

చం. చెలియలికట్ట కట్టిడి నశింపఁగఁ జేతులు చాఁచి దిక్కులం
బలిమిని బట్టు సాగరవిభాతి జనచ్ఛట శాసనమ్ములన్
గొలుసులఁ ద్రెంపివైచి తము కోరిన కీర్తి స్వతంత్రతా ప్తికిన్
నిలిచెను దేశనాయకుని నిశ్చలతత్త్వసహాయ సంపదన్.

ఉ. ఉప్పును వండఁగాఁగలుగు నూహము లశ్రుతపూర్వకంబు లా
యొప్పులు మా కలభ్యము లహో నిలువారము కార్యదీక్ష క
న్గప్పిన వింతవింత పదకమ్ముల సిద్ధ మొనర్చుకొంటి మిం
కప్పటి కందివట్టి కృతులన్ని పఠించితి మాప్తపెంపునన్.

మ. కరపత్రంబులలోఁ దదర్థములు వక్కాణింప మాబోంట్ల కె
ల్లర కాకార్య మొనర్పఁగాఁ గలుగు నుల్లాసంబు రేకెత్తె శ్రీ
కరు లుప్పుం గొని యెక్కువెక్కువుగ రొక్కం బిచ్చి రీయుద్యమ
స్థిరసంకల్పము భారతప్రజను గాంధిం దన్పె వైశిష్ట్యమై.

తే. ప్రజల నుద్రేకపఱిచి సక్రమపథాన
ననుపఁగల శక్తి గాంధి కొక్కనికిఁ గలదు
కుంటువడియుండు నాత్మశక్తులను గదిపి
మీటఁ గలవాఁడు నతఁడె చుమ్మీ జగాన.

ఆ. పతితజాతికొఱకుఁ బ్రాణమ్ము లర్పించు
గాంధిపేరు మొదలుగా రచించి
యతఁడు వల దటన్న నాపైని నాతండ్రి
నామ మెఱుకపఱిచినాఁడ నాఁడు.

కం. ఏ నట్టివేళ బందికిఁ
బోనుంటినో తెలియదాయెఁ బోయినదో నా
స్థానమున వీరి నిలుపఁగఁ
బూనితి జాతీయ యోధపుంగవు లగుటన్.

వ. మధ్యపరగణాలలోనున్న రాయపూరు మహాసభ కేగుచుండ మధ్యేమార్గమున నిర్బంధింపఁబడితిని.

కం. గొట్టుతనమ్మున కిటులొడి
గట్టిరి ధిక్క్రియకు నెపముగా నుప్పుం జే
పట్టిరి వీరని ననుఁ జెఱఁ
బెట్టిరి యార్నెలలు శిక్ష వేసిరి కినుకన్.

కం. నాతరువాయి మహాత్ముఁడు
నేతృత్వము పూనఁ డతనినిర్ణయమున నే
నాతండ్రి కార్యదీక్షా
స్ఫీతుండై నిలిచె వినయశీలము లొప్పన్.

చం. గనగన మండు నెండలకుఁ గా లొకచోటను నిల్వ కెల్ల ప
త్తనములు పల్లెపట్టులు సదా తిరుగాడెఁ గుటుంబ మంతయున్
మునుకొని యుప్పుచట్టముల ముప్పునుగూర్చిన బోధ లిచ్చె నా
జనువున కింతకన్న నొకసత్ఫలమున్నె తలంచి చూచినన్.

కం. నాతల్లి స్వరూపయు నా
చేతఃప్రియ కమల నాదుచెల్లి విజయల
క్ష్మీతరుణి తక్కుచుట్టలు
నాతటి నాజతనమందు నందిరి తనుపున్.

కం. సరిహద్దురాష్ట్రములను
ద్ధరులు పరానులును శాంతితో మెలఁగిరి నా
గరికులగువారు దళవరు
లురమిచ్చి యెదుర్కొనంగ నోపరు గడిమిన్.

ఉ. ఆయుధధారి గాక వినయమ్ము నయమ్మును వీడలేక హిం
సాయుతమైన మార్గమును మన్ననసేయక యాత్మలో జగ
చ్ఛ్రేయము నాదరించి తనసేమ మెఱుంగక పైకి రాక తే
జోయుతుఁ డైనవానిఁ బరిశుద్ధుని సైనికుఁ డెట్లు గాల్చెడిన్.

చం. కలిగినవారు దేశమునకై నిలువెల్లను ధారవోయఁగాఁ
గలిగినవారు పూరుషుల కష్టమెఱింగినవారు ధీరలై
మెలఁగినవారు మెల్తుకలు మించినవేడుక నొక్కపెట్టగా
వెలలిరి యిండ్లనుండి పురవీథుల నుద్వృతిఁ జాటి చెప్పఁగన్.

సీ. శీతోష్ణములను మేల్సేయని సన్నని
యొల్లియ లుండు నంగళ్లనడుమ
మంచిచెడ్డలను మాయించి యాత్మద్రోహ
మొంద మత్తిడు నల్లమందుపాక
ఆలుబిడ్డలను నేవేళ గుర్తుకుఁ దేక
పాయఁజేయించు గంజాయిసాల
మేలుగీళ్లను సిగ్గుమాలించి వర్తింప
మంపుఁగూర్చెడు శీధుమందిరముల
నిలిచి తరుణీమణులు బోధసలుపఁ గడఁగి
రా మహాదృశ్యములఁ గాంచినంతఁ బ్రజలు
వీరరస ముగ్గుపెట్టిన ట్లైరి మివుల
సృష్టిసౌందర్యనిలయమ్ము స్త్రీ నిజమ్ము.

కం. మగవారికన్న మిన్నగ
మగువలు దగుపట్టుదలల మర్యాదల రూ
ఢిగ సుప్రశస్తి గాంతురు
సొగయరు నెచ్చెలులు దొరయు సుఖదుఃఖములన్.

సీ. సార్వభౌము లొనర్చు శాసనమ్ముల నెల్ల
దీకొని నిల్చె జాతీయవాది
జాతీయవాది హెచ్చరిక చెప్పుటికప్పు
డామోదమును జూపె నఖిలజనము
జనపాళి సమ్మదమ్మున మహాప్రయత్నమ్ము
లొనపరి రూపొందె నుద్యమమ్ము
ఉద్యమాకృతు లఖిలోర్విఁ బర్వ మహాప్ర
శాంతి గూర్చెను నహింసావ్రతమ్ము
ఆయహింసావ్రతమ్ము వైప్రాయి కనుల
కగ్నిహోత్రమ్ముగా నభివ్యక్త మాయె
మంగలములోని పేలాలమాడ్కి జనుల
వేఁచి ముంగోపమునఁ గాలరాఁచఁ దలఁచె.

కం. ముప్పొట్టువెట్టు చెట్టులు
ముప్పిరిగొన నోర్చియోర్చి మునుకక శాంతిం
గప్పిన నెమ్మనములతో
నొప్పిరి వజ్జీరులెల్ల రుత్సాహులై.

కం. జీవన్త్రాయకు లధిపతు
లీవిధి జీవములు నలుప నిచ్ఛించినచో
నేవార లడ్డగింతురు
కావఁగ నేశక్తి నిల్వఁగల దెమరెదురన్.

కం. అతివాదపక్షపత్రిక
లతిపరుషోక్తులను వ్రాసెనని యనుమంగా
మితవాదపక్షపత్రిక
లతివేలములయ్యె నృపసమాశ్రయములునై.

కం. ఉప్పుకొటారమ్ములపైఁ
గుప్పలు తెప్పలుగ జనులు గుమ్ములై దాడిం
గొప్పగ జరిపిరి గాంధిని
గుప్పిరి చెఱసాలఁ బాలకులు కసిదీఱన్.

కం. మాటల యనువులు చనవులు
నూటాడఁగఁ జేయఁ దనువు నొత్తును బులకల్
నూటికిఁ గోటికి నొకఁ డి
ప్పాటనఁ జరియించు గాంధివలె నిర్మలుఁడై.

వ. మహాత్ముఁడగు గాంధి 1930 మే మైదవ తేదిని నిర్బంధింపఁబడెను,

మ. జనకప్రాయు నరాతిబాంధవు నహింసామంత్రతంత్రజ్ఞు న
మ్మునిమూర్ధన్యు మహాత్ము దుర్విషయనిర్మోహుఁ జితక్రోధు గాం
ధిని గారాగృహమందుఁ గూర్ప జను లార్తిం గ్రుంగి సత్యాగ్రహ
ధ్వనినిర్ఘాతరుషావిషాదపరిణద్ధస్వాంతులై రెంతయున్.

మంజరీ
ద్విపద.

బొంబాయిలో జనమ్ములు పొంగిపొర్లి
విపణివీధుల మూఁత వేయించి మించి
జయ జీవయనెడి నిస్వానమ్ముగ్రమ్మ
మనమురియాట ముమ్మరము సంబరము
పెనఁగొనఁగా బ్రాణభీతియు లేక
నిలిచిరి శాంతిదాంతిని గోరి మొదలఁ

గుఱుమాపు నెఱసంజ మెఱయు నంతంత
నడిమింటి కెక్కి తిన్నఁగ సాఁగిసాఁగి
యవ్వాయిచువ్వలకై దూసికొనుచుఁ
దారకానీకముల్ తారాడునంత
దూడ లంబాయంచుఁ దోఁక లల్లార్చి
తల్లిపాలకు మెడత్రాళ్లు రాపాడి
కట్టుగొయ్యలచుట్టు మిట్టాడునంత
రక్షకభటులు సంరంభంబు మీఱ
నీలకూఁతలతోడ నెలిగించి పంచి
బడియలతో ముందు బాది యాపైని
మరతుపాకుల నిప్పు లురలంగఁ జేసి
పురరాజమును రుద్రభూమిగాఁ జెఱిచి
చేఁజిక్కువారి శిక్షించి రుద్ధురత
మాతండ్రి సయ్యదుమాముదు లట్టి
సత్యాగ్రహమ్మున షణ్మాసములును
శిక్షలనంది వచ్చిరి నైని చెఱకు.

# నైనిచెఱ

ఆ. స్వాస్థ్యమనుభవింప సమయమ్ము దొరకమి
ముమ్మరంపుఁ బనులు ముసిరియుంట
బడలియున్న నన్నుఁ బాలకుల్ బందిలో
నిడుటఁ గొంత మేలు వడసినాఁడ.

కం. బలు వేఁడి వాఁడి గాడ్పులు
పలపల వీతెంచి యుబ్బ ప్రబ్బిన కతనన్
గళవళపడి యధికారులు
వెలినుంతురు రేయి, పగలు వేఁతురు బందిన్.

కం. మా రాష్ట్రావధులం గల
కారాగారములయందుఁ గడు నాయతమై
సారతరమ్మగు నైనీ
కారంబడవైచి మమ్ముఁ గారించి రరుల్.

ఆ. ఏడుసమలు గడవ నేగినపిమ్మట
బందినిట్టి యనుభవమ్ము గంటిఁ
బఱచలైన నాఁటి బాధల నేవాఁడు
మదిని నిల్పుఁ గాల మధిగమింప.

కం. నలువురితో నన్నుంపక
ములుచలు ఘాతుకులు విడిగ మూయఁబడు చెఱన్
నిలిపిరి నే నేదోసము
సలిపితినో నేఁటివఱకుఁ జాలరు చెప్పన్.

ఆ. ఒండు రెండు నాళు లోసపరి మస్తుగా
నిదురఁగూర నలపు వదలిపోయె
వ్రాయఁ జదువ నోనరుపడమి దిష్వ్యయ లేమి
కలఁతనంది డెంద మలమటించె.

కం. ఒక వంటరి తుడుపరి నా
నికటమ్మునఁ బగటిపూఁట నిలుతురు రేయిన్
సకులేరు లేమి వింటన్
వికసించును గనులు వెల్లివిరియు ముదమ్మున్.

చం. పుటములు వెట్టుచో విరియఁబూసిన దావహుతాశనచ్ఛటల్
చిటిలిన విస్ఫులింగముల లీలను దారకముల్ సమస్త ది
క్తటములఁ బర్వి శోణసితకాంతులు వింతల నీనుచుండ ను
త్కటమగు తద్విలాసమును గాంతును జుక్కలసుద్ది యెద్దియో.

చం. వలిపెపువల్లెవాటు నిడువాలికపోలిక మబ్బుతున్కలన్
గలికెడు తారహారసుమనోహరరూపము మేన నిప్పుడుం
బులకలుపుట్టఁజేయు నివిబోధమొనర్చిన కాలమానముల్
దొలఁగవు పేదవారి వసతుల్ విడనాడవు మేలుకొల్పఁగన్.

చం. చలనములేక దిక్కులకుసాగక వీఁగక సౌమనస్యమున్
నిలిచినచోటనిల్చి యతినిష్ఠఁ దపంబొనరింప నెవ్వఁడి
బలితపు శాసనంబిడెఁ దపఃపరిపక్వఫలోదయస్థితిం
దలఁపదువో ధ్రువమ్ము ధ్రువతార గడించెను సుస్థిరత్వమున్.

కం. భావి భవ దుర్ఘాతమ్ముల
నేవలిగాడ్పులకుఁ జెదరకే నిలిచిన యీ
రీవి మనకబ్బ సుస్థిర
భావమ్మునఁ బడయఁగలము పరమార్థమ్ముల్.

కం. బలుకట్ల దద్దు లేర్పడి
కళవళపడి దండడించు కార్పణ్యమునన్
నలఁగెడు మాబోంట్లకు నీ
విలసితమా కాంతి శాంతిభిక్ష నొసంగున్.

సీ. పెడబొబ్బలిడఁగ వెంబడి తోఁకచిచ్చున
నడరుసందడులు ప్రత్యవఘళించుఁ
“బారాహులుపారుచప్రాసి”రే యన్నచోఁ
బ్రఘుణముల్ ఘుల్లలారవ మొనర్చ
పూఁటకాఁపరుల మెప్పులుగోరు గణకుల
గంభీరతర మహాగర్జ లలము
చిడిముడిపాటు చేసినవారి బెదరింపఁ
దములోని తీవ్రరోషములు విఱియుఁ

ఆ. బోడుగొట్టి యడవిపొంత పొలాలలో
నెగడివేసి మొగము లగడుపడఁగఁ
గూఁకలిడెడు రైతులోకమ్ము బొబ్బలు
గుప్పికెలయు వీరిగోల రేలు.

కం. వినయోక్తి యుక్తి ప్రమొక్కిన
ఘనరోషమ్మున నదల్చి కార్పణ్యమునం
గనలి విని విననియట్టులఁ
బనవుచు నేగుదురు వారిస్వచ్ఛందగతిన్.

కం. చతురస్రమిశ్రకుడ్య
స్థితహార్మ్యవిహారి కిమపీరస వక్ర
స్థిత కుడ్యగేహావాస
స్థితి దుస్సహ వేదనావిశేషమ్మయ్యెన్.

కం. అరుణారుణాంశుప్రాచీ
తరుణీవదనారవిందదర్పశ్రీకిన్
మెరమెరలువోవు పశ్చిమ
ధరణీధరుఁ గాంచ మనము తహతహలాడున్.

ఆ. పాడువడిన నూతిపాఁతఁఅబోటియల
వలెను మసకచీఁకటులును గ్రమ్మ
యాకసమ్మునంటఁ బ్రాఁకిన గోడల
నడిమిగదులు తాపమడరఁజేసె.

కం. నానిలుచు బందిముందటి
తానమ్మునఁ బంజరమ్ముతమకున రాలం
బూనిచిన కట్టడమ్మును
దీనం జన మొక్క పెట్టు తిరుగఁగఁ గంటిన్.

ఉ. మానవశక్తి నిట్లు కసుమాలము సేసి యుపద్రవమ్ము సం
ధానమొనర్చునాఁడు నవనాగరికత్వము రూపుమాయు న
ద్దానఁ బశుత్వమబ్బు బహుధా పరిపాలకు లిట్టిఘట్టముల్
గాననినాఁడు గాడుపడుఁగాదె జగ మ్మిడివోని వేదనన్.

చం. అది జలయంత్రశాల పదునార్గురు శిక్షితు లీడఁబోక త్రి
ప్పుదురు పశూత్కరమ్ము లనుపోలిక యభ్యసనమ్ములైనచో
మదికెది రోఁతగూర్పదు సుమా! నను నిట్టిపనిం గుదింపఁగాఁ
గొదికితి ముందుడెందమున, గుంజితి నేఁ గపిలెం గ్రమమ్మునన్.

కం. వఱువాత లేచి నా యా
వరణమ్మునఁ బరువు లెత్తవచ్చు నటంచు
త్తరువులొసంగిరి శిక్షితు
లొరులెవ్వరు నన్నుఁజూడ కుండెడు రీతిన్.

ఆ. ప్రొద్దుపోకముండె నిద్దురం గూరుదుఁ
గాంతినిచ్చు దీపకళికఁ లేమి
చదువులుడిగి సాముసంప్రాప్తమై నాకు
సంతసమ్ము చిత్తశాంతి యొదవె.

కం. నెల గడచువఱకు సావా
సులు లేమి విచారమొదవి సురిగితి నూత్న
స్థలమవుట నేరి నేవిధిఁ
బలికింపఁగవలెనొ తెలియఁ బడదాయె నటన్.

కం. యావజ్జీవము శిక్షం
గావించెడువారు కొలువుకాం డ్రధికారుల్
సావాసమైరి నను స
ద్భావమ్మున నాదరింపఁ దలకొని రెదలన్.

ఆ. బ్రదుకుదనుక బంది బంధింపఁబడువార
లిరువదేండ్లు వరఁకులెల్లఁ గడచి
మనినఁగాని తీరుమానమ్ముగా దట్టి
వారె ప్రమ్మికొనినవారు నాఁడు.

తే. అక్కజమ్మైన ముచ్చట వక్కణింతుఁ
జెఱగొనిన వానిదుస్తులఁ జెరవినట్టి
కొయ్యబిళ్ళలమీఁద జక్కొల్పుచుందు
రలవరించిన శిక్షావిధులను దొరలు.

తే. ఏఁబదేనేండ్లు పాచితంబిడి రొకనికి
నతఁడొనర్చిన యపరాధశతము గలిపి
గణనఁజేసిరి కాఁబోలు కానినాఁడు
బలితమైనట్టి యిట్టిశిక్షలును గలవె.

సీ. నశియించిపోయె సంతతతాపవహ్నిలో
బాహ్యప్రపంచ సంపర్కమహము
తలవెట్టిగొనియెఁ జింతావిషజ్వాలలో
దయనీయురాలైన ధర్మపత్ని
కొందలంపడియె నెక్కుడు వియోగాబ్ధిలోఁ
దలమున్కలైన సంతానచయము
తలయెత్తవెఱచె బాధామరుభూమిలో
రవరవలాడు బాంధవగణమ్ము
వీనినన్నింటఁ దలఁచు నావేదనమునఁ
జక్కసామాను శిక్షితుం డక్కటకట
బ్రదికిచచ్చిన నడపీన్గువలెఁ జరించు
మనము నిర్వీర్యమై వినాశనము నొందు.

కం. ఆఁకట నకనకలాడుచుఁ
గాకమ్ములకరణి గోలఁగావించుచు న
య్యో! కూటిపేదలను మా
యాఁకలి సమయింపఁ జూడుఁ డన విన రెవరున్.

ఆ. ఉసురులుడిగి జీవమోసరిల్లిన వారిఁ
దులనునిలిపి యొడలు దూఁచుచుంద్రు
వేదనాభరమ్ము బాధించు హృదయమ్ము
నాఁకవెట్టి తూఁచ రైరి యెవరు.

ఆ. మరణదండనమ్ము మానుప యత్నించు
మనుజు యత్నములును మదికి హితము
కాని చిత్రహింస గావించుకంటెను
నొక్కతేప చంపు టురవుగాదె.

మ. తరుణీ బాంధవ మిత్ర పుత్రజన బద్ధప్రీతులై దర్పనో
త్కరులై సంతతగణ్య మాన నిజశిక్షాకాల చేతస్కులై
నిరయాంతర్గతిఁ గంది కుందెదరు జనానీకావలోకమ్ములం
గరడమ్ము ల్పొరలెత్తుఁ జిత్తమున నుగ్రవ్యగ్రరోషాహతిన్.

చం. మరగిన రాగభోగముల మజ్జన భోజన పాన శయ్యలం
బరిచర సేవలం గరఁగువారు దృఢీకృతచిత్తవృత్తులై
యరయ రదేమి బాధితుల యాపద మాప దయార్ద్రబాష్పముల్
పరప రదేమి తమ్ములొలంగ మలంగి నలంగి క్రుంగఁగా.

చ. ఎడపడకుండఁ దాముదినుటే పరమార్థముగాఁ దలంచుచోఁ
బడితరమాసచేయు పశుపక్షిమృగాదులకన్న మిన్నగా
గడనకువచ్చునే జనుఁడు కామితదాయకమైన విద్యయో
పుడిసెఁడుగంజికే యొడికముం గననేరని తెల్విఁ గాల్పనే.

చ. శతనియుతాయుతప్రయుతసంఖ్య జనమ్ము స్వతంత్రతాప్తికై
మతకములార్చి విద్యుదుపమాన శుభాకృతులైన పుత్రులన్
సతులను బాయఁద్రోచి చెఱసాలఁబడెన్ మనవారె దీనికిన్
గత మెదియంచుఁ జూడ రనుకంపవహింప రనాదరమ్మునన్.

ఆ. విడుపులేని శిక్షపడిన వాఁడొక్కండు
దిగులుదెలుపు బిక్కమొగముతోడ
సొంత యేలుబడి పొసంగిన మాకిట్టి
నరకబాధ తొలఁగునా! యనియెను.

కం. జీవితమే నిస్పృహాకుం
దావలమై మాఱురూపు దవిలిన యతఁడీ
రేవఁ దనబాధ దెలిపినఁ
బ్రేవులలోఁ దీఁటరీతి వేధించె ననున్.

ఆ. కడుపుమంట కగ్గపడువాడు చేసిన
చేతలకును నిట్టి శిక్షలిడిరి
కడుపునిండినట్టి ఘనులొనర్చెడి తప్పు
లొప్పులయ్యె మేల్మి కుప్పలయ్యె.

ఆ. కర్షకుండు కాడిగట్టులఁ బుట్టల
వాడుఁబూని చెఱకువచ్చుచుండుఁ
దరతరాలనాఁటి ధైర్యమ్ము శౌర్యమ్ము
పెచ్చురిల్లి యిట్టివెతలఁ గూర్చు.

ఉ. ద్రోసము లేయొనర్చు పతితుల్ నరజాతి కుపద్రవమ్ములం
జేసెడు నిందితుల్ పరులజీవములార్చెడు ఘాతుకుల్ దుర
భ్యాసము లాత్మవృత్తములునౌ మలపల్ మనసీమ లేరనం
గా సమకట్ట మంచిచెడుగానకయుండుట కేవగించెదన్.

కం. సామాజికవ్యవస్థల
నే మాత్రము గదిపి యించుకించుక విద్యా
సామర్థ్య మార్థికస్థితి
నేమమ్మును గూర్ప మార్ప నేరము లురలున్.

కం. చెఱ కేరయగువాని మన
మ్మొరియఁగ హింసింతు రతనివృద్ధికి బుద్ధి
స్థిరతకు రక్షణ కునికికి
నిరతికి ద్రోహదము సేయ నేర రధికృతుల్.

కం తనిపెడుప్రొద్దున మునిమా
పున బందిని నెట్టి వెతలఁబొరలెడు వేళన్
గనిపింతురు బాహ్యాము మా
యునికిది యింకెట్లు మంచియూహలు గలుగున్.

తే. పదిపదాఱేండ్ల వయసులో పడినవారి
నెందఱినో బుద్ధిమంతుల బందినునిచి
యాటపాటలఁ జదువ వ్రాయను సడల్చి
మందమతుల నొనర్తురు బందెకాండ్రు.

కం. నూటికిఁ దొంబదియైదుగు
రాటంకము లధిగమింప నర్హులు గామిన్
బూఁటకుఁబూఁటకు సంకట
పాటునఁబడ బాహ్యలోకవాసన లుడుగున్.

ఆ. మూఁడునెలల కొక్కపారిఁ జుట్టలం జూడ
నాఱునెలల కొక్కయాకు వ్రాయ
ననుమతింతు రదియుఁ జననీరు గరగర
లేనిపోని దొసఁగు లూనఁజేసి.

ఉ. నూటికిఁగోటికొక్కఁడు వినుం దిను నుత్తరముల్ లిఖించు నె
ప్పాటన లోటులేక తనబంధుసుహృజ్జనదర్శనమ్ములం
గాటముగానొనర్చు నొడికమ్మగు దుస్తులఁ గుస్తరించుఁ గా
నీ! టకటాంకుజీవితము నింపులునించునె హాయిగూర్చునే.

కం. వినయము నయము సుశీలము
గనుపడవను నెపము నంటఁగట్టుదు రటుపై
మునువేయు శిక్ష లిబ్బడి
నొనరుతు రార్జవము దలఁపనొల్ల రధిపతుల్.

కం. కారాగార మగారము
మాఱుదల ల్లేని సుఖము మసలుట లోకఁడై
యూరోపువారి కుండు ను
దారముగా మనకునటుల నలవడ వలదా!

కం. ప్రతిభానువాసరమ్మును
మతగురు వొకఁడేగుదెంచి మన్నించు జగ
ద్ధితబోధ లుత్తరమ్ముల
మితముగఁ జేకూర్చుఁ గూర్చు మృష్టాన్నమ్ముల్.

కం. శ్వేతేతరమా జాతికి
నైతిక మాత్రమ్ము మనుసులు సమకూడినచోఁ
బ్రీతివడు బుద్ధిజాడ్యము
లాతంకము లధిగమించి యారట దక్కన్.

చం. నిరయముకన్న మిన్న యవనీపతిశాసన మంతకన్న దు
ర్భర మధికారిదుష్టపరిపాలన మంతకుమించి లేమికాఁ
పురమని మాటమాటఁ బొరపొచ్చెము నైఁపని గోసగాండ్రిటం
గరతలసక్తగండఫలకస్థలులై విలపింతు రెంతయున్.

తే. తోడివారికి సానుభూతులను నెఱపి
తమకుఁ గలవానిలోన సాయము నొనర్చి
హృదయమిత్తురు ప్రేమింతు రెదుటివారి
నుచితరీతిని శిక్షావియోగములను.

కం. పదితొమ్మిదివందల ము
ప్పదియగు సమయందు నొక్కపరి రెచ్చి జనుల్
పొదివి గుమిగూడి చెఱలం
గదిసిరిపో గాంధిపిలుపు కర్ణము సోఁకన్.

సీ. మట్టిముద్దలనుండి మన్నీలఁ బుట్టించెఁ
గట్టించెఁబలువీరకంకణముల
నెండకన్నెఱుఁగని యిల్లాండ్ర నడిపించె
విడిపించెఁ దెరలలో నడఁగుబ్రదుకు

సహనమ్ముతో నహింసాజ్యోతి వెలిగించెఁ
దలఁగించె దాస్యాంధతమసరాశి
కులమతాధిక్యసంకలనమ్ము సడలించె
నడలించె నాంగ్లేయయంత్రణమ్ము
దాస దాసానుదాస తద్దాస దాస
దాస దాసోహమను పురాతనవచస్సు
నీసడించెను స్వాతంత్ర్య వాసనలకు
దోసిలించెను మోహనుదాసుగాంధి.

కం. గోపాలకృష్ణగోక్లే
యాపగిది మహాత్ముగుఱిచి యెఱిఁగించెను మా
కాపలుకు లాత్మశాంతి
సాపనమహాములు సుభాషితమ్ములు నయ్యెన్.

కం. పరమావధి సాధింపఁగ
నురవగు కార్యమ్ము శాసనోల్లంఘనమన్
గఱికుదిరె నేలనాలుగు
చెఱగుల జను లేసరేఁగి చేరిరి బందిన్.

కం. జాతీయమైన టెక్కెము
చేతం ధరియింప ముదకచీరలు దాల్పన్
నేతలకు జే యటన్నను
శ్వేతాధిపభటులు శిక్షవేయుదు రలుకన్.

కం. వినమితశిరస్కులై నా
యనుఁగుంజుట్టంబు లందునతివలు నాప్యా
యనముగఁ జెఱకేగిరనన్
విని సంతసమంటె సుజనవిశ్రుతిఁ గంటిన్.

తే. కమల దేహమ్ము మిపుల రోగములగీము
నిలువదార్ఢ్యమ్ము లేదని తలఁచియుంటిఁ
బనులు దీటిక లేక తీర్చినది వింటి
డెందమునయందు నానంద మందఁ గంటి.

చం. పలువురుగూడి మానసిక వాచిక కాయిక కర్మపంక్తులం
గలియుటకష్టమైన సరకారు నెదుర్పఁగ నోర్పు నేర్పులన్
మెలఁగిరి దేశదాస్యము శమింపఁగ నిల్చిరి కమ్మకట్టుగాఁ
బొలిచిరి యెల్లవారు పరిపూర్ణవినిర్ణయకార్యకర్తలై.

తే. పిల్ల మునుకువ కాంగ్రెసు బెదరుచుక్క
రక్షకభటాగ్రణులకు శ్రీరామరక్ష
లాగు యతనమ్ము నడువ నుద్యోగులెల్లఁ
దత్త్వము నెఱింగి దారితోత్సాహులైరి.

చం. వెలుపలనున్నవారు గడు వేసరియుండ సుఖమ్ము దుఃఖమో
తెలియక నూలుదారము నుదీయుట నేయుట కట్టుబట్టలన్
మలినము వాపుకొంట చనుమానముతోఁ బరియించుచుంట తా
వలమును శుభ్రముంబానరుపం గమకించుట లయ్యె నా కటన్.

కం. సౌఖ్యముఁ బ్రత్యాఖ్యానము
ముఖ్యముగాఁ జేసి కష్టముల ముంచుటకే
ప్రఖ్యాతివడయు జైళుల
సఖ్యము సౌహార్దమధురసరణు లుళక్కుల్.

మం. దురదృష్ట మర్త్యసందోహమ్ము నెల్ల
శోధించి బాధించి శోకాన ముంచి
పలుకాఁడ జూడ గుండెలు గ్రుళ్ళఁదన్ని
యూపిరాడని పనుల్ రాపాడఁ జేసి

బుద్ధివికాసమ్ము బూదిపాల్చేసి
గర్జించి తర్జించి కంపమ్ము గూర్చి
వాలారుచూపు లవ్వారిగాఁ బఱపి
తోడిసోదరులను జాడయే మఱచి
చోఱమీసములు గచ్చులుమీఱ దువ్వి
యుఱిమిచూతురు కార నుద్యోగులెల్ల
పాపమ్ము పుణ్యమ్ము పచరించువారి
మమతోజ్ఝితాత్ములై మసలెడివారి
ముప్పెట్టు వెట్టెడి ముమ్మాటకాండ్రఁ
గుప్పించి దూఁకు నెక్కుడురోసగాండ్ర
గుప్పిటిలోనల్చి పప్పుచేయుటయె
మతముగా వారుసంభావింతు రాత్మ
గుంపులోఁ గొందఱఁ గొటికాండ్రఁజేసి
చెఱసాలలోఁ బరాచితులుగాఁ జేసి
తఱివేచి చూచి పెత్తనమిచ్చి చీల్చి
విడఁదీసి పాలించి వేడ్క నందెదరు
పరిపాలనమున నీయొరవడి గలదు
నీతిగా దీని మన్నింతు రీఘనులు
మాసాంతమునకు నర్మదసింగు వచ్చె
నాతోడు నీడగా నాతండు నిల్చె
మాతండ్రి, సయ్యదుమామూదు లిరువు
రావెంట నాకొట్టులో వేయఁబడిరి
నిష్కారణమ్ముగా నిర్బంధమునకు
గుఱియైరి తమదోష మెఱుఁగలేరైరి.

# ఎఱవాడ సంధి

ఆ. ఎఱిఁగి చేయకున్న నేమాయెఁ దదుపేక్ష
కమ్ముకతనఁ దండ్రి కార నలఁగె
నిఱుకటమున గాలి కఱవైన తావల
మ్ముల వసింప వేఁకి పొడమకున్నె.

తే. గుదులు గుదులుగ నా చిన్నగదులలోన
నసుమఁ బదుగుర కందూపి రాదుడెట్లు
ప్రాణవాయువు విషవాయువై కలంచు
నాయురారోగ్యములు మొదలంట సమయు,

కం. అడఁగెడు నారోగ్యమ్మున
నడుగిడె మేముండుబంది కామీఁదట నీ
చెడుపఱగడ లంతంతకుఁ
జెడనడఁచినఁ గ్రుంగిపోయెఁ జెలువ మ్మెదెన్.

చం. సిలుగులు సెప్పఁ గంటికిదిసింపక వీనులకెక్కఁ బోవు మా
పలుకులు, జైలులోఁ బడెడి పాటులు గన్నులుగల్గి చూడఁగాఁ
దలఁపరు పాలకుల్ చెడుచెదారము ప్రోవులువడ్డ డుల్పఁగాఁ
దలఁప రిదేమిపాపమనఁ దప్పగు ముప్పగు నోర్చుటొప్పగున్.

ఆ. వానకాళ్ళు సాగి పడువేళఁ బైకప్పు
బుడగలూరి బొటుకుపడుచు నుండు
మూలమూలకొదిగి కాలమ్ముగడపినఁ
జెమ్మనేల నేమిసేయఁ గలము.

కం. ఈ పసులపోలిగాండ్రకు
నేపొద్దులు చెప్పిచూపి యుసడిలితిమి మే
మాపక్కకు నీపక్కకు
మాపక్కల కెల్లయపుడు మార్పిళు లయ్యెన్.

ఆ. చలిచియడుగఁగా వసారాను సువిశాల
భంగిఁ దీర్చి కట్టుబడి యొనర్చి
రంతలోన శిక్ష యంతరించుటఁ జేసి
యరిగెఁ దండ్రి సుకము దొరకె మాకు.

ఆ. జనకునొకని వేఱుచావడిలో నుంప
నామతించి రంతనొ నదేమి
నలుగురమును గలిసి వలయుసేవలు సేయ
వలనుపడునె శాంతి గలుగఁ గలదె.

సీ. ఈకర్జమునకు మున్నాఁకవెట్టిరి కాంగ్రె
సక్రమమా సంఘమంచు దొరలు
దానఁ దత్సంఘమందలివారు దోషులు
మునుముందు నధికారమున మెలఁగుటఁ
బ్రథమతాంబూల గౌరవము నాకొసఁగిరి
తదనంతరము సభాసదుల కిడిరి
బేడీల నపుడు వాయోడక మేమంద
ఱము గారకేగు సంరంభమందు
బడియుఁ గ్రొంగ్రొత్తవారి కీబాధ్యతలను
నొప్పనముచేసి క్రొత్తసభ్యులను జేర్ప
నధికృతుల నిచ్చితిమి మహోద్యమము నడుపఁ
గమల యర్హతఁ గాంచెఁ దాత్కాలికముగ.

వ. ఇత్తఱిఁ బ్రభుతకుఁ గాంగ్రెసునకుఁ బొత్తులు గుదుర్ప తేజబహాదూరు సప్రూ, జయకరుగార్లు రాయబారముల నడుపుచున్నట్లు పత్రికాముఖమునఁ గంటిమి. మహాత్ముఁడగు గాంధి నామతించియే యీచేఁతకుఁ బూనినట్లు వింటిమి.

తే. మున్ను బొంబాయిపత్తన మ్మున నొకండు
ప్రకటన మొనర్చియుంటి నపార్థములకు
దారితీయునటంచు విచార మొందువ
ననియె నాతండ్రి యది నిజమయ్యెఁ దుదకు.

తే. పలుకుఁబలికిన వానిభావము నెఱుఁగక
తమకుఁదోఁచినయట్టు లర్థములు చెప్పు
కొంటెమూఁకకు మననేలఁ గొదువలేదు
వీరిపెత్తనమే తాండవించుచుండె.

కం. నను నధ్యక్షునిగాఁ, బూ
జ్యునిగా గాంధిని నొకింతఁజూచిన మేలౌ
ననెఁ దండ్రి నిశ్చయమ్ములు
వినిచెద రవ్వారె యనె వివేకముతోడన్.

ఆ. మాటలాడ గాంధి చీటిఁగైకొని సప్రు,
జయకరుండు నైని జైలుకడకు
నరుగుదెంచి రాంగ్లపరిపాలకుల కిద్ది
కనుల పండువగుచుఁ గానిపింప.

కం. తొలుదొల్త మేలుగీళుల
పలుకులఁ గావించుకొని నృపాలుర భావ
మ్ములు గుర్తెఱిఁగి యాపైఁ
దలఁచితి మివి చేతపెయ్యతంత్రము లనుచున్.

ఉ. జందెము మూరవేసినటుసాఁగెను, జక్రపరిభ్రమమ్ముగా
నొందెను, దీఁగె సాఁగినటులుండెను, లోవెలినొక్కరీతిగాఁ
బొందికలేక చక్కఁబడఁ బోవునె మాటలు తార్కికమ్ములన్
జిందులు ద్రొక్కినట్లయినఁ జేకుఱఁబోవు భవిష్యదర్థముల్.

ఆ. ఒకనినొకరుమించు నుబలాట మెసరేఁగ
మాటపొందులేని చాటపడితి
మూరుపోరుతోడి యార్భాటములు పెచ్చ
రిల్లి కార్యగతిని బొల్లవుచ్చె.

ఆ. ఏలుబడికి మనకు నెట్టిపొత్తులు గూర్ప
వశముగాదటంచు విశదమయ్యె
మనసు మాట హస్తిమశకాంతరమ్మన్న
రాయబార మనెడు కూయిగలదె.

కం. ఇదమిత్థమ్మని గాంధిం
గదియక సంభాషణమ్ము గావింపక మే
మెది సెప్పమనుచు నొడివితి
మదియే వ్రాసితిమి గాంధికనిపెడు లేఖన్.

కం. ప్రతియత్నమునకు రాజ
ప్రతినిధి నెఱవాడబందిరాయని నంగీ
కృతుల నొనరించి వచ్చిరి
మతిమంతులు మమ్ముఁ గలియు మానసములతో.

చం. ఒకటికిరెండుచెప్పి తలయూఁపనొనర్ప సమర్థు లిర్వురీ
రకములనెల్లమ్రింగును ధరావిభుఁడిర్వును వీరిమువ్వురం
దికమక మట్టుపెట్టు కడుధీరుఁడుగాంధి యిఁకెట్టు సంధిపొం
దికయగు నల్వురొక్కటయి నిల్చినఁగాదె పొసంగుఁ గర్జముల్.

తే. వల్లభాయిపటేలు నాహ్వానమునకుఁ
జిట్టుబుట్టాడు నజదు ససేమిర యను
మీరు మీరని పరులతో బేరమాడు
దొరల వైదగ్ధ్యగుణము సంస్తుతికిఁ దగదె.

కం. అజదుఁ బటేలును వీడినఁ
బ్రజలకు నెవ్వారు నచ్చఁబలుకం గలరో
సృజనాత్మకశక్తులతో
నిజముగ మన సుప్రతిష్ఠ నిలిపిరి వీరల్.

కం. కీలెఱిఁగి వాతఁబెట్టెడు
పాలకు లీపన్నుగడలఁ బన్నిరి మేలుం
గీళుల దిగమ్రింగెడి యీ
కూళలు వెనుకంజవేయఁ గొంక రెడందన్.

ఉ. ఏదొకసొద్దువెట్టి యలయింపఁగఁ జూతురు తెల్లవార లే
తాదృశయుక్తియుక్తపరతంత్రవిధానవధానమానసో
న్మాదవికారసారమహిమాపరిణద్ధజితాంతరాత్ములై
మీదయ మాయదృష్టమని మిన్నులు సూతు రదేమి సోదరుల్.

కం. లేదని కాదని చీఁదఱ
వాదాడం గాలుదువ్వవచ్చెడి వారిం
బాదముపట్టుట మనకే
కాదుసుమీ! జాతికెల్లఁ గడునేవంబౌ.

కం. మనమెల్ల గాంధి దర్శన
మునకేగి పరిస్థితుల సమూలముగాఁగన్
వినిచెదము దీన మీలో
ననుమానము చేయఁగలుగు నంశము లున్నే.

కం. ఆతని పర్యాలోచన
మూఁతమ్ముగఁ గొంద మింతయొప్పదె మా మీ
చేతమ్ము లత్తుకొన నీ
చేఁతల వివరించు నంచుఁ జెప్పిరి వారల్.

కం. మే మెదిచేసిన మున్నా
స్వామికి వినిపింపకుండువార మె పొదమా
భూమికి మా కనుమాన
మ్మేమాత్రము లేదు సంశయింపము ముందున్.

ఉ. ఐనను దేశనాయకుల యాత్మలెఱుంగక యొక్కరుండుగాఁ
బూని వచింపఁ డెల్లవిధము ల్గనుభారతజాతికే బహిః
ప్రాణము గాంధి వానిఁ గనుభాగ్యము గాదనువారమే తదా
స్థానము భోగియోగిజనతాహృదయానుగతాధ్వమేగదా!

ఉ. ఎమ్మెయి నాసఁ జేసి తపియించిన నద్దములోననున్న బిం
బమ్మును గైవసమ్మొనరుపం గమకించినయట్టులయ్యెఁ గ
ష్టమ్ములు మిక్కుటమ్మయి విషాదముగూర్చెను బంధనమ్ములున్
ముమ్మరమయ్యె నాయకులమూతికిఁ జిక్కము వెట్టిరీదొరల్.

ఆ. కడుపుమండి చేయఁగారాని పనులఁ గా
వింపనెవరు సాహసింప లేదు
పనికిరానిపనులఁ గనుచాటుమాటుగాఁ
జేయఁగడఁగ రెట్టిచేటు మూఁడ.

తే. వల్లభాయిపటేలు, షెర్వానిగార్లు
మదనమోహనమాలవ్య మొదలుగాఁగ
నాయకాగ్రేసరులు గారఁ ద్రోయఁ బడిరి
రాయలొనరించు రాయబారములె యివ్వి.

కం. తొడగిల్లి జోలపాడఁగ
బుడుతలమా యారటంపుఁ బులకలు నడుపం
బడునే గిల్గింతల నీ
పెడచేఁతల నేమియనుభవింతురు హూణుల్.

కం. చీకొట్టువారిఁ జూడక
వాకట్టఁగఁ జూతురేమి బడిపాఁతఱలో
నూకుటకా యీ సంధులు
లోకము చీఁకుందనమ్ములో లేదుగదా!

ఉ. ఎంతటి ఘోరకృత్యముల కేని దలంకక సంధిరందిఁ గే
రింతలుగొట్ట ధర్మవిపరీతము లీపను లిట్టివారితో
సంతనకట్టుబెట్లని విచార మొనర్పక తోడిసోదరుల్
గంతులువేయుచుందు రిదిగాదనఁ గల్గు నిరాపనిందలున్.

ఆ. వేళపాళ దెలిసి తాళమ్ము వేసెడి
కూళతోడఁ బొత్తుగూడ దెపుడు
రతికిరంగమునకు రానిమాటలఁ బ్రొద్దు
డిందుపఱుప సంధిపొందుపడునె.

చం. మది నిది యెంచఁబోక యొకమాఱు మహాత్మునిమంతనంబులన్
బదుగురు చేయిగల్పిన నుపద్రవమే మని రాయబారులా
యొదికిలఁబడ్డమోముల సయుక్తికవాద మొనర్చి రిద్ది మా
మదులకు సద్దలే దయిన మంచిదయంచుఁ దలంచిపంపఁగా,

ఆ. పయనమునకు నేరుపాటులు గావింపఁ
బడియె దొరలసెలవు లడుగఁబడియెఁ
దప్పులెల్లఁ బరులతలపైని బులుమఁగాఁ
బాఱఁజూచు రాజ్యపాలనమ్ము.

వ. నాఁటి జాతీయసభాకార్యదర్శియగు డాక్టరు సయ్యదు మహమ్మదు, నాతండ్రియు, నేనును మాకొఱకే ప్రత్యేకముగా నియోగింపం బడిన ధూమశకటంబుపైఁ బూనాకుఁ బ్రయాణంబుం బొనర్చితిమి.

ఆ. కన్నువోడుచుకొన్నఁ గానిపింపని కాళ
రాత్రియంద మాకు రైలుబండి
పయనమయ్యెఁ బెఱలుపరికింప మెరమెర
లాడుకొందురను భయమ్ముగలదు.

ఆ. పొక్కిపోవుననుచుఁ గ్రుక్కిన యీవార్త
గాలిదూది పింజకరణి రేఁగె
నదుకొన్నయట్టు లాచెవికాచెవి
కెక్క దిక్కులన్ని పిక్కటిల్లె.

కం. పరిసరమువారు చలికిం
గొఱుకుడువడి కాళ్లుఁ వ్రేళ్ళు గొంకరవోవన్
గుఱుతింపక దరిసింపఁగ
బిరబిరనేతెంచి రచటి పిన్నలుపెద్దల్.

చం. నిలిచెడిచోటుల న్నిలువనీయక పోయినపోక కళ్లెపుం
గొలుకులుఁ ద్రెళ్లుచో బెదరుగుఱ్ఱమురీతిని జెట్టివోలె నో
రలు కుదురూడి పెళ్ళగిలి ఱంపిలి మావెనువెంట నంటునం
దలఁపులు గల్గె రైలుపయనమ్మొక వింతగనుండెఁ జూడ్కికిన్.

మ. అడుగోసయ్యదు మోతిలాలడుగొ జహ్వార్పండితుండాతఁ డ
ల్లడుగో చూడుఁడుచూడుఁడంచు జనులత్యావేశముంగూరి ముం
దడుగై గాంధికి భారతాంబకును జేయంచుం "దుమూధూళి"గాఁ
బిడుగుల్వ్రాలినయట్లు బొబ్బలిడఁ గంపించెం దిశాచక్రముల్.

చం. గోలగోలమీఱఁ జెట్టులకుగుట్టలకుం గటివోక మూఁడురం
గులసిడముల్ దవిల్చి రరికోటికి గుండెలువ్రయ్యునట్లుగా
నిలిచిరి దేశసేవకులు సీతికి, మాకది నేత్రపర్వమై
మలఁగఁగఁజేసె మానసికమాంద్యముఁ దాలిమిహత్తెఁ జిత్తమున్.

కం. మఱునాఁడు నడికిరేయికిఁ
గిరికీ యనుపురము విడిదికిం గుదురయ్యెన్
సరియైనవసతి లేమిన్
బురపురఁ బొక్కితిమి జంత్రపు నొబ్బమ్మలమై.

కం. చేరినవెంటనె గాంధిం
గూరుతు రీ రంచుఁ దలఁచుకొను మాయూహల్
మూరింబోయెను బేరజ
మూఱెన్నముఁజూచు నున్నతోద్యోగులకున్.

కం. పూజాడఁదీసె జనకుఁడు
పో జనదని కూరుపరుల పొందికకొఱకే
యీజాగులనుచు వారల
పూజరితనమున్నఁ బొందుపొసఁగ దటంచున్.

ఆ. ఒకటిరెండు దినము లూరక వేఱొక
మందిరమున నుండ మనసుమండ
గాంధిఁ జూచి పొందుసంధించు జతనమ్ము
లాఱెననియె నప్రయత్నముగను.

ఆ. తప్పుసైఁచి మమ్ము దయఁజూడుఁడని వంక
వంకదండములకు వారుదిగిరి
తండ్రిమనసు మెత్తఁదనము దాల్చెను దుద
కామతించె గాంధి నరయబెరయ.

వ. మాతో నటకు వేఱొకచోనుండి తోడ్కొనివచ్చిన వల్లభాయిపటేలు, జయరామదాసుదౌలతురామ్గార్లను, సరోజినీదేవిని గాంధి ముందిడిరి. అదుకుడుగాంధ్రడగు స్వప్రూజయకరులతో మేమందఱము మూఁడు దినము లాయూసులఁ గాలముపుచ్చి యెట్టకేలకు శాసనోల్లంఘనము నాపివేసితిమి. అయ్యాయివార్తలు దినపత్రికల మూఁచేఁ బ్రకటితమాయెను.

కం. అసురసురా వాగ్వాదము
గసిమసఁగిన నాఁగి యానుగాదని నిలువం
బసచెడె దేహారోగ్యము
గుసిగుంపులు హెచ్చి ముసురుకొనె నాతంద్రిన్.

చం. వెనుకటి యుబ్బసమ్ము పెనువేఁడిమిచే నినుమిక్కిలై చిగి
ర్చెను దినుశాకపాకములచే నది ముబ్బడియయ్యె దానిచేఁ
దనువు ఘోనుంగువడ్డ నిలదార్ఢ్యము డక్కి నలంగె నిత్తఱిన్
జనవరి యొక్కరుండు చెఱసాలను వీడ్వడఁజేయ మేలనెన్.

ఉ. నిమ్మకు నీరమెత్తినటు నిల్చెఁ బ్రభుత్వము లాభమింక శూ
న్యమ్మనె సంచికట్టు తగునాయనెఁ బత్రికలింతలేసి క
ర్జమ్ములు మూఁడుచో విడువరా యనె లోకము మేలుగీళ్లలో
నొమ్మికచూపకున్న సుఖమున్నె యనెం జగమెక్కపెట్టునన్.

చం. ఇదిచెవిసోకఁగాఁ దనకునెక్కడలేని యసహ్య మేర్పడెం
బదుగురతోడ గోల యొకపట్టునఁజేయఁగఁజేసె బందిలోఁ
గుదురక యన్నపానములొక్కో యని దూఱుదురంచు, లోకులే
మొదవినఁ గాకినోళ్లగతి నుందురు నిక్క మెఱుంగ రక్కటా!

చం. అనితలపోసి యిర్విను కు నప్పుడె కమ్మయొకండు వ్రాసి తాఁ
బనిచెను నాఁడునాఁటికి నపాయము చేకుఱుచున్న చిన్నెలా
కనుపడె బందినుంప భయకంపితులై రధికార్ల శిక్షచె
ప్పిన యది రద్దుతో విడిచిపెట్టిరి తర్పితులైరి యెల్లరున్.

సీ. దినదినమ్మునకు నూతన తేజ మిచ్చెడు
తేజస్వి లేమి నిస్తేజమయ్యె
ప్రత్యహ మ్మిసుమంత పనికి ఉంకెలు సోలు
చెలువుండు లేమి నిర్జీవమయ్యె
ఎల్లవేళల హాస్య మిగురొత్త మాటాడు
విబుధుండు లేమి నిస్పృహము నయ్యె
నానాఁడు మాజీవనాళ్ళ కుక్కెక్కించు
వీరుండు లేమి నిర్వీర్యమయ్యె
సోమరితనమ్ము మావృత్తిఁ జొచ్చి హెచ్చెఁ
జప్పచప్పని యూహము ల్స్పందడించె
మిడియడఁచినట్లు పరులు వెంబడినయట్లు
కొట్టరువు శూన్యమైనట్లు గుండె గుమిలె.

ఆ. ఆఱునెలలు బందియందుండి విడుదల
యైతి శిక్ష పూర్తియైన కతన
ముదితతోడఁగూడి ముస్సోరిపురినున్న
తండ్రిఁ జూచుకాంక్షఁ దరలినాఁడ.

ఆ. పొందు డిందుకతన పోరాటమా హెచ్చె
యువల యుసురులెల్ల నూడ్చివైచె
రైతుజనము పన్నురాపిడిచే స్రగ్గెఁ
గూలినాలిజనము గూట ప్రమగ్గె.

ఆ. పొట్ట బట్ట గడుపఁబోవని రైతులు
బ్రదుకు లేమిడికిని బలియొనర్చి
పవలు రేలునాక పాటెంత పడినను
నాదరింపఁ జాలరైరి దొరలు.

ఉ. నాయనుబుద్ధితోఁ గరిసనమ్మొనరించుటదక్క వేఱె య
న్యాయము నెప్పుడుందలపనట్టి మహాత్ముఁ బరోపకారపా
రాయణు లోకబాంధవుని హాలికు నెల్ల రనాదరమ్ముతో
దాయగఁజూతురేమి పలుదారులఁ జేయుదురేమి యూహముల్.

కం. పూవువలె నలఁగకుండఁగ
జీవితముం గడుపు దొరలసేవకు సిస్తుల్
ప్రోవులు వెట్టెడి రైతుల
కావత్సర మీతిబాధ లలముటఁ గూర్చెన్.

సీ. చిదిగిపోయిన రైతు సిస్తుచెల్లింపంగ
నూపిరాడక ప్రాణ ముగ్గపట్టెఁ
జెమటోడ్చు కూలి కంచము మంచ మమ్మిన
దినవెచ్చమునకునై దిగులుపుట్టెఁ
దప్పెటపై దెబ్బతప్పదేమో యని
మండలేశులగుండె మ్రానుపట్టె
ధనమిచ్చి చేదోడుగను నిల్చువారల
నదలింప నేతల యాటగట్టెఁ
బిఱికితనమున్న వారల వెలికిఁదీసి
గౌరవముగల్గువారలఁ గాలరాచి
చిత్రచిత్రమ్ములుగను హింసించి మించి
పరప్రభుత్వమ్ము నెల్లరఁ బంజపట్టె.

కం. కలిమికి లేమికి రెంటికి
నలఁగినవా రెదురుతిరుగు నాఁ డేలికలుం
గలఁత వహింతురు వీరల
బలమెచుఁడీ యుద్యతికిని బ్రాణప్రదమౌ.

కం. ఆసామికి భూస్వామికి
బాసటగా మాటలాడు వారియదనం
గాసటబీసటవై రెది
చేసిన దక్కోలుగారె సిలుగుల కెపుడున్.

కం. ఇది మూదలించి మేమీ
యదనున నుద్యమమునడుప నగునని పన్నుల్
మొదలంట నీయకుండని
విదితమొనర్చితిమి రైతువీరుల కెల్లన్.

కం. మా యలహాబాదున ముం
దీయుద్యమ మెల్లకడల కెగఁబ్రాఁకెఁ దుదిం
జేయూఁత నిచ్చి నిల్చిరి
పాయక గుజరాతివారు వ్యవసాయులకై.

తే. సాములకుఁ గూడు పెట్టు నాసాములకును
గష్టపడి యెల్లరనుగాచు కాఁపులకును
దారలోఁగూడి మనెడి సంసారులకును
గీడు వెదకెడివాఁడు కిగ్గాడిసుమ్మి.

ఆ. కమలఁగూడి తండ్రికడఁ గాలముం బుచ్చ
నరిగినాఁడఁ బట్టణాంతరమున
కాతఁ డపుడె కొంచెమారోగ్యముం గన
మురిసి తనిసినాఁడ మూఁడునాళ్లు.

కం. ఆ మూఁడునాళ్లు నామది
కామెత నొడఁగూర్చెఁ దండ్రి యంతటిదైవ
మ్మీమహి నెవ్వరు లేరను
సామెత నేనెఱిఁగి కంటి సంతోషమ్మున్.

ఉ. మాటలు వచ్చిరాని సుకుమారి కుమారిత కిందిరమ్మ కీ
పాటలు గొన్ని నేర్పి తిగవన్నెల కెక్కియమిచ్చి జేయనం
గాటముగాఁ బ్రతిధ్వనియగా వివరించెడిపట్ల మానసం
బూటలువాఱుచుండు జయహో యనుమాటకు మాటిమాటికిన్.

కం. వెనువెంటనె నిర్బంధము
నను నిల్పెదరంచుఁ దెలిసినను మానక నా
పని యిబ్బడి ముబ్బడిగాఁ
గొనసాగెను గర్షకాళిగోష్ఠిం దుష్టిన్.

కం. కనిపట్టెడు రక్షకభటు
లనవరతము వెన్నుగాసి యలమటఁ గూర్పన్
ననుఁజూడ జనకుఁ డిప్పుడె
చనుదెంచె నటంచు వింటి సంతసమంటిన్.

మం. అదిగదిగో తండ్రియరుదెంచె నంచు
వార్త లుబ్బగనె నిబ్బర మింతగూటి
పొగబండి నిలిచెడు పొలముచేరితిని
వైళంబ వేళవెంబడి బండిరామి
రారాక పోరాక యారాటపడితి
రైతుజనమ్ము లల్లాడుచు నుండె
వేళయయ్యెను సభావేదిక కింక
రాఁడేమి జహ్వారుఁడేడ రాఁడేమి

యనుధ్వనుల్ చెవుల ఖంగున మ్రోఁగుచుండె
నింతలో బండి మాయిరవు చేరినది
భయభక్తి వినయసంభ్రమము లొప్పార
జేయంచుఁ దండ్రికిఁ జేయెత్తి మ్రొక్కి
నిలువుగాళ్లను వాని సెల వంది పొంది
నోరారమాటాడఁ దీఱిక లేమి
వెనువెంటనే సభావేదికఁ జేరి
యావేశమునఁ బ్రొద్దుపోవు టెఱుంగ
కామంత్రణములఁ గార్యము పీటఁబుచ్చి
చనుదెంచు వేళ రక్షకభటుల్ వచ్చి
కారఁగూర్తుమటంచు గర్జిల్లినార
లామహాదృశ్యమ్ము నా మనమ్మందు
బీటలువాఱెఁ గంపించె మేనెల్ల
నేమిసేయుదు నాలి కీతెఱంగెల్ల
వివరించి తండ్రికి వినుపించు మంటి
నాజామునందె నైనీజైలునందుఁ
దిరిగి ప్రవేశించితిని శిక్షనంద.

# పన్నుల నిరాకరణము

కం. ఎనిమిది దినములు గడచిన
వెనువెంటనె నైనిబంది విడిదియయ్యో నా
మునుపటి మిత్రుల నందుం
గనుగొంటిని నలువురమును గలిసితి మచ్చోఁ.

కం. అలహాబాదునఁ గర్షకు
లలమటపడి సిస్తురస్తు లందీయఁగ శ
క్తులుగాక వెలుకఁబాఱియుఁ
గలఁతంబడి యొక్కచోటఁ గలిసిరి గుములై.

ఉ. వేసినవిత్తు వి త్తనముపీఁగి ఫలింపక నష్టపడ్డచోఁ
గాసినచేను బెండగిలి కష్టము చేతికి దక్కకున్నచో
మేసినయెద్దు కాఁడి మెడమీఁద నిడం దలవాంచియున్నచో
నాసలుదక్కి కాఁపు లడుగంటక నిల్తురె భూతధాత్రిపై.

చం. చదివెడువారు పెత్తనము సల్పెడువా రధికారదక్షులై
మెదలెడువారు బేరములమేకొనినిల్చెడువారు వడ్డికిం
గుదువలువెట్టు సొమ్ము వెస గుంజెడువారు సుఖోపభోక్తలై
యదలుతు రార్తినింబడి సహాయత యించుకలేని రైతులన్.

చం. శ్రమమొనరించి వచ్చినఁ బసాసడ నన్నములేదు నీతికిం
గ్రమముగ బాహ్యులైన సిరిగల్గినవారి పదానుయాయులై
సమయమెఱింగి వాఁగు నెఱజాణలు మేనుసెమర్పకుండ సౌ
ఖ్యములనుగాంతు రివ్వెడఁగుకర్జము లెప్పటి కెట్లు మాఱునో.

కం. కోలాహలదోహల మా
వేశం గావింపఁబడియె విడిచిరి నన్నా
వేళ హుటాహుటిఁ జేరితి
జాలింబడి వారికష్టచరితల వింటిన్.

కం. వశమైనదానిఁ జేయఁగ
యశమో మృత్యువో జయమ్మొ యపజయమో యీ
విశసనముకంటె మేలని
కృశమూర్తులఁగూర్చి యొక్కయెడ నిల్లింటిన్.

కం. మీసేవకు లుద్యోగులు
మీసిస్తుల నెల్లమెక్కి మేన్వొంచి యహో
గాసిల్లఁ జేయుచుండిరె
దోసమ్మని తలఁప రెట్టిదుర్బుద్ధులోకో.

కం. జోతల నెత్తెడువానిం
జేతులపై మోదు మొఱకుఁజేరి పదాంభో
జాతమ్ము లొత్తనేల వి
జేతలు లోపడినవారి సేమము గంద్రే.

ఉ. పన్నులనీయరాదు పరిపాలకవర్గము బాధగూర్ప నా
పన్నులరీతి పాదములపైఁ బడరాదు విదేశపాలనన్
మన్ననసేయరాదు గుణమాన్యులరై మను మీరు జాతికిన్
వన్నెయు వాసియుం గలుగ వర్తిలుఁడీ యని తీర్పరించితిన్.

శా. ఆతీర్మానము కర్షకోద్యమచరిత్రాధ్యాయమం దగ్ర్యమై
చేతఃప్రీతిని దృప్తినిం గలుగఁజేసెన్ నాఁడు తత్రత్యులా
రైతుల్ త్యాగధనాగ్రణుల్ తనుమనఃప్రాణంబు లర్పింప ను
ద్భూతోత్సాహముతో జయేతి నినదమ్ముల్ సేసి రవ్వేత్తుగా.

కం. జే జవహరిలాల్ నెహరూ
జే జనయిత్రీ మహాత్మ జే యను నులివుల్
వాజమ్ములనైన మహా
తేజస్సులఁ జేసి దిద్దితీర్చె నయారే.

కం. ఏలికల చెప్పుచేతల
బేలుఁదనమ్మంది నిలువభీతిల్లి మన
శ్శూల్యాలాయమానమగా వ్యథ
నేలా భరియించు బ్రదుకునీడ్చెదు వఱకున్.

ఆ. ఒడలువంచి కష్టమొనరించువాని క
న్గవకు నెఱ్ఱఁదనము గదిరెనేని
శాంతిపఱుప నెవఁడుచాలఁడు లోకమ్ము
లెత్తివచ్చి వాని నొత్తలేవు.

ఉ. ఆసభ నట్టియుత్సవమునందు మునింగిన నన్ను నప్పుడే
మోసలఁ బొంచియున్న భటముఖ్యుఁడు తీవ్రతరాంతరంగుఁడై
డాసి మహోద్ధృతిం జెడపడం బడఁదిట్టియుఁ జేతిసంకెలల్
వేసి పురోపవీధి నడిపించె జనమ్ములు మూఁగువాఱఁగన్.

కం. సలిచప్పిడిలేక ననుం
గొలుసులతోఁ బట్టి నెట్టుకొనిపోయి చెఱన్
నిలిపిన వృత్తాంతము నా
కులసతి జనకునకు వినిచి కూర్చె నలంతన్.

ఉ. కొంచెము వెచ్చనూర్చి మదికోలుకొనం దలయూఁచి యేమిభా
షించిన మత్తుగొన్న పరసీమనివాసుల కేవగింపుగా
మించె విరుద్ధవర్తనులమీఁదికి నేఁడిదె దండయాత్ర గా
వించెదఁ బ్రోత్సహించెద భువింగల సోదరజాతి నంతటన్.

ఉ. నేనిఁక రోగిగా నిలువనేర నుపేక్షయొనర్పఁజాలఁ గా
లూను నధర్మదేవత కహో యిడఁజాలను మంగళారతుల్
మానము గోలుపోయి కొఱమాలిన భారతజాతి కింక నా
ప్రాణమె దాస్యముక్తిపణమై యిలువారము నిల్చుగావుతన్.

తే. అనుచు ముందున్న బల్లగుద్దెను జనకుఁడు
దివ్యతేజమ్ము రూపమెత్తిన విధాన
పరమగంభీరమధురనిక్వాణవాణి
ఖంగుమని మ్రోఁగె భవనప్రఘాణమునను

కం. నులివెచ్చని నిట్టూర్పులు
పొలివోవని బీరములు విభూషలుగాఁగన్
దొలిమలి పలికినపలుకులు
తలఁపునఁబడి కమల మివులఁ దాల్మివహించెన్.

చం. ఉమిసిన శోణిత మ్మొఱకయుట్టటులూఁగు నలంకువన్ మహా
శ్రమ మధికమ్మునయ్యెఁ జెఱసాలనలంగిన దేహమింతగా
స్తిమితములేక యెంతగఁ గృశించునో యంచుఁ దపించుచుండ ర
క్తముపడు టాఁగిపోయినది తండ్రికి వేడుక తోడుపాటుగా.

కం. హెచ్చిన ధైర్యోత్సాహము
లచ్చెరువులమారి నోవి నణఁచినకతనన్
బచ్చిపగడంబు నిగనిగ
లచ్చునఁబోసిన విధాన నాతఁడు మెఱసెన్.

ఆ. ఓల మాసగొనిన యుమ్మినెత్తురుజబ్బు
తొలఁగె నంచు నులుకుబెలుకు మాని
నన్నుఁ జూడవచ్చె నాతండ్రి యాసుద్ది
నెఱుకపఱిచి తృప్తిపఱిచె నన్ను.

కం. తన వెనుకటి సామర్థ్యము
తనువున వెసలారె ననుచుఁ దలఁచి యహరహ
మ్మును నిలిచి శాసనోల్లం
ఘనమును నలుదెసలఁ బ్రాఁకఁ గావించెఁ గృషిన్.

శా. నే మున్నే సభ నెట్టిమాటల నకుంఠీభూతచిత్తమ్మునన్
సోమింపన్ దశదిక్తటమ్ముల వచింతున్ వాని నాకీతిగాఁ
దామై భారతభూమినల్గడల నుత్సాహమ్ముతో వాకొనన్
భామల్ పూరుషు లర్భకుల్ నడచి రభ్యామర్దబద్ధస్పృహన్.

కం. భాసిల్లు కంచుపదమున
నాసేతుహిమాచలమ్ము నంతట గొంతుల్
చేసేత వక్కాణించెన్
మ్రోసెన్ జయదుందుభులు సముద్వేలములై.

కం. బడిబడిని రక్షివర్గము
బడియలతో మోది భంగపఱిచి జనమ్మున్
మిడుఁగుఱులు గ్రక్కె నపు డా
మిడిమేల మ్మెమిచెప్ప మితిమీఱి చనెన్.

ఆ. ఐదువేలమంది యాయొక్కదినమందు
బందిఁబడిరి ముదము గ్రందుకొనఁగ
నీమహోద్యమమ్ము నీరీతిఁ దీర్పఁగాఁ
గారణమ్ము తండ్రిగాదె తలఁప.

కం. ఈ కార్యభారమునకుం
గాఁక పురాయించి సిరలు గదలినకతనన్
డోఁకులు మిక్కుటమై ము
న్నాఁకపడిన నల్ల యురలు టధికమ్మాయెన్.

కం. ఉడుకువ నిడు టవసరమీ
యడుగుపడిన మేనిబలిమి కగునే పనులీ
పుడమివిడి లాఁతినేలం
గడపుము నీవంచుఁ జీరకము వ్రాసితి నే.

చం. ఇది సరియైనకర్జమ్మని యెంచి సుహృత్తులు వైద్యబృందముల్
పదుగురు సేవకుల్ పయిపరామరికల్ పొనరించుచుండఁగాఁ
గదలె సముద్రయానమునఁ గాని శమింపదు నొవ్వటంచుఁ దాఁ
బదమిడెఁ గల్కటాపురిని బాడతెఁ దొల్లిటిసుస్థిరత్వమున్.

కం. వెనుకంజవేసె భయపడి
మనుగడలో ముం దిరోగమన మియ్యదియే
తనలావు తనువులావుం
బొనుపడెనని గుర్తెఱుంగు మూర్త మ్మిదియే.

ఆ. కల్కటాపురమ్ము గదలిన మాతండ్రి
కార్యభారమెల్లఁ గమలపూనెఁ
గమల నేను డక్కఁ గలకుటుంబంబెల్ల
వెంటనంటి చూచె వేఁడివెచ్చ.

వ. విదేశప్రయాణ ముజ్జగించి నాతండ్రి పంచాశద్వాసరంబు లాకలకత్తానగరమం దుండెను. మేము దలపెట్టిన మహోద్యమ మాశల నావరించెను,

కం. మారాష్ట్రము నలుమూలల
వీరాగ్రేసరులు నొకట విడియుట నన్నుం
గారాగారము చేర్చుట
ధీరత పెరరేచి యుద్యతికి మేలొదవెన్.

సీ. స్వాతంత్ర్యమనెడు నిక్వాణమ్ము విన్నంతఁ
బేలగింజౌ హూణపాలనమ్ము
మాకుటుంబము నామమాత్రమ్ము చెవిఁబడ్డ
ధుమధుమలాడు నుద్యోగిచయము
రైతు లుద్యమచరిత్రకు నాందియిడిరన్నఁ
గోపతాపములు గ్రక్కెదరు దొరలు
హెచ్చుతగ్గులు దుల్పనెంచితి మేమంచు
భూస్వామి మిడిగ్రుడ్లు బూరటించు
పాలకులు బంట్లు దొరలు భూస్వాములెల్ల
మతకులోన్మాదు లనుచరతతులు గాఁగఁ
గత్తిపట్టిరి మాచేయు కర్జములకు
సాయమొనరింప నెవ్వఁ డుత్సాహమూను.

మ పరదేశీయుల పాలనక్రమము సంభావించి యాత్మోన్నతిన్
ధరఁగాంక్షించుచుఁ బొట్టపోసికొను వార్తాపత్రికావ్రాతముల్
దొర లాడాడవచించు వాక్యములయందుం బొల్లుపోకుండఁగా
బరపంజూచును జూడవెన్నటి కసామాన్యప్రబోధమ్ములన్.

కం. మా రైతు సభ్యులెల్లరు
దూరగ్రామములు నడకతోనేగి మహో
దారులఁ గర్షకవర్యుల
నూరార్చి వచింతు రిట్టియుద్యమవిధులన్

ఆ. పసికి మేపులేక పసివాడె జనులకు
దోసెఁడంత గంజి దొరకదాయెఁ
జేవతప్పియున్న జీవాల తోఁపొద్దు
పనికి వెళవరైరి పాలకులును.

ఆ. మూఁడు నాల్గు వర్షములనుండి వర్షమ్ము
పడని కారణమునఁ బంటలేమి
పంటిబిగువుగూరి పౌరుష మ్ముడివోక
కాఁపు కాఁపురమ్ము గడపుచుండె.

కం. ఈతరుణ ముద్యమమునకుఁ
బ్రీతియు సమకూర్చె గుణగరిష్ఠుల్ శిష్టుల్
రైతులు తమనాయకులకు
జోతలనిడి నిల్చి రిద్ధశోభనమతులై.

కం. ఎన్నెన్ని బాధలున్నను
గ్రన్నన దిగమ్రింగి కరనిరాకరణంబున్
బన్నుగఁ జేసిరి నీతికి
వన్నె ఘటించిరి మహాత్మువాంఛయుఁ దీరెన్.

కం. మేమిట్టి బాధలకు గుఱి
యై మిడుకుచునుండఁ గొందఱయ్యలు తెగడం
గా మొదలిడి మమ్ముం బర
భూమీశానుగ్రహమ్ము పొందిరి సుఖులై.

సీ. బండమిండరిమాట లొండొంటఁ గడచన్న
నానందమునఁ దృప్తులైనవారు
చొల్లువాఱెడిమాటలెల్లఁ బ్రోవులువెట్టి
యున్నతోద్యోగులై యున్నవారు
చిటిపోటివాదముల్ పొటమరింపఁగఁ జేసి
పై చేయి మాదనిపలుకువారు
పలుకుపల్కునఁ దేనెలొలుక బోధలుసేసి
పరదేశములఁ గీర్తివడయువారు

భారతీయాళి పరదాస్యబంధనములఁ
ద్రెంపఁగా దుర్భరాగ్నిలో దుముకునాఁడు
హూణవిభుదత్త సద్బిరుదోప బృంహి
తాత్ములౌ వారు మనభూమియందుఁ గలరు.

కం. ఒకవేర దేశసేవక
నికరమ్మో గెలువ నిలువనీడయుఁ గలదే
మొకమెత్తనేల మనకని
యొకకొంద ఱుపేక్షసేసి యుండి రనాస్థన్.

ఆ. శ్రీనివాసశాస్త్రి శేముషీసామర్థ్య
మిట్టి వాదములకుఁ గట్టువడియె
వీనిఁ జూచి తక్కువెంగలివిత్తులు
తెల్లదొరల యండ నుల్లసిలిరి.

కం. ఆతరుణమ్మునఁ దరుణీ
వ్రాతము చెలరేఁగి బందిఁబడ నుంకింపన్
గాతరమంది విభుత్వము
మూతిముడించినది ధైర్యముం దిగజాఱన్.

కం. బహిరంతస్థితదుస్థితి
మహనీయంబైన దానిమహిమకుఁ గమలా
మహిళామణి తనమనమునఁ
దహతహపడె నుద్యమమ్ము తానై నడపన్.

ఆ. చూచిచూచి దొరలు వాచంయముల రీతి
నోదిగి యెంతకాల మోర్వఁగలరు
తుదకు బందిఁగ్రుక్క మది నిశ్చయించిరి
యది మదీయజాయ కాయెఁ దృప్తి.

సీ. ఒకమాటు విశ్వశాంతికి భారతీయుఁడే
యారాత్రిక మ్మెత్తునంచు నెంచు
ఒకమాటు భరతజాతికి దాస్యనిగళముల్
విచ్చిపోఁగలవంచు విశ్వసించు
ఒకమాటు నిల్వనేరక జాతిభేదముల్
సమసిపోవునటంచు సంతసించు
ఒకమాటు సమధికార్థికపుష్టి సంతుష్టి
పొదలఁగా గలవంచు మదివలంచు
ఒక్కమాటు జగమ్మెల్ల హుంకరించి
మారణాస్త్రంబు చేపట్టి మన్నిగొనఁగ
దురమొనర్పంగఁ బూనుచో భరతజాతి
నిలువఁగలదంచు నాత్మ నిశ్చలతఁ గాంచు.

కం. ఈభావావేశముతో
క్షోభించు మనమ్ముతో దిగుల్పడు పుత్రిన్
వైభవమున్ దిగనాడియు
శోభనమతియైన కమలచొచ్చెం గారన్.

కం. బాలోన్మత్తపిశాచవ
దాలోకనముం బొనర్చె నాంగ్లేయమహా
పాలకవర్గము, లోకము
హేలాహుంకృతుల దద్దరిలి ఘూర్ణిల్లెన్.

కం. మగవారు గారఁబడఁగాఁ
దగవా మగువలును వెంటఁ దవులక యింటం
దిగులుగొనియుంట యను న
మ్మిగతో వెనుకొనియె నను సమీహితబుద్ధిన్.

కం. ఆవేళ నొక్క లేకరి
పూవుంబోణికి సమీపమున నిల్చి మహా
దేవీ! సందేశము మా
కీవేయని యడిగె నింపుహృదయముతోడన్.

కం. ఆవేఁడిమిలోఁ దననిజ
భావము వెలికుఱికి యుండవచ్చును లేదా
భావినులకు సహజమ్మగు
భావన విడనాడ వలనుపడ లేదేమో!

ఉ. జీవితనాథుపాదసరసీరుహయుగ్మము నాశ్రయించెదన్
జీవితశేష మంకితముసేసెద దాస్యనివృత్తికిన్ భవ
ద్భావిజనాభివృద్ధికి యథామతి దేశపురోభివృద్ధికిన్
గావున వెల్గె నామదివికాస మపూర్వసుఖప్రబోధమై.

కం. పురుషుల నిరంకుశత్వము
తరుణుల దౌర్గత్య మణఁపఁ దలఁచిన చెలి యీ
కరణి నపుడట్లు పలుకుట
చిరధర్మములెల్ల మేన జీర్ణించుట నౌ.

కం. మును కమలానిర్బంధము
తనమనమును గాయపఱుపఁ దాఁ గలకత్తా
యనుపురము వీడిస్వస్థల
మును జేరఁగఁ దండ్రి యత్నముం బొనరించెన్.

తే. దారిలోనున్న నన్నొక్కసారి చూడ
నైని చెఱసాల కేతెంచినారు వారు
మాఱురూపమ్మువడి శక్తిజాఱిపోయి
స్వాస్థ్య ముడిపోయినట్లు నాజనకుఁ డొప్పె.

శా. ఏకైకమ్మయి యెల్లజీవములు మాయింపంగ మాఱొడ్డినన్
లోకేశుం డెదురొత్తి నిల్చినను భూలోకంబు కంపించినన్
జీకాకుం బడఁబోని ధీరవరుఁ డీస్వీ యిట్లు మార్పాటుగా
నాకన్నుంగవ యిట్టిరూపమును సందర్శింపఁ గొంచించెదున్.

కం. చలివేళ హాయిగూర్చెడి
నలహాబాదునకు నాతఁ డరిగెను జెయిలో
పలనున్న నేను మింటం
గల చిత్రమ్ములను గాంచి కాంతు ముదమ్మున్.

మా. ప్రత్యూషపవనాంకురముల త్రోపిళుల
కాషాఢమేఘమ్ము లల్లుకొన్న పుడు
మసిపాతఁ గట్టిన మాణిక్యమట్లు
వేగుఁజుక్కయు వినువీధి నున్నపుడు
తెపతెపతెక్కలార్చియు నిక్కి నిక్కి
కొక్కొరో యని కోళ్లు కూయుచున్నపుడు
కమ్మరికొలిమిలోఁ గణికల రీతిఁ
గీలితంబై యొప్పు కెంపులభాతి
నావలీవల దివ్వెలానంద మిడుచు
నరుణారుణచ్ఛవుల్ కురియింప మింటఁ
జనెడు విమానమ్ములను గాంచినంత
మామన మ్మానందధామమ్ము యగును
సాంగవేదవిదుండు చైతన్యభరితుఁ
డార్యుండు మదనమోహనమాలవీయుఁ
డాప్తుఁడై నెచ్చెలియై కారనిల్వ
మాకష్టములు మటుమాయమై నట్లు

## పన్నుల నిరాకరణము

తోఁచి సంతోషమ్ముతో నుంటి మచట
దేశదాస్యముదీర్ప దీక్షవహించు
యువసింహముల నెత్తురోలుక శిక్షింపఁ
గొరడాల దెబ్బలకును బలిచేయు
వార్తలు మాచెవింబడ నొడల్ మండు
నాను గాదనుశక్తు లాఅడిపోవ
శౌర్యధైర్యములు ముచ్చుముణింగిపోవ
నిలిచియుందుము బంధితులమైన మేముః.

# జనక నిర్యాణము

కం. పలుబాముల నంది మహా
త్ములు భారతవీరవరులు మొనగట్టిరి హూ
ణుల పరిపాలన మిచ్చో
వలదని తీర్మానములను బంపిరి దృఢులై.

కం. స్వాతంత్ర్య వార్షికోత్సవ
మాతటి జనవరియు నిరువదాఱవ తేదిన్
ప్రీతిగ జరిగెను సభ్య
వ్రాతము నావేళ విడిచివై చిరి విభులున్.

ఆ. బందినున్న నన్నుఁ బరికింప వచ్చిన
తండ్రిమొగము నెడఁదఁ దగిలి యుంట
వేగిరమ్ముపడితి వెనువెంట నింటికిఁ
జేరినాఁడఁ దృప్తిఁ జెందినాఁడ.

కం. జాతీయసభాస్తారులు
మాతండ్రిని, వృద్ధు, సుగుణమండను గనఁగాఁ
జేతము లుప్పొంగంగా
నేతెంచిరి భక్తిపూర్ణహృదయాబ్జములన్.

చం. వెనుకటికన్న మిన్నయగు వేఁకి బెడంగునఁ గ్రుంగి నోటమా
టను బెకలింపలేక యెదుటంబడువారిని గన్ను సన్న సో
బనముల నెచ్చరించుఁ బయివారి కిటన్ మరియాదలెట్టులో
యనిననుఁ జూచు మాఱుమొగమై బుసకొట్టు వగర్పు నెవ్వగన్.

ఉ. ఓపిక బిగ్గఁబట్టుకొని యూఱడిలున్ మొగముబ్బరించి రా
రాపులఁజిక్కి నీరుదిగు రత్నమురీతి వెలుంగు మృత్యువుం
గోపముతో నెదుర్కొనఁగఁ గోరుఁ బురాతనమైన రీవికిం
బ్రాపయివెల్గు మానసముమాత్రము మాఱుపు లేదొకింతయున్.

కం. వెనుకటి యుచ్ఛ్వాశ్వాసలు
మనశ్శరీరముల నెంతమాత్రము విడువం
జనలేక నిలిచెఁ బొలియక
కను లోఁగక పెట్టినట్టికోటలు వోలెన్.

కం. తనయల్లుని రంజితుసిం
గనుఁగొనకున్నట్టి బాధ గాఢతమంబై
వెనుకొన నారాటంపడు
ననుఁగని యూఱటవహించు నాజనకుఁ డెదన్.

చం. నసిచెడి దేహసౌష్ఠవము జాఱి వికారపురూపుతోడఁ దా
విసవిసమైననాఁడు పలవించుచు దర్శనమాచరింపఁగా
విసువు విరామముంగొనక వేనకువేలుగ దేశసేవకుల్
ముసిరిరి, వారిఁ గాదనఁ డపూర్వమహోత్సవ మంకురింపఁగా.

చం. కలిగిన మిత్రబాంధవనికాయము ముమ్మరమైన భక్తితో
సలుపు జోహారువుల్ గొనుఁ బ్రసన్నముఖమ్మున నాదరించువా
రలఁ, బుయిలోటతోడను బరామరిసించును రానివారిలో
పల మనగాంధి బందివిడువం బడలేదె యటంచు వాకొనున్.

చం. చివరకు గాంధిదర్శనముచేసి మనోవ్యథలెల్లఁ దీఱఁగా
శ్రవణసుఖమ్ముగా భరతజాతిమహోన్నతరీతినుండఁగా
నవిరళదీక్షతో మను మహాత్ముల వాఙ్నివహమ్ము లన్నిటిం
దివిరి వినంగఁగోరు నిదిదీర్పఁగ భావనసేయు నాతనిన్.

చం. నిదురయుఁ గూడుఁ బోవిడిచి నెచ్చెలివచ్చెనె యిప్పుడిచ్చటం
బొదలినయట్టులున్నదని ప్రొద్దును బోయెడిదాఁకఁ గన్నులం
గదలుపఁజేయు వీలయిన గట్టిగవచ్చెడువాఁడె యేమిటం
గొదువ జనించెనోయని దిగుల్పడు డీల్పడు జాలిచూపులన్.

చం. అదవదయైన భారతమహాజనయిత్రిని నుద్ధరింపఁగాఁ
బదుగురఁ గూడఁగట్టుకొను ప్రాజ్ఞుఁడు గావలె సత్యశౌచసం
పదల కనావిలుండయిన మాన్యుఁడుగావలె గాంధిదక్క యి
య్యదనున లేఁడొకం డిట సమర్థుఁ డటంచుఁ దలంచె నేమొకో.

ఆ. నెనరుతోడ మేలుకొనియున్న నాతండ్రి
యెడఁద శాంతిపడఁగ నడికిరేయి
గడచులోన నింటఁగాలిడె బొంబాయి
వీడి యిట్టివార్త వినినకతన.

కం. కనుఁగొనిన నాదు జననీ
జనకుల మనములను ముదము సంధిల్లె సుహృ
జ్జనములను గాంచినంతనె
ననుపువడుంగాదె ఘనమనఃప్రమదమ్ముల్.

ఆ. ఒకటిరెండు దినములకు బందివీడిన
వారలెల్ల నలహబాదుచేరి
మంచిచెడ్డలెల్ల మాటాడి మాయింట
సభను నెరప ముదముచాటి రపుడు.

కం. ఆసభను దలనుదూర్చుట
కే సమయము చిక్కదాయె హృదయములోనన్
వాసించునూహ బగళము
సేసితిఁ గార్యాంతరములచే విసువెత్తన్.

కం. శాసనధిక్కారమ్మును
జేసినఁగా కెదిరి దుష్టచేష్టితములకుం
గాసిల్లు టెంతవఱకని
వ్రాసిరి తీర్మానముల సభాజను లచటన్.

చం. పనివిననేగుదెంచిన సభాజనముఖ్యులనెల్ల వ్యాధిచే
వినిహతుఁడయ్యుఁ దండ్రి యొకపీఠిని గొంతుకకూరుచుండి యో
ర్మినిబిగఁబట్టి కందుకము రీతిగ నుండెను జూచువారికిన్
మునుమును దానె వంగి కయిమోడ్పు నొసంగె వినమ్రభావుఁడై.

చం. కనులను నవ్వుల న్నొసటఁ గంపితశీర్షముతోడ సేమమా
యని మును హెచ్చరించుఁ బలుకాడఁగ గద్గదకంఠనిస్వన
మ్మున సమకట్టు మృత్యుముఖముం జొరఁబాఱియు రాచఠీవికిన్
మినుకులు దిద్దునట్టు లుపమింపఁగరానియటుల్ వెలింగెడిన్.

చం. పెదవినివిప్పఁ గప్పురపువిప్పులు విప్పినరీతి చేతముం
గదిపెడు పల్కుపల్కునెడఁ గర్ణరసాయనమైన బాతి స
త్పదముల వాఙ్ముఖమ్ముల నొసంగిన సంపెగపూలవాసనల్
పొదిపినపోల్కినుండు గుణపూర్ణుఁడు నేఁడిటులాయె నక్కటా.

సీ. పులివాతఁబడి స్రుక్కుపొలపరి చందాన
వానలేకనలంగు పైరుసౌరు
కవచమ్ములేని యోధవరేణ్యు నట్టుల
నడుముగ్రుంగిన మిడినాగు కరణి
పెనుగాలివలనఁ గంపించు బూరుగుపోల్కి
చిలుమారగించిన జీవిరీవి
మిడిబోనులోఁబడ్డ మృగరాజముంబోలె
ఱెక్కలూడిన పక్కిఱేనిపగిది

మృత్యుముఖమునం దమేయసామర్థ్యమ్ము
వెలువరించి తుదకు వీఁగిపోయెఁ
గాని రాచఠీవి గారవ మ్మిసుమంత
తగ్గలేదు కాంతికగ్గలేదు.

చం. అతనిఁ బరీక్ష చేసి హృదయవ్యథ యిట్టిదటంచుఁ జెప్పఁగాఁ
జతురులుగల్గిరేని యదిజాతికి నీతికి మూలకందమౌ
వితయిసుమంతఁబోవని పవిత్రతమమ్మగు గ్రంథమౌను స
భ్యతకును మూలమౌను బరపాలనకద్ది మహోగ్రరూపమౌ.

ఉ. గొంతు పెకల్చి చెప్పుటకుఁ గొంకరవోవుచు రుద్ధకంఠుఁడై
వంతనలంగుఁ గాగితముపై విలిఖించు హృదంతరమ్మునన్
సంతనకట్టునూహల విచారము దూరమొనర్పనెంచుఁ దాఁ
జింతను వేదనావశవిశీర్ణమతిన్ గడు డిల్లపోయెడిన్.

ఉ. జీవితమే స్వతంత్రరససిద్ధికి బద్ధమొనర్చియుం బరీ
భావమునోర్చియుం బడుగువైఖరి బందినిమ్రంది జాతినిం
దావకొనందలంచు పరదాస్య మదల్పఁగలేక మృత్యుసం
భావితమూర్తినై తినను వంత మనమ్మునఁ గ్రుమ్ములాడెనో.

ఉ. నేనిఁక నిల్వనేరనను నిశ్చయముం బొనరించుకొంటిఁ బ్రా
ణానిల ముగ్గఁబట్టితి మహాత్ముఁడవీవు సబర్మతీమహా
స్థానఋషీ! భవత్కృతవిధానము సర్వఫలప్రదమ్ము నీ
యానతినంది నిల్తురు మహామహు లున్నతకార్యధూర్వహుల్.

కం. అని తనమనమున నావే
దనము బహిర్గత మొనర్పఁ దాపము దీఱెన్
ఘనమిత్రసన్నిధానము
తనుపఁగ మనుపఁగను బెన్నిధానము గాదే.

ఉ. వచ్చిన బంధుమిత్రబుధవర్గములుం దుదిమాపు మాచి గో
ర్వెచ్చని కంటినీట నురకీకృతులై పయనించి రెంతయున్
మచ్చికకల్గువారు చనుమానముగల్గినవారు పోవఁగా
నచ్చనివారు మాత్ర భవనమ్మున నిల్చిరి కాళులాడకే.

ఆ. ఆమయమ్ము లుమపు నన్నారి, గాంధియు
రమ్యగుణుఁడు జివరాజమెహత
మొదలుగాఁగ మిత్ర ముఖ్యులు చుట్టముల్
నిలిచియుండి రాత్మ లలఁతపడఁగ.

కం. చలపట్టినట్టి నలుకువ
దులుపఁగఁ దగినట్టి వెజ్జు దొరకమి శస్త్రి
దులును చికిత్సాయంత్రము
లలవడమిని వంతగదిరె నాత్మలయందున్.

కం. చిరపరిచితిగల లక్నో
పురమున నాథునికి యంత్రములునుగల భిష
గ్వరులుంటఁ బయనమైతిని
దరిసింపఁగఁగోరి తల్లిదండ్రులతోడన్.

వ. మాతల్లి, కమల, గాంధియు నొక మోటారులోను నేను మా తండ్రియుఁ బితృపాదుల కిష్టుఁడు పనివాఁడునగు హరియు నొక మోటారులోను ప్రయాణ మొనర్చితిమి. రంజితు మా వాహన చోదకుఁడై మివుల నిబ్బరముగ నడపుచుండె.

కం. సుకుమారమైన తనువును
దికమకలుంబెట్టె వ్యాధితీవ్రత యాపై
సుకమింత లేని యాన
మ్మిక నలసటఁగూర్చె రుజయు వృద్ధియు నాయెన్.

కం. ఎదిరించుశక్తి తనలో
మొదలంటనశింప ముచ్చముణిఁగిన శాంతిం
గదిరెనని మేము దలఁచితి
మది రోగోద్ధతికె మూలమయ్యెఁ దలంపన్.

కం. అడుగడుగు గండమయ్యెన్
బుడిబుడి కఫముడిగి యెక్కిపోవుచునుండన్
బొడవడఁగినట్లు తేజ
మ్మూడిపోయినయట్లు రూపముండెను శయ్యన్.

కం. రాతిరి నిదురింపక బా
ధాతతిచే డొంకడొంకి డస్సి యుడుకువన్
బ్రాతఃకాలమ్మునయం
దాతఁడు సుస్థిరతఁగాంచినట్టులఁ దోఁచెన్.

చం. శ్రమమడుగంటఁగా ముఖము శాంతికిఁదావలమయ్యె నింక మా
కమవసరేలు దాఁటిచనెనంచు మనమ్మునసంతసించి నే
భ్రమపడియుంటి నాజనని పక్కన కెవ్వున కేకవేసి నే
త్రములముడించి తండ్రిచనెరా! కొడుకా! యని కౌఁగిలించె నన్.

మ. జననంబాదిగ నింతమట్టుకును సంసారవ్యథల్ నన్ను మూ
ర్కొనలేదెప్పుడు దల్లిదండ్రుల యనుంగుంబిడ్డనై స్వేచ్ఛగా
మనుదు న్నేఁటికిఁ దల్లికౌఁగిటబిగింపన్ బాహ్యాబంధమ్ములున్
ననుముట్టెం బితృహీనుఁ డెంతబలహీనప్రాభవుండో కదా!

చం. చదివిననాఁటనుండి పయిసం గడియింపక మూలముల్లె నా
బ్రదుకున వెచ్చవెట్టినఁ గృపంగని మాఱటపల్కు పల్కఁగాఁ
బెదవిని విప్పఁబోవని గభీరుని ధీరుని గోలుపోయితిన్
జిదగోదయాను జీవితవిశేషము ప్రాపక మొల్లఁబోవుటన్.

చం. ధన మదియున్న నెల్లపుడు ధైర్యముఁ గొల్పెడు పుత్రపుత్రికల్
ఘనముగనున్న సౌఖ్యము లఖండముగా వరియించియున్న జ
వ్వన మడుగంటి యున్న జనవంద్యము జీవితమున్న నెందునున్
వనితకుఁ దోడునీడ నిజవల్లభుఁ డారయ ధారుణీస్థలిన్.

మ. కనులం జిందిన వశ్రుబిందువులొ రక్తస్నిగ్ధపుంబిందులో
మన మెప్పాట సహింపఁగాఁ గలిగెనో మాతృస్వరూపమ్ము చీ
ల్చెనుబో నాయెడఁదన్ జగేలుమనిపించెం గన్నుదోయిన్ గతు
క్షన నాగాంతుక కొయ్యవాఱినది పల్లుంబల్కఁ గొంచించుచున్.

చం. అదవదయైనమానసము నంతకునంతకు వ్రక్కలింపఁగాఁ
బదనువహించె శోకము కృపంగనువా రెవరింక నన్ను నే
నదలిచికొంటి మజ్జనని కాత్మవిచారము దూరమానటుల్
చదురులుగొన్ని పల్కితి నలందురువారల సేవదేర్చితిన్.

కం చిరనిద్ర లేప నెవ్వఁడు
పరముఁడు దేహమ్ము నిలుపవచ్చునె దానిం
గుఱుతెఱిఁగియుండి యోరువ
తరమా! బంధమ్ముఁ దెంపఁ దరమా జనికిన్.

కం. ఆదినమే శకటముపైఁ
బ్రోదింగొనఁ దండ్రిశవముఁ బూనిచి యలహో
బాదును జేరితి మంతటఁ
గాఁదగు కర్జముల సలుపఁ గడఁగితి మచటన్.

ఉ. వందలు వేలు లక్షలును వచ్చిరి వైజను లొల్లఁబోయి రా
క్రందనముల్ పొనర్చిరి జగా మొనగాఁడని సంస్తుతించి ర
స్పందితనేత్రులై తమ విచారము దెల్పిరి మానముద్రతో
బంధులకంటె మిత్రులు కృపారసధారలు చిల్కరింతురా.

సీ. జాతీయ విజయ ధ్వజమ్ము గ్రమ్మిన శరీ
రమ్ముపై పూలహారముల నిడిరి
కాశ్మీర కస్తూరికా గంధసార నీ
హారవారుల మనసార నిడిరి
ఫుల్లాబ్జ మల్లీమతల్లికా పుష్ప సం
దోహమ్ములం దొప్పదోఁగ నిడిరి
అమ స్తకన్య స్త హస్తాబ్జ ధృత దివ్య
భవ్యాక్షతలను సద్భక్తి నిడిరి
నేను నేనని భాగీరథీ నదీ త
రంగ సంఘట్టితస్థల ప్రాంగణంబు
చేరి శ్రీగంధకాష్ఠ కర్పూర పూర
చితి సమాయత్తఁ జేసి రేధితులు హితులు.

ఉ. బారులుదీఱినిల్చె జనవర్గము నాఁడది వల్లకాడుగా
నేరికిఁ దోఁచదాయె సభయేయనిపించెను దేశసేవకై
దారుణదీక్షఁబూని బహుధాప్రయతించి శరీరమర్థమున్
ధీరతనప్పగించిన సుధీవరు నంతిమపూజయాటచే.

ఉ. నమ్మినసత్యమున్ జనమనంబులనాటవచించుపట్లఁ జి
త్తమ్మున సంశయంపడని ధార్మికుఁ డితఁడొకండె మాతృదే
శమ్మునకై కుటుంబమును సర్వము నప్పనముంబొనర్చె స
త్యమ్ముగ నీతఁడొక్కఁడె యటంచు వచించిరి సర్వమానవుల్.

ఉ. ముప్పదిమూఁడుకోట్లజనముం బ్రియమందఁగఁగొల్వఁ గంకణ
మ్మొప్పుగఁదాల్చు మాభరతయోధుని గట్టెలమెట్టుమీఁదికిం
గుప్పనఁగూరగా నిటులఁ గూర్పఁగవచ్చె శరీరధారికిం
దప్పదువో యొకప్పుడయినం జితిఁజేరుట, నిల్చుకెట్లగున్.

ఉ. ఏమని పాడనేర్తు మిది యేమియహో దురదృష్ట మగ్నికిం
గామితమయ్యెఁగా బహుగుకాయము నేఁటికటంచుఁ గన్నులం
బ్రామిన నీరముంగల సమస్తజనమ్ములు చూచుచుండఁగా
ధూమముతోడ రక్తిమముతోడ వెలింగెఁ గృశానుఁడీసుఁడై.

చం. కనులుమునుంగు నీరుబుకఁగా మనగాంధిమహాత్ముఁ డచ్చటన్
జనములఁజూచి మీకిది విచారముగొల్పెడు కాలమైన నె
మ్మనముల దీనిపిడె యభిమానముగల్గినవారు కీర్తికై
కొనుఁడు స్వరాజ్యముం గొనెడుకోరికతో నదియాత్మశాంతియౌ.

కం. అని యుద్బోధము గావిం
చెను నచ్చటిజనము మెచ్చి జేజే నాథ
మ్మొనరించె నింటి మొగమై
చనితిమి మేమెల్ల ధైర్యసారము దుల్లన్

కం. ఆకాశాంచల వీధులఁ
బ్రాఁకెం దారకలు నిప్పురవ్వల రీతిన్
మాకన్నుఁగవఁ గట్టిన
పీఁకం బ్రాక్పశ్చిమములు వెలిఁగె నరుణిమన్.

మం. దేశదేశములు తంత్రీనాదమూల
ముగ సానుభూతుల నగణితమ్ముగను
మా కుటుంబమునకు మా తల్లికనిపె
సమసిన మాతండ్రి సత్యప్రియత్వ
మును శౌర్యధైర్యమ్ము ఘనముగా వ్రాసి
నెగులెల్లఁదీఱ సందేశమ్ము నొకటి
మనసారఁబంపి రిర్వానుదంపతులును
వారి యౌదార్యమ్ము వారి సంప్రీతి

వారి దయోపేత వాత్సల్యమునకు
మా కుటుంబమ్ము సంబరమందె మిగులఁ
పాఠశాలలును వ్యాపార సంస్థలును
ఘనమైన యుద్యోగి గణము మాపాలఁ
బ్రీతితోడుత సానుభూతిఁ జూపించెఁ
పల్లెపల్లెను నెల్ల పట్టణమ్ములను
గుమిగూడి జనులు దుఃఖము దెల్పు సభలఁ
గావించిరని పత్రికాముఖమ్మునను
బరికింప నఱిముఱిపడుచు సంతాప
మడుగంటిపోయె నెక్కుడు హాయిగూర్చె
హృదయ వ్యథలనెల్లఁ దుదముట్టఁ దుడువఁ
జాలు గాంధీ సమక్షమ్ము చేకుఱుట
శాంతి చేకూరె మా సంసారమందు.

# డిల్లీ సంధి

కం. నాజనకుఁడు మరణించిన
రోజున బొంబాయి రేవులో డిగి చూడం
గాఁ జనుదెంచిరి కూర్మియు
సాజముగా శ్రీనివాసశాస్త్రియు సప్రుల్.

కం. ఆ యా రాష్ట్రములంగల
నాయకులెల్లరును గృహమునందుండుట ని
ర్ణాయకవిషయమ్ములఁ ద
చ్ఛాయల నెఱిఁగింప సమ్మదము చూపి రొగిన్.

కం. మునుము న్నెడింబరో లోఁ
దనజెప్పిన వాక్యములను దడవి విచార
మ్మును దెల్పి వాక్పటుత్వ
మ్మొనరు నుపన్యాసమిచ్చె నుత్సాహమునన్.

కం. మాటలమార్దవ మెడఁదల
నూటాడఁగఁ జేయు వలఁతు లొప్పుందప్పుం
బాటింపరు టాటోటుల
గాటముగాఁగుప్పి మెప్పుగాంతురు సభలన్.

చం. ఇదియిదమిత్థమంచు వచియింపరు, గౌరవసభ్యుఁడొక్కఁ డి
య్యదిపలుకాడె నింకొకమహామహుఁ డయ్యదిపల్కెనంచుఁ బ
ల్కుదు రధికారదర్పములకున్ మొగమోడి యథాతథమ్ముగా
మదులకుహత్తునట్టు లణుమాత్రము చెప్పరు సభ్యులెవ్వరున్.

ఉ. గౌరవమందనెంచి యధికారులకుం దలవంచి ధర్మవి
స్తారకమైన మార్గము యథార్థము సుస్థిరమైన పక్షమున్
మాఱుపు నొందఁజేసి యభిమానము గోల్పడి సారహీనులై
భారత సుప్రతిష్ఠ మితవాదులు బూదిమొనర్చి రెంతయున్.

ఉ. నూటికి నూరుపాళులు వినోదము మోదముగూర్పఁజాలు నా
మాటలలోఁ జమత్క్రియలు మానసముల్ పులకింపఁజేయు మో
మోటము గూర్పఁజేయు సుఖముం గనుపింపఁగఁజేయుఁ గాని యె
ప్పాటనుజూడ నందుఁ గనుపట్ట వొకించుక సత్యశౌచముల్.

ఉ. నేరిచి నేరకున్న యవనీపతి భృత్యుల రాయబారముల్
భారములయ్యె గాంధిని సభాభవనమ్మునఁ జూడ నిర్వినుం
గోరికచూపె దానిఁ గయికో లొనరించెను గాంధి సర్వసం
భారముతోడఁ గూడి రిరువంకల వార లవారితత్వరన్.

చ. ఫల మిసుమంత లేదనుచు భావమునం గుఱుతించి సంధికిం
దలపడె గాంధి శత్రువుల ధైర్యముతోఁ గలియంగ వారికిం
గల నిజరూపముం దెలియఁగాఁ దనయోరిమి చూపఁగా, మహా
త్ములకు విషాదమోదములతోఁ బనిలేదు వినిర్ణయమ్ములన్.

కం. తనవిశ్వాసమె కవచము
తన ధర్మమె యాయుధమ్ము తన సత్యమ్మె
వెనుకొను బలఁగ, మహింసయె
ఘనసేనాపతియాచు ముందుగాఁ గనుపించున్.

కం. సౌశీల్యనిధులు విబుధుల
యాశీర్వాదమ్ములే జయధ్వనులై యా
వేశమ్ముగూర్ప విజయ
మ్మాశించెను ధర్మనిర్వహణ రణభూమిన్.

కం. శమ మాధ్యాత్మిక పరిణా
మము సౌహార్దమ్ము ధర్మమార్గ మ్ముద్రే
కము గల్గువారి హృదయ
భ్రమములఁ బోనడఁచి శాంతిపఱచుం గాదే.

కం. అతిశీతల మృదుభాషల
సత మభ్యాసమ్ము చేయఁజాలిన చతురుం
డితరుల హితముం గోరును
మతిమంతుండౌను విడుచు మాత్సర్యమ్మున్.

కం. కువిమర్శన సువిమర్శన
లెవిచేసిన నొక్కరీతి హృదయముతోడన్
భువినిలిచి శత్రుమిత్రులఁ
గవలుగొనం జూచువాఁడు గడు నుత్తముఁడౌ.

కం. పటు సాహసిక్యమున లం
పటమందుటదక్క నొందు వైభవ మెపుడుం
బొటమరిల దాధిబాధా
చ్ఛట లుడుపఁగ శాంతి మేలిసాధన ముర్విన్.

ఉ. కాదని వాదుసేసెడి జగా మొనగాఁడు మహాత్మునన్నిధిన్
బాదము మోపి వానిచిఱునవ్వున కగ్గముగా మతేమియున్
వాద మొనర్పఁబోవఁ డథవా వచియింపఁగ నిబ్బరించినన్
బాదులుదప్పి కర్కశత పాడఱు మాఱు విధేయచిత్తుఁడై.

సీ. సతతమ్ము జయభేరిచఱచు సామ్రాజ్యమ్ము
లొంగఁబోదని లో నెఱుంగువాఁడు
వంగదేశమ్ము జీవచ్ఛవమ్మై మహా
ర్తిని బ్రుంగినట్లు గుర్తించువాఁడు

ఆసేతుశీతాచలాంతభూభాగమ్ము
బలహీనపడెనంచుఁ దెలియువాఁడు
తనతోడఁ భేదించు పనికిఁ గంకణమూని
హింసించువానిఁ బ్రేమించువాఁడు
గిరులు పాదులుసెడి యొడ్డగిలినఁ గాని
శాంత్యహింసల నిల్వఁగాఁ జాలువాఁడు
మనమహాత్ముఁడు సంధిమర్మము నెఱుఁగక
నిలుచునా యని శాంతినందితిమి మేము.

ఉ. అభ్యుదయమ్ముగోరిన మహామహు లార్థికశాస్త్రవేత్తలా
సభ్యులు మెచ్చఁగాఁదగిన శాసనధిక్కృతి శాశ్వతమ్ముగా
మధ్యము పెట్టకే నిలుపుమార్గముగావలె దానిఁ జూచుఁడీ
యభ్యుపపత్తి నాదట ధరాధిపవర్గము మీకుఁ గూర్చెడిన్.

చం. పలువురు గూడిమాడి యొకపట్టున దౌష్ట్యము లాచరించుచో
నిలువునఁ గ్రుంగిపోవు ధరణీపతులెవ్వరు సింహపీఠిపై
నిలుతురు చెప్పినట్లు విననేరనివారి నదల్పలేని మా
సెలవున క్షేప్రయోజన మిసీ యనె నిర్విను శాంతిదూతతో.

కం. వెటకారపు మాటలకుం
గటకటవడి గాంధి తెల్విగలవారలు మీ
రిటులాడ నేమి పల్కుదు
మెటు నిల్వఁగఁగలము చెప్పఁ డీరలు మాకున్.

చం. కలిగిన యస్త్రశస్త్రములు గాడుపడం దుదకొక్క టెక్కువ
న్నిలిచెను దానివీడి మననేర్తుమె వేఱొకదిక్కు మాకిఁకం
గలదె భవత్ప్రసాదమునకై మిసిమింతులమైన మమ్ము మీ
రలజడిపెట్ట ధర్మమగునా యని గాంధి వచించె నిర్వినున్

కం. ఉత్కంఠకలుగు మీరా
పత్కాలముగాఁగ నిపుడు భావించినచోఁ
దాత్కాలికమ్ముగా సం
పత్కరమౌ దీని విడువవచ్చును మాకున్.

కం. మేలైన కాలమున నీ
యాలోచన లెల్లఁ జేయనగునని తీర్మా
నాలం గావించిరి వా
రోలిన్ మాకెటుక పలికిచి రుత్సాహముతో.

చం. కులమత తత్త్వవాదులకు గుండెలఁ గుంపటియయ్యె గాంధితోఁ
జెలిమి వహింపకున్నఁ గడుసేగి యటంచుఁ దలంచి రంత మా
నిలుకడ కేగుదెంచి తమనిర్ణయ మిట్టిదయంచు సన్నుతుల్
పలికిరి మేలుగీళ్ళ నిలువంగలమంచు వచించి రావృతిన్.

చం. అవసరమైనచో బడుగులై పదయుగ్మము నాశ్రయింతు రా
యవసర మింతదీఱుతఱియైనను జుట్టును బట్టుకొందు రీ
యవమతులైనవారు మరియాద నెఱుంగరు ద్రవ్యసంచయ
మ్మవగతమైననాఁడు విడనాడఁదలంచెద రెట్టివారినిన్.

కం. "క్షోణి ననిత్యాని శరీ
రాణి" యనుచు సభలలోన ఱంపిల్లుచు గీ
ర్వాణులఁ గొల్తురు నిజపా
షాణసదృశ హృదయములను జాలరు మార్పన్.

కం. పసిగట్టి వెంటనంటుచు
ముసిముసినవ్వులను మోసముం గప్పుచుఁ దా
రసురుసురై యధికారము
మెసవఁగఁ జూచెదరు మేలుభ్రమింగుచు ధనికుల్.

కం. చిఱునవ్వు వెన్నెలలకుం
గుఱికావించెదరు నరులఁ, గోరినధనముం
గురియించెద రటుమీఁదట
మఱచెద రదిగడవ నీతిమాలిన జాల్ముల్.

కం. ఏవా రధికారమ్ముల
తావల మందుదురొ వారిదయ వడయుటకై
జీవచ్ఛవాల కైవడి
దేవురుగొట్టుల విధానఁ దిరుగుదురు దిశల్.

కం. ప్రాతర్వేళల భారత
మాతను గొనియాడి వర్తమాన భవిష్య
ద్భూతమ్ములఁ దగు కర్జము
లాతఁడె నరయుదును గాంధి యండను నిలువన్.

కం. స్వాతంత్ర్యానంతరమున
జీతము బత్తెమును గొనని సేవకులై వి
ఖ్యాతి నొనగూర్చు సభ్య
వ్రాతము జాతీయయోధ వర్గము వలయున్.

కం. పదవులకై యెగఁబ్రాకెడు
మదులను స్వార్థమ్ము బలిసి మానవతత్త్వ
మ్మదువలగువార లదుముదు
రది దుదకుం గీడు గూర్చునని గాంధి యిటన్.

చం. అది సరియైన మార్గమని యప్పటి కిప్పటికిం గుదుర్పఁగాఁ
గుదురదు దేశదాస్యమును గూల్పఁగ నెత్తురులోడ్చు వార లా
పదముల నిల్వకున్నఁ గలవారలు బీదల కష్టనష్టముల్
విదితముగానివారు పదవిం బరిణద్ధులుగారె ధారణిన్.

ఉ. తన్నిన మొత్తినన్ విడనిధైర్యముతోఁ బరుషోక్తులాడినన్
విన్నదనమ్ము గ్రమ్మని వివేకముతో జనులెల్ల భోగముల్
విన్ననువొప్ప నడఁగను విందొనరింపఁగ నిల్చి ప్రాణమున్
జన్నియగట్టినట్టి గుణసాంద్రులు రాజ్యము విటిఁబుత్తురే.

కం. తా నాధ్యాత్మికసంపద
మానవత న్నిల్పి నిందుమనమున నుండన్
బూనికి కూరిమి యోరిమి
తానకమైయున్న సంతతము సంతసిలున్.

వ. 1934 సెప్టెంబరు 17 వ తేది నొక ప్రకటనముం జేసెను– అందు.

సీ. మొలకు మూరెఁడుగుడ్డ ముక్క–చిక్కని నిఱు
పేదమానుసులు జీవించుచుండఁ
గలిగంజిత్రావి డొక్కలు స్రుక్క నన్నార్త
లిట్టులమ్మగను జూపట్టుచుండ
రేవగలనక తీఱికలేక కష్టించి
కూలినాలిజనమ్ము కూలుచుండ
వెలివేయఁబడిన జీవితమెల్ల వితగాఁగ
వేసారువారు గాన్పించుచుండ
బట్ట తిండి తీఱుబడి సత్కులమ్మును
బెచ్చుపెరుఁగ విఱ్ఱవీఁగ లేను
సోదరులకు దారిచూపింప నేనందు
నొక్కరుఁడుగ నొదిగియుందు ననియె.

తే. కలిమిగలవారు ధర్మకర్తలుగ మెలఁగి
నలఁగిపోయిన యన్నదమ్ములను గలిసి
బ్రదుక సౌఖ్యమ్ము వారెట్టయెదుట నిలువఁ
గానిచోఁ గాలమే నీతిఁ గఱపఁ గలదు.

చం. ప్రతినిధిసంఖ్య సంస్థలకుఁ బ్రాణము వోయఁగ లేదు, ప్రేక్షకుల్
సతమధికమ్ము నైనను బ్రశస్తివహింపఁగ లేదు సేవకై
యతుకుడు కాఁడుగాక హృదయ మ్మిసుమంతగలాఁడె దేశముం
బ్రతుకఁగజేయు నన్యజన వర్గమునుం బ్రదికించు దిట్టయై.

సీ. పట్టిన పట్టులోపల గట్టితనమున్న
నుద్రేకరాగమ్ము లూడ్చునతఁడు
మనలేనివారిపై ననురాగమున్నను
నాగరికత్వ సన్న్యాసి యతఁడు
సామాన్య విజ్ఞాన సామర్థ్యమే యున్నఁ
బొలివోవని కుశాగ్రబుద్ధి యతఁడు
పరిపక్వ సంస్కార భావభావితుఁ డయ్యు
నతిమానుషత్వ దయాళు వతఁడు
సైనికులరీతి జీవితాశయములున్న
వింతవారలపై నయస్కాంత మతఁడు
సకలసౌభాగ్య సంధాత శాంతిదూత
గాంధితాత యతండు విఖ్యాత నేత.

కం. పండించువారివలెఁ దా
నుండఁగఁ దలపోయుఁ దోడనుండెడు వారిం
జండింపఁ జెప్పు దేవిధి
దండితన మ్మిదియగాదె తార్కాణింపన్.

ఉ. శాంతము కుంతమై పరులసార మసార మొనర్పఁ జాలు సి
ద్ధాంతములం బురాణములయందు రచించిరటంచు మున్ను వే
దాంతులు పల్క వింటిమి యథార్థము దాని నొనర్పఁ బూనుచో
వింతగఁదోఁచె మాకభినివేశము చాలనివార మాటచే.

ఉ. నెత్తురుబొట్టుచిందక మనీషులభాషలతోడ రాజ్యము
వ్వొత్తుగనాక్రమింపఁ దలపెట్టెను గాంధి తదంతరార్థముల్
క్రొత్తగఁ గానుపించె జనకోటికిఁ బాశవికప్రవృత్తులం
దత్తరమండె నిందుఁగల ధర్మరహస్యము లెట్టివో కదా!

చం. నిరతము రక్తపూరముల నిల్పి మతమ్ము కులమ్ములంచు సో
దరు లరులై విభిన్నపదతత్పరులైరి విదేశపాలకుల్
దురుసువనమ్ముతో నెడఁదలోఁ దవిలించిరి బాడబాగ్ని నీ
తెఱపు మరల్చి భారతసవిత్రికిఁ గూర్చెను ధర్మవీరముల్.

చం పలువుర రక్తమాంసములు పంచికొనం దిన నెవ్వరిచ్చికి
కలిగినవారి కిట్టియధికారము సర్వసమత్వసిద్ధికిం
దలఁచినవారు గట్టిగఁ దినంగఁ గొఱంత యొకింతగల్గువా
రలకయి సామ్యవాదము దిరంబుగ నిల్పవలెన్ జగంబునన్.

కం. పారిశ్రామిక యుగమీ
ధోరణి కనువగును లాఁతి తోయమ్మున నీ
భారతభూమిన్ మార్చుట
లేరికిఁ గాదంచుఁ దోఁచె హృదయములందున్.

తే. ధైర్యసముపేతము జయప్రదమ్మునైన
కార్యములయందు బద్ధకంకణులు ప్రజలు
మా విధానమ్ములకును సామాన్యులెల్ల
వారు సంప్రీత చేతస్కులైరి మిగుల.

కం. నిలుకాల నిలువనేరక
బలవంతముగాఁగఁ గుక్క పాలం ద్రాపన్
బలువుర కంగీకారము
గలుగునె స్వామ్యమ్ము గోరఁగా రారె జనుల్.

ఉ. గుమ్మను కమ్మతెమ్మెరలకుం బులకింపఁగ మేను సర్వసౌ
ఖ్యమ్ముల మేలిసౌధముల నందెడివారల కేవగింపుగా
బిమ్మిటివోక నిల్చి నిఱుపేద నిరర్థక కర్మవాదముల్
నమ్మ నిఁకెంత కాలము మనమ్మున నోపిక పట్టు నెంతకున్

ఆ. కాళ్లవ్రేళ్లఁ బెనఁగి కాలమ్ము నెందాఁకఁ
గడపఁగలఁడు కష్టపడెడు నరుఁడు
యుగయుగాలనుండి మొగసాల నిల్చిన
లేమితోడఁ జేయలేఁడు చెలిమి.

కం. మా మనము సామ్యవాదము
గామించును దార్కికులముగావున మమ్మం
బ్రేమించుగాంధి మే మతి
బూమింగాంచెదము హృదయముల భక్తిమెయిన్

కం. ధన మధికారము భోగము
మును గనుఁగొని లొంగు జనసమూహము నెల్లం
దన సత్యదృష్టిచేతం
బనిగొనె లోఁగొనియె మధురవాక్కులచేతన్.

ఉ. బానిసబోధకుం డితఁడు భారతదేశసమున్నతస్థితిం
గానఁడు శౌర్యధైర్యములఁగానఁడు మానఁడు రిత్తపల్కులం
దానయిచేయు కర్జము నెదందలపోయఁడు సాహసమ్మునుం
బూనఁ డటంచు గాంధి నొక బొంబయివాసి వచించె నుగ్రుఁడై.

ఉ. ఆతఁడు నేఁడు లేఁడు మృతినందెను నేఁడిటనున్న గాంధికిం
జోతలు వెట్టుఁ దప్పక విశుద్ధమనమ్మున, నాఁటిమాన మీ
చేతకు మూలమౌనని వచించును జీవములూఁదియున్న మే
మీతని చేవ నిత్తఱి గ్రహించితి మెల్లర మద్భుతంబుగన్.

కం. యువకులు బాలురు వృద్ధులు
యువతులు దాస్యమ్ముఁదలుప నుద్యమమునకుం
జవముం ఁవము గూర్చిరి
సహిమర్త్యముద్బృష్టిఁ బఱుపసాగిరి దీనన్.

కం. పరపరిపాలన మిల్లు
ద్ధురమై యన్యాయమునకు దుర్వ్యయమునకుం
బరువులు వాఱఁగ మనకిఁక
వెరవేది యనల్ప దీని వీఱఁడితనమున్.

కం. అతిమితవాదము లిత్తఱి
బ్రతుకవు సామాన్యజనుల బాధలు దీర్పన్
గతిసామ్యవాదమని స
మ్మతిఁ దెలిపెద రింకమీఁద మతిమత్ప్రవరుల్.

కం. ఇనుమిక్కిలి కనికరమునఁ
గనుచుండెను దండ్రిలేని కారణమున నన్
మునుపటికంటె మహాత్ముఁడు
జనకునివలె నుండ దానఁ జనవు పెనఁగొనెన్.

వ. 1931 ఫిబ్రవరి మాసమున హస్తినాపురమున జరిగిన గాంధి – ఇర్విను రాయబారము ప్రసంగాంతరమున విడిచితిమి.

కం. పిలువని పేరంట మటుల్
తొలిమలి సంభాషణములతో సరిపుచ్చన్
మెలమెల్ల సాగి యాగెం
గలుగునె లేనట్టి ప్రేమ కౌఁగిట నెచటన్.

సీ. మరియాదమీఱ సంభాషింప వైస్రాయి
యాహ్వానమును గాంధి కనుపలేదు
పలుప్రాంతములనుండి వచ్చినిల్చినవారు
తఱిదప్పెనని నిల్వఁ దలపలేదు
శాసనోల్లంఘనాస్త్రము కేల గీలించి
విడువుఁడాయని యేరు నుడువలేదు
జాతీయయోధు లాచరణసేసెడి విధు
లిదమిత్థమని నిర్ణయింపలేదు
సాఁగిపోవు మహోద్యమచ్ఛాయ లిప్పు
డాఁగిపోవునయని భయమ్మందలేదు
రాఁగలుగు నాపదల నిబ్బరముగ నోర్చి
సేగివలవంగ నిర్ణయించితిమి మేము.

తే. బందిఁబడకుండ మిగిలినవారు శాంతి
సమరముఁ జేయఁగా గంకణములు దాల్చి
నిలువవలెనంచు నిర్ణయముల నొనర్చి
బయలువెడలంగి నిర్వానుప్రభువు పిలిచె.

పంచ చామరము. మహాత్ముఁ డాత్మశక్తిలో సమర్థుఁడైనఁ గాని యా
యహింసయే వ్రతమ్ముగాఁగ నాత్మనిశ్చయించి యే
మహిన్ మహీశునాజ్ఞ నాత్మమాళిఁదాల్చి వచ్చి య
మ్మహార్తమందె మాకుఁజెప్పి ముంచె దుఃఖవారిధిన్.

ఉ. మాకిది కిట్టఁబోవదు సుమా యని పల్కిన నుల్కి గాంధి చీ
కాకు వహించుఁ గాఁదగని కార్యము నాయకుఁ డొప్పుకొన్న మా
పోకలకేమి మేలిఫలముం గననేర్తుము కచ్చలెచ్చినం
బాకము దప్పి ముప్పెగసి భావిశుభమ్ములనెల్ల ద్రుల్చెడిన్.

మంజరీ ద్విపద.

ఎనలేని భావవేదన వహింపంగ
నానుగాదని గాంధితో నాడలేక
గో నణంచితిని నాలోని యూహాలను
మఱచిపో నెంత నిబ్బరము పూనినను
హృదయ ముద్వేగాన సదమదమ్మాను
గరనిరాకరణమ్ము గావింప రైతు
మట్టగోఁచి బిగించె మా మాటనమ్మి
నట్టేటిలోపలఁ బుట్టి ముంచితిమి
మెర మెరలాడిరి పరధరాధిపులు
ఎండ నీడనక కాఁపుండి పండించి
పలురకమ్ముల ధాన్యములు ప్రోవుచేసి
విపణిలో నిల్పఁగా వెలలేకపోయె
గొడ్డుగోదల నమ్ముకొన్న మిన్నందు
నప్పుసప్పులు దీఱవాయెఁ గాఁపులకు
వెనుకటి సిస్తులెల్లను మాపుచేయ
వలెనంచు గాంధి యావైస్రాయితోడఁ
దననిశ్చయమ్మును మునుముందె చెప్పె
రాష్ట్రాధిపతులు కర్జములు చూచెదరు
కేంద్రాధిపతుల కాకృత్యము ల్దగవు
మేలుగూర్చెదము మా పీలువెంబడిని
యనిచెప్పిపంపె నిర్విను మమ్మునెల్ల
నాభిజాత్యమ్ము సమాప్తమ్ము నందె
శౌర్యధైర్యములు ముచ్చముణింగి పోయె
నాలోని ఒడబాగ్ని నరనరమ్ములకు
రవులుకొనంగ నైరాశ్యమందితిని.

# కరాచి సభ

చం. ముడుపులు నాఁడునాటికి విభుత్వము లావొనరించెఁ గర్షకుల్
కడుపులు నాయఁగట్టి యొసఁగం దలపెట్టిరి తాలుతప్పలై
బుడుతలగంజికైన సరిపోవక పంటలు కుంటువడ్డ వీ
బెడఁదలు గన్నులుండి కనుపింపవు రాచఱికమ్ము వారికిన్.

చం. సిలుగులనోర్చి సామములుసెప్పిరి కాదని వాదుఁబూనఁగా
నిలుపుఁడు ముందుముందొసఁగ నిశ్చయముం బొనరింపుఁ డూరకే
యలుగకుఁ డిట్టికష్టసమయమ్ములఁ జూడుఁడటంచుఁ బ్రార్థనల్
సలిపిరి సమ్మతమ్ములు పొసంగక సమ్మెలుగట్టి రుద్ధతిన్.

ఉ. కాతరభావులైన యధికారులు పేరెమువాఱి కొల్వునం
గూఁతలువెట్టి రక్షకులఁ గూర్చిరి రైతుల బందిఁగ్రుక్కి రీ
చేఁతలు కన్నవిన్న వివశీకృతులై జను లుత్తలమ్మునన్
నేతలనిల్పి రందు వరణీయుఁడనై తిఁ దదగ్రగామినై.

ఉ. వేసరి బందిలోఁ బరితపించుచు రైతులునిల్వ వైరితోఁ
జేసెను సంధి గాంధి యదిచేటునకెంతయు మూలమాట నే
గాసిలినాఁడ నాఁడు నుడికారమెఱింగిన యాతఁడిట్లు పే
రాసవహించి చెప్పెను గరాచిసభ న్నను బుజ్జగించుచున్.

శా. ఆతీర్మానము నడ్డువెట్టుటయ లేదా యన్న సందేహమే
చేతోవీధిని దాండవించినది రాశీభూతమై కర్షక
వ్రాత మ్మావిధి రాయబారమున నిద్రాముద్రయందైన సం
ప్రీతిం జెందునె పొందునేసుఖము దూరీభూత ధైర్యాభమై.

ఉ. మానసికవ్యథల్ రుజలు మాన్పోకని నన్నలయించుచుండె నీ
మేనికి మేలులా వొదవమిం బనిపాటుల దుర్బలత్వముం
దానకమయ్యె నే "విపది ధైర్య మథాభ్యుదయత్క్షమేతి" వి
జ్ఞానము నూఁది యుంటిని విచారము నందకయుంటి నెమ్మదిన్.

ఉ. దోసములిట్టి వీయుపకృతుల్పొనరించిన శిక్షలిట్టి వీ
శాసనపంక్తు లిట్టివి విచారములిట్టి వటంచుఁ దెల్పకే
మూసిరి కారఁ గర్షక సమూహములన్ మితిలేని శిక్షలన్
వేసిరి పాలకుల్ బెదరుపెట్టిరి మట్టిరి కాలుసేతులన్.

కం. వీరి శ్రమకుల్పు బందిం
దూరమ్మొనరింప నిర్వానుప్రభుఁ గాంచన్
గోరిక వోడమెను గాంధికె
సారస్యము గుదిరి కొంత చక్కఁబడియెన్.

కం. బెంగాలు పులుల భగవ
త్సింగును శ్రీరాజగురుని దేవుని శిక్షన్
మ్రింగెడు చట్టము లగలిం
పంగను సమకట్టె గాంధి ఫలముడివోయెన్.

క. దేశము నలుగడ జను లి
పాశవిక విధానమునకు భయపడిరి మహా
క్రోశన మొనరించిరి భూ
మీశుల నెదిరింప నిశ్చయించిరి దృఢతన్.

ఆ. చంద్రశేఖరజడు సాంద్ర ద్వీపేంద్రంబు
దెసల నొత్త మాఱుమసలె నాఁడు
హింస హింసతోడ నెదిరింప సమకట్టె
నంటుకాఁడ్రు వెంట నంటె నిలువ.

చం. పదుగురు గూడి వీని ఒరి ప్రక్కలు నొక్కిరి నజ్జునజ్జుగా
సదమదముం బొనర్చిరి పసాపడి రెమ్ములగుజ్జు దానితో
మదిమెరియంగ నాఁటి యవమానము గన్నులఁ ద్రేలఁ గత్తికిం
బదనిడె జీవకోటి నణుమాడఁగఁ గొంకఁడు జంకఁ డెంతయున్.

కం. హింసకు హింస యొనర్పఁగ
మాంసాశనుఁ డామతించి మన్నించును వి
ద్వాంసుఁ డెవఁ డాదరించును
శాఁసనమా పథము ద్రొక్కఁ బడయునె మేళుల్.

కం. అను ననుభావము రా నను
గని హృదయము విప్పి చెప్పి కాల్గదలించెన్
జనితానంద రసప్లుత
తనువున రోమాంచ మెనసి తనిసితి నెడఁదన్.

కం. తలదాఁచు కొనఁగఁ జోటుం
గలుగమి రక్షకులు వానిఁ గాల్చిరి నా నేఁ
గలఁతపడి వింటిఁ గంటిం
గొలకుల నీరురల నొచ్చుకొంటి న్నివులన్.

కం. బందెగొనఁ గుందు కర్షక
సందోహము విడువఁబడియె సంతోషముతో
నందెను దమ పూర్వరముల
విందుల సందడులు వింత వేడ్కలు నమ్యోన్.

కం. ఎచ్చటఁ జూచిన విడుదల
వచ్చినవారలకు వినతిపత్రములు సభల్
ముచ్చట లూరేగింపులు
నచ్చుపడెం జనత జయజయధ్వానులిడఁగన్.

ఆ. జనులు వెల్లివిరిసి సభలను గావింప
నేలికలకు నోడలు గాలిపోయె
పంటిబిగువు పెదవికంటెను గంటికి
మంటలెగసె దురభిమాన మడరె.

ఆ. శాంతిసమరమందు సత్యాగ్రహమ్మన
నాయుధమును బట్టినట్టివాఁడు
బందినుండి విడువఁబడ జానపదులకుఁ
గ్రమ్ముకొనును విజయగర్వరేఖ.

ఆ. గర్వభంగ మైనగతి నధికారులు
మంట లెగయఁబోసి మండిపడిరి
విజయగర్వమంది వెక్కిరించినయట్టు
చనుపకట్టు చుట్టుజనము చూచి.

చంద్రవర్త్మ వృత్తము
తారు దారె నిజ ధర్మము వదలన్
మాఱుకొన్న తమ మానస మగలన్
పారతంత్ర్యమునఁ బాదము గదలన్
మూరిఁబోయి నిజముం గన రెదలన్.

తోటక వృత్తము
పలుబాధ్యత లుండిన పాలకులే
నిలువెల్ల విషమ్మన నిక్కినచో
నిల సీడయుఁ బాడయు నిల్చునటే
కలకాలము పాలన ప్రాలునటే.

సీ. వ్యావసాయకవృత్తి పాలింప నాలింప
నూహింపదయ్యె నుద్యోగ సమితి
మడిమాన్యములవచ్చు గుడికాసు మడికాసు
నడియాస విడఁడు గ్రామాధికారి

పైరుపచ్చన లెల్లఁ బడిపోవ సుడివోవఁ
బడిగాఁపు తనమూనె బక్కరైతు
తినఁ ద్రావ దొరకమి యెనుపోతు గడిపోతు
గాఁడి పట్టిన బిట్టు గలఁగెఁ గాఁపు
తముకు వేయించి జనుల రక్తముల నోడ్చి
పన్నురాఁబట్టెఁ గసిపట్టి పాలెగాఁడు
వడ్డిమెపరి కుదువలు వాడ్చికొనియె
నడుకు బ్రదుకులు గడతేఱవయ్యె నాఁడు.

కం. పస్తులఁ గాలము గడపుచుఁ
గస్తికి గుఱియైన కర్షకవ్రజ మిపుడీ
సిస్తుల నోసంగఁ జాలదు
స్వాస్త్రీ యనుఁడు రద్దు పద్దుల కెల్లన్.

ఆ. పాలెగాండ్ర నడుగఁబనిలేదు రైతుల
నోగులుమీరె తీర్ప నగునటంచు
వ్రాసి పంపినాఁడ రాష్ట్రాధిపతులకు
నాలుపోలు గానమైతి మింత.

ఆ. ఆలసించునంత నధ్వానమాయెను
కష్టనష్టములను గాడుపఱిచె
రైతులోకమెల్ల రారాపులకుఁ జిక్కి
బెండగిల్లి బీదబిక్కి యఱచె.

కం. ఈ తరుణమ్మునఁ గాంగ్రెసు
జాతీయులు నడుముగట్టెఁ జాలిరి ప్రజయుం
బ్రీతిపురస్సరనిధ్యా
నాతత సోత్కంఠ మగుచు నభినందించెన్.

ఉ. భారతదేశ కర్షక విభాకరుఁడౌ గుజరాతువాసి స
ర్దారు పటేలు మేలుసరదార్లు సబర్మతియోగి దివ్యాక
ర్ప్వారసుగంధకుందసుమముల్ పరితోషముతో బహూకృతుల్
గా రచియింపనిల్చెను గరాచి పురీవర సింహపీఠికన్.

చం. అది నిజమైన గాంధివిజయమ్ము మహామహు లెవ్వరైన నా
యెదిరికివచ్చి నిల్వరు మహీశులు కిమ్మని నోరువిప్ప రా
యదన్నన సభ్యులెల్లరు మహాత్మకు జేయను నాదమాధురిం
బొదలిరి, చేరి రెట్టమఱువుల్ గయిసేసిన వార లాసభన్.

తే. తొలుదొలుతఁ గాదుకాదని పలికి తుదకు
సమ్మతించితిఁ గార్యవర్గమ్ము సభను
మూదలించిన నాఁటితీర్పులకు నేను
నలువు రొకమాటమీఁదఁ బోవలయు సుమ్ము.

ఆ. ఇట్టి తీర్పు బయలు వెట్ట గాంధియు నన్ను
హెచ్చరించె మనసు నొచ్చుకొంటిఁ
గాదటన్నవాఁడు మూదలించిన యెడ
డిందుఁగాదె జనుల సందియమ్ము.

కం. అంగీకృతమా దానికి
లొంగుట శ్రేయమ్ము మనసులో మాటలతో
వింగడము చూప జనులా
వెంగలిఁ గలనైన నమ్మి వెంటాడుదురే.

ఆ. బొఁకుదూసినట్లు పలికెడు వారలు
మొదట మొదట సంఘమున వెలుఁగరు
కాలమింత గడవఁగా వారె మర్యాద
లందఁ గలరు మేలు పొందఁగలరు.

కం. లో వెలి నొకటిగ మెలఁగెడు
లావరి కేనాఁడు కీడు రాదని యెడఁదన్
భావించితిఁ దీరుపు సం
భావించితి వించితిని సభాముఖమందున్.

ఉ. నీతికి నిల్వ నేరని మనీషుల భాషలలో నలంకృతుల్
చేతము హత్తునా! పరుల జీవన శుద్ధికి బుద్ధి కించునా!
జాతికి వన్నెవాసి నెఱజాణతనమ్ములు గూర్చునా మహా
ఖ్యాతి గడించునా! పలుముఖమ్ముల విస్తృతి నంద నేర్చునా!

కం. ఆ సభ నే మాటాడిన
బాస నలంకృతియు మధురభావము పదవి
న్యాసము హాస్యోద్బోధము
వీసమ్మును లేక వెల్లి విరిసె నిజమ్మున్.

ఆ. బూఁజుపట్టినట్టి పూర్వధర్మమ్ముల
వడుకునూలు నేతవస్త్రములను
గృహపరిశ్రమములఁ గీర్తించుటే తక్క
లాఁతి నెఱుగరైరి నేతలెల్ల.

చం. కడచిన కాలమానములఁ గాంచి పురాతనధర్మశాస్త్రముల్
నొడివిన లాభమున్నె యతిలోకమహాపథయానచాతురిం
బడసిన సర్వమానవసమాజవికాసము లబ్బునే కడుం
బడలిన ధర్మసూత్రములమార్గము గుర్తెఱుఁగంగ వచ్చునే.

చం. వలయు తెఱంగులం ధన మవారి గడించి నిరంతరమ్ము మేం
డలపయి నిల్చువార లకటా! వరివస్యితులై మెలంగుచో
నలుఁగుఁడువోవకుండునె జనమ్ములు గూబలు పిండకుందురే
నిలువున నీఱొనర్పరె మనీషుల నీధనవంతు లెల్లరున్.

మ. సతతంబున్ వెతలంది జీవితసమస్యల్ దీఱ కల్లాడు దు
ర్గతికిం జిక్కిన వారిభారమును దీర్పంజాలు తీర్మాన మీ
స్థితిలో నిల్పితి సామ్యవాదమని యాక్షేపించి రుద్వృత్తమై
వితథంబుం బొనరింపఁజూచిరి సముద్వేలమ్ముగా శ్రీకరుల్.

తే. పేలవమ్మైన దీని గగ్గోలుచేసి
కట్టుకతలల్లి ప్రజలఁ గూపెట్టినారు
వారి భక్తగణమ్ములోవారు గెరలి
పత్రికల నుబ్బరించి రుబ్బడిగ వడిగ.

ఆ. వెఱలువ్రాసి విసరివేసిన దానిని
సమ్మతింపఁజేయ సభలనడుమ
నిలిపినాఁడనంచు నిందించె లోకమ్ము
వెఱ్ఱిమొఱ్ఱి యూహ లుబ్బుచాఁప.

చం. పరిచయమైన దాదిగ సబర్మతివాసికి నాకు నెప్పుడే
పొరపులు పుట్టనేర వవిపుట్టిన చోటుల బేరసారముల్
నెరపి కుదుర్పఁబోము జననిందిత కృత్య మొనర్పలేము ని
బ్బరము దొలంగ మీమనసు వాఱని పొత్తున కిచ్చగింతునే.

మ. సమతాధర్మము నిల్ప కార్థిక సమస్యల్ దీర్ప కేలాటి సా
ఖ్యము సిద్ధింపదు భావవిప్లవము లాకాంక్షించి కావించు కా
ర్యము దాస్యాంధతమిస్రముల్ దులుపు దివ్యజ్యోతియౌఁ గాని చోఁ
దమకమ్మందిన నేల యూడిపడు స్వాతంత్ర్య మ్మపాతమ్మునై.

వ. ఉత్తరప్రదేశ రాష్ట్రకాంగ్రెసు సంఘు మీ సామ్యవాదపుఁ దీరుమానమును భారత జాతీయానుమోదమును బొనరుప సమకట్టెను. మహాత్మున కీవిషయము నెఱుక పఱిచితిని అతఁ డద్దానిఁ గరాచి సభయం దిడుమని వక్కాణించెను.

చం. అపుడపు డీ సమస్యల సమన్వయమును బొనరింప గాంధియున్
తెపతెపలాడు దేశము దరిద్రతఁజిక్కి విషాదమందఁగా
విపులతరార్తిఁ గుందుఁ బదివేవురు లావటి జీవితమ్ములం
దపతపలాడ నొందు సుఖతం జరియించిన లాభమేమనున్.

శా. మా కీ చర్చలు మాటిమాటి కుదయింపన్ సాహసోద్వేలతన్
బోకుండన్ మెలమెల్లఁ దీర్పులను నామోదమ్ముగావింప నీ
వీఁకన్ జేసితి మంతరంగముల భావిన్ దేశకళ్యాణమున్
సాకల్యమ్ముగఁ గోరువార లిది దోసమ్మంచు వాక్రుత్తురే.

నర్కుటవృత్తము. కనలున నెవ్వరిద్ది యవుఁ గాదని పల్కినచో
మనమున సంశయంపడ సమాజము దీనతఁ జూ
చినఁ గనునీరు బుగ్గలయి చెక్కుల వెక్కసమాఁ
గొనకొని లేమి వాపఁ గయికొందును దీక్షను నే.

జలధరవృత్తము. ఈపని దీర్పరానిదని యెవ్వరిటన్
శాపము గట్టికొందురు కృపారహితుల్
సాపడఁగోరువారల బలంగములన్
మేపుదురే దరిద్రులు సమీహితులై.

ఉ. కామము లేనివారివలెఁ గన్పడి మున్పడి సర్వలోకముం
బ్రాముకొనంగఁ జూచెదు విరాగులు భోగులు గువ్వకోల్కొనన్
భూమి, ధనమ్ము, విద్య, కులమున్, బలమున్ సరిపోవఁ బాలన
శ్రీమహనీయులైన; నివసింప భుజింపను లేదు బీదకున్.

మ. పరదేశమ్ముల సామ్యవాదపథముం బాలించి లోకోత్తర
స్థిరుఁడై కారణకార్యనిర్ణయముతో సిద్ధాంత రాద్ధాంతముల్
పురణింపన్ హావణింప నిల్చు మతిమన్ముఖ్యుండు శ్రీరాయి యీ
కరపత్రమ్మును నాకొసంగెనని పల్కన్ సిగ్గుచిట్టాడెడున్.

కం. గఱనోజ మఱుకువ లెఱుఁగని
నెఱజోదీ తఱచుకాని నిర్ణయమునకున్
గఱకఱి యొకర్బ్పునే సి
గ్గఱి వాక్రువ్వంగ నంతయుల్పుఁడె తలఁపన్.

కం. ప్రాణము పణమ్ముగా నిడి
మానవతను నిల్ప జగము మచ్చరికించెన్
దానొక ధర్మస్థాపన
కై నిలిచినవాఁడు వెంటనంటునె మమ్మున్.

వ. అనేకవత్సరములు రష్యాదేశసంవాసియై యచటిప్రజల వేలుగీళ్ళ లోఁ దాను భాగలబ్ధియైనను "కామింటర్నులు" వీనిని దేశము వెడలనడచిరి. భారతీయసామ్యవాదులునైత మీతని ద్రోహిగాఁ దలఁచిరి 1931 నుండి యించుమించు 1934వఱకు నితఁడు గారలో నొంటిగా జీవితము గడపుచుండెను. ఇదియిట్లుండ—

కం. ఆ పరిషత్తున మల్కాల
కేపాటి ప్రవేశమైన నిడకుండుటచేఁ
గోపోద్రిక్తులునై యభి
శాపించిరి వర్గకలహ సందోహాలులై.

కం. పదునేను పదము లుండిన
సదమున నెందరకు నిలువ జాగా గలుగున్
గిదుక నెవం డోదార్చును
బదవుల కట్టాడ నిలుప వచ్చునె వారిన్.

కం. పసివాని మనస్తత్వము
మసఁగినవాఁ డెల్లవెంట మాత్సర్యమునం
గసరు సివమెక్కి వర్తిలు
దుసికిల్లు సమాజమునకుఁ దొందరఁ గూర్చున్.

కం. ఈ కలఁతల కగ్గంబై
యేకీభావమ్ము వీడి యేగిరి మలకల్
చేకొని మతోద్యమమ్ములఁ
బ్రాఁకించిరి దచ్చికడల బంధురభంగిన్.

మంజరీ ద్విపద
ఈ మతోన్మాదమ్ములో మారణాగ్ని
నల్లులగతి మాడినారు మానవులు
పాపమ్ము పుణ్యమ్ము పరికింపఁ బోక
పతిముందు సతి కేలు పట్టి పాలార్చి
తల్లిముందఱ పిల్ల నల్లాడఁజేసి
వలనైన బలువస్తువులఁ జూఱలాడి
కనలి మాడువుల నగ్గిని బుగ్గిచేసి
వీరవిహారమ్ముతో రవళించె
మతమహామారి సంబరము వెలార్చి,
పంజాబులో రేఁగు బడబానలమ్ము
మునుకొని కాశ్మీరమును బుక్కిలించె
జే శాంభవీ శివాజీ జే యటన్న
నులివు హిందువు నరమ్ముల మాఱుమ్రోఁగెఁ
జినపీరు పెదపీరు జే జే యటన్న
నులివు మహమ్మదీయుల రవళించె
నాసేతు శీతాచలాభ్యంతరముల
నుద్రేక ముజ్జ్వాఁతలూఁగి తూఁటాడె
నిరువెగలకు మైత్రినెఱప యత్నించు
సౌజన్యనిధి గణేశ్వర శంకరాఖ్యుఁ
గడముట్టఁజేసిరి కాన్పూరులోన
జ్ఞానప్రపూర్ణుఁ డుత్సాహస్థైర్యములు
వలగొన్న గాంభీర్యవంతుఁడాతండు

కీర్తికై పదవికై యార్తి నందండు
మనసునమ్మిన యుద్యమస్థానమందుఁ
దుదిదాఁక నిల్చిన స్తుతిపాత్రుఁ డతఁడు
మృత్యుదేవత నెదిరించె నిర్భయతఁ
ద్యాగశీలముల కాతఁడు కాణయాచి
యాచంద్రతారార్క మాతని యశము
పర్వమై యెసఁగును భారతీయులకు
ధ్రువతార వానియద్భుత తేజమాను.

# సంచారము

కం. ఊటుట యవసర మిపుడీ
తీటిక లేపట్టి పనులఁ దేర్చుట భరమౌ
చేరి పెఱనేల నెల్ల వి
చారమ్ముల మాను మనిరి శారీరజ్ఞుల్.

కం. ఒజ్జలవలె వెజ్జులు నా
పజ్జల నివసించువారు పలుకుట యొక్కపై
విజ్ఞోడు పడమి దానికి
నజ్జ గదల్పంగ లేని యట్టేడ నైతిన్.

మ. ఎటు నేఁ జేరిన నెల్ల నెచ్చెలులు నన్నీక్షింప నేతెంతు రూ
అటఁ గల్పింపరు రాజకీయముల మాత్రం బాస్థ విన్పించి సం
కటముం గూర్తురటంచు నెంచితిని లంకావాసముంజేయ న
ప్పటికిం దోఁచెను నాతి గూఁతురును దోడ్పాటొంద నే నేగితిన్.

కం. "నువరా యెలియా" యనియెడు
భువిమాత్రము రెండు వారములు సుఖపడితిన్
యువకులు కూలిజనమ్ములు
సవసవ గుర్తించి చేరసాగిరి నన్నున్.

ఉ. ఎంతయు నాదరమ్ము వెలయింతురు కార్మికు లారివేరముల్
చెంతలఁ జేరఁబోవు దరిచేరిన నిల్వావు సొంతలాభపుం
బుంతలఁ బ్రొద్దుపుచ్చెడు ప్రబుద్ధుల బుద్ధుల కల్మషమ్ము లో
క్కింతయుఁ గానరా వటఁ బరీక్షయొనర్చిన లేశ మేనియున్.

చం. కలిగినదానినే తనివిగాఁ దిని మేనికి నీలిపేలికల్
తలకొక ప్రాఁత చుట్టి తనదారి దొలంగక రేపగల్లు వి
మ్ములఁ జరియించువారి గొఱ మ్ముట్టుగ లోకము లెక్కసేయఁగాఁ
వలకొనె నిట్టిపాపము జనాబద లెన్నటికైన నయ్యెడున్.

చం. సుకముల నెల్లవేళఁ జవిమాచెడువారలె చేఁదుమేయఁగాఁ
దికమకలందరేల నలుదిక్కులు పిక్కటిలంగ నొక్కపై
మెకమెకపాటుతోడ దిగమ్రింగెడు కాలము దాపరింపఁ గా
ర్మికుల నెదిర్చి నిల్చెడు నరిందముఁడౌ మొనకాఁడు గల్గునే.

చం. అలసటచే లభించు రుచిరాన్నము మెక్కి ననుంగుఁదమ్ము లీ
యలసులఁ దిండిపోతుల భయంకరమూర్తుల నెన్నఁడేనియుం
దలపరు కాలకర్మము లెడం దలపోసి చిరంతనమ్ములౌ
పలుకుల బిగ్గఁబట్టి యెగఁబ్రాఁకుదు రూర్ధ్వజగమ్ములోనికిన్.

మత్తకోకిల. కూరగాయలు వెన్నముద్దలు కొల్లకొల్లలు పూవులుం
దీరుతీరులు పూలబుట్టలు తేనెదుత్తలు మిక్కుటం
బౌరువాణపు మేలిదుస్తులు నందచందపు బండముల్
దూరదూరపుఁ గూలివారలు తోడఁదెత్తురు గూర్మితో.

స్వాగతము. తూలియున్న తమదుస్థితిఁ దెల్పం
జాల జాలిఁబడి స్వాగత మీయన్
మేలిమాటలకు మేనులు పొంగన్
గూలివారు మముఁగొల్తు రెడందన్.

కం. పెను లేమిడిచేఁ గ్రుంగెడు
జనులిడు వస్తువులు వైద్యశాలకు నిడితిన్
ధనికుల కీ తెంపమఱినఁ
బనవునె లోకమ్ము లిట్టిబాధకు గుఱియై.

కం. ఆ లంకాద్వీపమ్మున
నాలోకించితిమి సుందరారణ్యములన్
గేళీదీర్ఘికలను దే
వాలయముల బౌద్ధభిక్షుల యారామములన్.

కం. చైత్యమున బుద్ధ విగ్రహ
మత్యంత మనోహరమ్మునై పొడకట్టెన్
సత్యాహింసలు లోక
స్తుత్యములై వీనివలన సూ వెలుఁగొందెన్.

కం. కక్కసము వెడలఁ గ్రక్కుచు
నిక్కుచు నిక్కమ్మువీడి నిందాపథముం
ద్రొక్కెడు మ్రుక్కడి మూఁకలె
మ్రొక్కెను జక్కఁగ ముడిచి హస్తముల ఫాలతలిన్.

తే. కులమనుచు గోత్రమనుచు గగ్గోలుచేసి
మతమనుచు మంత్రమనుచు నమ్మకము చెప్పి
యూరునాడెల్లఁ గూపెట్టు మోసకులకు
సత్యధర్మములం దెల్పఁ జాలె జినుఁడు.

తే. ఆ శిలా విగ్రహమును గన్నారఁ జూచి
గౌతముని మేలి జాతక కథల నెఱిఁగి
తన్మయతఁ బోని మానవ తత్త్వమున్నె
శాంతి వడయని మానవజాతి యున్నె.

తే. ఖండ ఖండాంతరముల విఖ్యాతిఁ గాంచి
శమ దమమ్ముల వెంట జీవముల నూఁది
శాంత్యహింసల నైతికశక్తు లునిచి
నిద్దురం గూరు లోకమున్ మేలుకొలిపె.

శా. ఆ మాయారహితమ్ములౌ నుడులలో నా ధర్మ జిజ్ఞాసలో
నా మందస్మితముగ్ధ చంద్రికలలో నా మౌనముద్రాలలో
నేమేమో వరధర్మమర్మములు నూహింపం జగజ్జాలముం
ప్రేమింపన్ సమకట్టినట్టులను గాన్పించుచుం జిదానందమై.

ఆ. ఒక్కయేడు గడచెనో లేదొ ఒందిలోఁ
జిక్కకొంటిఁ గంటిఁ జిత్తశాంతిఁ
జెలిమికాఁడు బుద్ధచిత్తరువుం ఒంప
నదియె తోడునీడ యయ్యె నచట.

చం. మనము మహాగ్నికుండమయి మాఁడెడు వేళల మానవత్వమే
తొనకెడు వేళలం బరులనోసము లెన్నెడు వేళలన్ మహా
మునిజిను సుప్రసన్నమగు మోమును జిత్తరువందుఁగాంచి శాం
తిని గయికొందు మానవత నిల్పుదు లాఁతికి మేలుగోరుదున్.

శా. ఆ సిద్ధాంతములెవ్వియో యెఱుఁగ నావ్యక్తిత్వపూర్ణత్వమే
దాసుం జేసె మతప్రసక్తులకుఁ జిత్తంబింత పోనోప దే
వో సర్వజ్ఞుని సార్వకాలికబుుతంబుల్ మానసంబంటు వి
ద్యాసంపన్నులకంచు వింటి నదితథ్యంబంచు నేఁడెంచితిన్.

సీ. తరతరమ్ములనుండి తనదాఁక సాగించు
పాలనక్రియ నఱ కాలఁదన్ని
దేహధారికిఁ బ్రకృతిప్రసిద్ధంబైన
కామమ్మునకు బండికల్లు వెట్టెఁ
బెనుఱొంపిలోఁబడ్డ జనులఁ బైకెత్తంగ
నేనైకపుత్రు నిరాకరించె
వెలలేని సుఖములఁ దులఁదూఁగు నేనుమే
నుల రెంటి బంధమ్ము డులిపివైచెఁ

ప్రకృతికి నజేయుఁడై సర్వభద్రములను
ప్రాణికోటికిఁగూర్ప సన్న్యాసి యయ్యెఁ
ద్యాగమన నింతకంటె వేఱైనదేమి
శాక్యసింహుని జీవితచరిత మసదె.

కం. ఔద్ధత్యమెల్ల నణఁచియు
బుద్ధివికాసమ్ము దిశలఁ బొందింపంగా
శ్రద్ధాళువులా భిక్షుల
బౌద్ధారామములఁ జూచి భావము పొంగెన్.

కం. మానసిక యుద్ధములఁ గా
లూనక తము నాశ్రయించు నున్నతుల మహా
యాన మ్మొఁతగఁగొని గం
గానదివలె సాగు బౌద్ధకర్మంది భువిన్.

కం. మడిగూటి కాసనేసెడు
మిడిమేలపుమంద మందె మేలము లాడన్
బడుగులు సుడివడి మ్రగ్గెడు
వెడఁగుఁ దనమ్మునకు గుండెవ్రీలును నాకున్.

కం. కల్లోలము పెల్లుబికిన
నుల్లము శాంతిల్లుకెట్టు లుచితజ్ఞులు సం
ధిల్లక సత్కృతి సేయఁగ
మల్లడిఁగొని పూన వల్లమాలిన పనియా.

చం. కులము మతమ్ముఁగ్రమ్మి సుడిగుండము రీతిఁ గలంతపెట్టగాఁ
బలువురు మోసగాండ్రకు నుపాశ్రయమయ్యెఁ దదంతరమ్ములం
దొలఁగిన మాఁడిపోవుదురు దుర్బలు లాత్మబలమ్ముకోసమై
నిలుతురు కంచుకోటలను నిల్పుదు రెల్లరుగూడకుండఁగన్.

ఉ. ఈరకమైన సేగి హరియింపఁగ సమ్మతనూ మతంబు ై
భారత మాతసాత్రి నిలువన్ వలె దానికి నారటించు నా
కోరిన కోర్కె యెట్లు సమకూడునటంచుఁ దపించుచుంటి నీ
పోరచివాదముల్ వినవఁ బోవదు సోదరు లేమిసేయుదున్.

చం పదుగురిమేలుగోరిన సుభాషితముల్ నిగదించువాడు స
మ్మదమున నిత్యజీవితము మార్చుకొనంగ వలంతులైన చో
మొదలిటికే యనర్థములు ముప్పులు తప్పులు ముప్పిరింగొనం
గొదకొని నిల్చునే మనలఁ గూలువమూఁక లలంతఁ గూర్చునే

కం ఈ యావేశమునంబడె
యాయువు నగమైనయట్టులయ్యెను శాంతి
శ్రీయున్నతి నన్నేవిధి
డాయును నాకెట్లు సుఖముదక్కును జెపుఁడా!

కం. ఐన మనోజ్ఞము కాలము
మానస మలరించె నుష్ణమండల మగుటన్
దానము పానము బోనము
మేనికి జతపడియె మేలిమేలు లభించెన్.

కం. ఆ సింహళేయు లెల్లరు
నాసాసలవచ్చి యంతరాత్మ నివేద్య
వ్యాసంగకలితులై యు
ద్భాసిల్లిరి వర్గరహితభావోత్సుకులై.

కం. ఆ ద్వీపసుందరత్వము
హృద్వీథిఁ దలంచినంత నిగురించును నే
త్రద్వంద్వశ్రీసము పే
తోద్వేగము జీవనాడు లుఱ్ఱూట్లూఁగున్.

ఆ. బందిఁబడిన వేళ వందురు వేళ నా
కీదినమ్ము లెదకు మోదమిచ్చు
మఱపురాని మిత్రమండలి యుండును
గనులముందు వ్రేలఁగట్టినట్లు.

తే. అచ్చోటును వీడి పుణ్యకన్యాకుమారి
దర్శన మొనర్చితిమి సముత్సాహమునను
శాంత గంభీరములు రెండు సౌహృదమ్ము
లీల నెఱపును జెట్టపట్టాలుపట్టి.

వ. అటనుండి కదలి తిరువాన్కూరు, కొచ్చి, మలబారు, మైసూరు హైదరాబాదు మొదలగు స్వదేశ సంస్థానములఁ దిలకించితిమి.

ఆ. వినఁగ వీనులుండి కనఁ గన్నులుండియుఁ
బలుకరింప నోరు గలిగియుండి
చెవిటి గ్రుడ్డి మూఁగ స్థితినుండు సంస్థాన
వాసియైన జనుఁడు వాసిదక్కి.

ఉ. తాన మెఱుంగ రింతపరిధాన మెఱుంగరు పొట్ట నింపఁగా
బోన మెఱుంగ రేమి సుఖముం గన జీవము లూఁది నిల్తురో
దేనికి వీరి కీయపకృతిం బొనరింతురో! యెంతకాల మీ
హీనము మానసమ్ముల సహింతురో యెవ్వ రెఱుంగ నయ్యెడున్.

సీ. ముద్దు ముచ్చటగఁ గాఁపురము సేసెడివారిఁ
బట్టి పాలార్చు భూపాలకుండు
మడి కాసువంకఁ గొంపను గోడు నమ్మించి
సిలుగుల నిడు మంత్రిశేఖరుండు
వాడుకపడి వచ్చు పాలు మీఁగడ నెయ్యి
యలఁతియే యనును గ్రామాధికారి

అధికారి మెట్టికాయలకు లొంగుదుగాని
పెట్టలేమని తిట్టు వెట్టివాఁడు
ఉప్పు చాలలూర నుతికించుకొన నోండు
చీరలేమి భార్య నోరు విప్పు
నిట్టి చెట్టలెల్ల నెబ్బంగి సంస్థాన
కర్షకుండు నోర్వఁ గలఁడు దలఁప.

ఆ. ముక్కు మూఁతి విఱిచి మొనకానివలెఁ జూచు
రాచనగరులోని కోఁచగూడ
దూదికంటెఁ దేలికై దలారికిఁ దోఁచు
దుక్కి దున్నుకొనెడి బక్కరైతు.

ఉ. వెట్టిమొనర్చువారు దమబిడ్డల విద్యకుఁ బంపరాదు రా
పట్టిని వారలే మెడలపైని వహించియుఁ శారశాలలోఁ
బెట్టవలెన్ దమంతఁ గనుపించిన దండము పెట్టఁగావలెన్
బెట్టినదండమైనఁ బృథివీపతి మన్ననసేయఁ డెన్నఁడున్.

ఉ. భారతభూతధాత్రి విభవమ్ము సుఖమ్ము సమస్తమున్ మహీ
శూరపురాధిపుం డొకఁడె చూఱగొనెం దిరువాన్కురీపురీ
దారుఁడు బంధుమిత్రజనతావరివస్యతుఁడయ్యె భోగవి
స్ఫారితమయ్యె వారిపరివారము పూర్ణమనఃప్రమోదమై.

ఉ. కారణమింతలేక యుపకారము సుంతయులేక యూరకే
యీరసమెత్తి తూటువడి యెమ్ములు చిల్లులుపోవునట్లుగా
నేరముమోపి దూరుదురు నిందలువైతురు మార్తురీజమీం
దారులు కల్మిగల్గుసరదారులు లేమిడికల్గువారలన్.

కం. అదనుపదనెఱిఁగి వెంబడి
పదములకుంబెనఁగి యణఁగి బ్రదికినవారిం
బదములనిల్పుదు రధిపతు
లదలింతురు మానవత్వ మాసించినచో

ఆ. ముక్కుఁగోకుకొనిన ముఱముఱలాడిన
బంటుపైద పాదమంటువెంట
నిలువుకాళ్ళ జీతముల నిల్చుటే కాని
యెఱుఁగఁబోరు దేశచరిత మింత.

ఉ. సీవర మాత్మ ధర్మము నశింపఁగఁ జేయ దురుష్కపాలకో
న్మాదము సాటిమానవ సమాజమునుం గబళింప హైదరా
బాదు నిరంకుశత్వ పరిపాలన మాలన పాలనమ్ములం
గాదనె మొత్తుకోళ్లు వినఁగా మొనగాఁ డెవఁడుండు నయ్యెడన్.

సీ. తనలోని కోర్కె చెప్పినఁ దప్పు ముప్పని
నులివెట్టు మానసాందోళనమ్ము
మనవి చెప్పక యెట్టి పనిగాదు గాదని
తోడిఁబడు భావనాం దోళనమ్ము
చనవుతో నోరు విప్పిన ప్రీలు వీఁపని
దోనివోవు భాషణాందోళనమ్ము
మునిముందు ప్రొక్కి నిల్చిన గర్వమగునని
తూఁగాడు సంభ్రమాందోళనమ్ము
కపట మెఱుఁగక తమయంత కల్లువోయి
తరతరమ్ములనుండి తత్తరము గొన్న
పేద సాదులు హైదరాబాదు వారు
వారి యాందోళనమ్ము మాన్పంగ వశమె.

కం. పడఁదిట్టి కొట్టి బందిం
బడవైతురు మేలుకీడు భావింప రిఁకన్
విడుదల మాట యెఱుంగరు
గుడి కుంచము గ్రింగు భృత్యకోటి దలంపన్

మంజరీ ద్విపద.
కులవాదములు ముంచుకొని వచ్చునాఁడు
రాష్ట్రాభిమతము హోరాహోరి రేఁగి
మానవత్వము మటుమాయమౌ నాఁడు
జాత్యంతరమ్ము భాషా విభేదమ్ము
గల తెల్గుయోధుఁ బెండిలియయ్యెఁ దెగువ
మానసరోజిని, యామె మన్ననలంది
వేడుకమై యొక్కనాఁడు మేమంద
యెండకన్నెఱుఁగని యిల్లాండ్ర నెల్ల
ఘోషాకు బలియైన గోలలనెల్ల
నాచారమున గ్రుగ్గు నతివలనెల్ల
గుమిగూర్చి పూర్వధర్మముల మర్మముల
విడఁదీసిచెప్ప నవ్వీరిఁ బ్రోణులెల్ల
విసుమానమందిరి వెట్టిచేఁతలకు
మాయూరు చేరుపిమ్మటఁ గమ్మపైని
గమ్మ యేతెంచె నొక్కమ్మడిగాఁగ
మగువలు, మగవాండ్రమాట వోనాడి
తిరుగుచున్నారు సందేహమ్ము లేక
మగవారిపని తాఱుమాఱయ్యె ననుచుఁ,
గమలకియ్యది చమత్కారమ్ము గూర్చె.



